# భారతి

నవంబరు 1968





వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

---

వెల ఒక రూపాయి

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



నవంబరు 1968



సంపుటము : 45 : సంచిక : 11 :

విడిప్రతి వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## నవంబరు 1968



---

# ఆశాసుందరి

శ్రీ నూతలపాటి గంగాధరం

ప్రేయసి! నీదుఫాలమున వెల్గెడు కుంకుమ చంద్రరేఖ తా
నాయువు తీవ నిర్దయగ నంతము చేయు విశాత హేతికా
న్యాయము నొందు కొందరికి; నవ్యమధారస భవ్యసేదనల్
చేయును కొంతమంది కెద చిద్గగనాకృతి దాల్చనేమిటో!

మృత్యువు లేమికేడ్తు రనిమేషులు—మానవకోటి యున్నచో
మృత్యువుకల్మికేడ్తురిల—ఏడ్చెద రెల్లరు లేనిదానికై;
నిత్యము నేడ్తు నేను రమణీ! భవదీయ మనః ప్రభూత సాం
గత్య సుగంధ సానుభవ గౌరవ భాగ్యముకై ఎదన్ చెలీ!

కరువై ఒక్కట నా ఎడంద హ్రదమున్ గాఢమ్ముగా ద్రవ్వు—రే
ఇరులై ఒక్కట గుండె గూడునను గ్రుడ్లేపెట్టి విద్రించు—పూ
సరులై ఒక్కట గుండె కోవెలను ఆశాజ్యోతి వెల్గించు—నీ
కురులే ప్రేయసి! ఇన్ని రూపముల నాకున్ దర్శనంబిచ్చెడున్.

తీయని నెయ్యపుం బడిసి తీగల వేగము మీటి—గూటికిన్
వేయని వెండివాకిళుల వెచ్చగ తీయగ పొంచికాంచు నీ
మాయల దొంగచూపులను మాటికి మాటికి నా యెడందనే
కోయక కోతువే చెలియ! గుండియకాట్లకు మందు ఏమిటే?

ఝరియై మంజరియై లతానికరమై సౌరభ్యసౌభాగ్యమై
ధరయై సాగరమై ధరాధరమునై తారాపథంబై చరా
చరమే నీవయితోతు వొక్కపరి ఆశాజ్యోతి! నీ రూపమే
కరవై పోవునుగాదె ఒక్కపరి వాక్కర్మంబులే శూన్యమై!

జలధిలోన పెరిగి జలదమందు కరిగి
కొండపైన జారి కోనదూరి
పదములందు చేరి హృదయమ్ముగా మారి
నిలచినావు బ్రతుకు నిలిపినావు!

ఇంచుక పైట జార్చి—తల నించుక పూవులకూర్చి—మోవిపై
మంచుమవోని చంద్రికల మల్లియ తావుల చేర్చి—నీలి రే
ఖాంచల నేత్ర భావముల సన్నిట బాసల రంగుమార్చి—రా
యంచనడల్ హొయల్ చిలుక ఆశరా! ఎవ్వరిగుండె లాగునే.

పరువులేనివాడు ప్రాణమ్ము విలవేసి
మనసు లేనివాడు మమత నిచ్చి
బలము లేనివాడు చలమె బలముచేసి
నిలిపినావు బ్రతుకు కలత అడచి!

జీవనగాన మాధురికి జీవము నీవ—ధరాతలంబు స
ద్భావ పథాంత వర్తనకు ప్రాణము నీవ—తమోంధకార దు
ర్భావ విదీర్ణ దీప్తకరభాస్కర మీవ—మనోనుకూల సం
భావిత భావగౌరవ విభావము నీవ ధరిత్రికిన్ చెలీ!

---



# 'ముఖలింగేశ్వర... త్రికళింగదేవర'

శ్రీ జి. ఆర్. వర్మ

శ్రీకాకుళంజిల్లాలో బస్సు ప్రయాణం చేస్తుంటే తెలంగాణాలోవలె ఏదో ఒక చారిత్రక స్థలం, శిథిల శిల్పం తటస్థపడుతుంది. శ్రీకాకుళంనుండి బస్సు ప్రయాణంలో—అన్నీ పచ్చనిచెట్లు, దూరాన పర్వతాలు, పార్శ్వాన వంశధారానది—చక్కని దృశ్యం. నాటి నగరం—నేటి నగరికటక—ముఖలింగ కుగ్రామాలు. ప్రయాణంలో ముందు కన్పించేది నగరి కటకం. దారి పొడుగునా శిథిలశిల్ప శకలాలు. అక్కడక్కడ దిబ్బలు. అన్నీ పూరిండ్లే.

ముఖలింగగ్రామకం లోన కన్పించేది పశ్చిమాభిముఖంగా నున్న సోమేశ్వరాలయం. దారినపోయే వారి దండాలుతప్ప నిత్యార్చనల్లేవు. గర్భాలయం, చుట్టూ ప్రదక్షిణకు ఎత్తు చేసిన స్థలం, ఆలయంలో సోమేశ్వరుడు తళతళలాడే కృష్ణశిలా లింగ మూర్తి. ఈ ఆలయ నిర్మాతను, నిర్మాణకాలాన్ని గూర్చి చెప్పే శాసనాల్లేవు. క్రీ. శ. 8–9 శతాబ్దంనాటిది కావచ్చు. ఆలయం గోడల్లో గూళ్లు (కోష్ఠ)–అంగుళ మంగుళం శిల్పంగల పలకలపేర్పు. ఉత్తరాన మహిషాసురమర్దని శిల్పం చూడ చక్కగా ఉంది. ఇచ్చట అసురుడు ఎనుమునుండి వచ్చే మానవ శరీరుడు. అర్ధనారి, హరిహర, లకులీశ, గణపతి, గంగాయమున, కుమారస్వామి మొదలగు వారితోపాటు, మాడదగిన మిధున (నాయికా నాయక) శృంగార శిల్పం ఉంది.

తర్వాత కన్పించేది పూర్వాభిముఖంగావున్న అనియంక భీమేశ్వరాలయం. చేరువలో పూరిండ్లు, పశువుల పాకలు. చెప్పదగ్గ శిల్పం లేదు. ఈ నిర్మాణం సోమేశ్వరాలయానికి విభిన్నం. మండపం ఉంది. ఆల



మధుకేశ్వరాలయం గోడపై తూర్పువైపున్న మహిషాసురమర్దని

యంలో శిథిల కార్తికేయాదుల విగ్రహాలున్నాయి. గర్భగుడి పల్లంగా ఉండుటతో పాతాళేశ్వరుడనుకునే వారున్నారు. ఆలయంలో త్రాచుపా మున్నదని సాధారణంగా ఎవరూ చేరరు. ఉత్తరాన బ్రహ్మ. మరో వైపు నరసింహావతారం శిల్పం ఉంది. పాండవుల్లో భీముడు ప్రతిష్ఠించాడంటారు. కాని ఈ భీముడు చారిత్రక పురుషుడైన గాంగరాజుల్లో ఒకానొక అనియంక భీముడు. ఆ రాజు క్రీ. శ. 980–1014 వరకు పాలించిన అనియంక భీము (ఇమ్మడి వజ్రహస్త, ముమ్మడి అనంతవర్మ)డని పరిశోధకాభిప్రాయం. ఉన్న శాసనాల్లో ఎక్కువ చోడగంగువే. అందులో దేవుని పేరు అనియంకభీముడే. కాని ప్రతిమా వాస్తు శాస్త్ర పరిశోధకాభిప్రాయంలో ముమ్మడి వజ్రహస్త (క్రీ. శ. 1038—70) చోడగంగుల (క్రీ. శ. 1078–1142 శాసనం) మధ్యకాలానిది గావచ్చును. చోడగంగు కుమారుడు చతుర్థ వజ్రహస్త దేవుడూ అనియంక (ద్వితీయ) భీముడే.

అనియంక శబ్ద వివరణ చివర చూదాం—కొండపడమటి (గిరిపశ్చిమ) రాజులు నాదెండ్ల వారిలో 'అనియంక' బిరుదుగల రాజులున్నట్లే, వేంగీ చాళుక్యుల్లో విమలాదిత్యుని బిరుదుల్లో 'బిరుదాంక భీమ' గాక 'అనియంకభీమ' ఉంది. వేంగీ కళింగానియంక భీము లిద్దరూ సమకాలికులుకాగా ఆ కళింగానియంక భీముడైన ద్వితీయవజ్రహస్తునకు వేంగీయానియంకభీముడగా, అన్న శక్తివర్మ సహాయపడిన చరిత్ర ఉంది. ఈ అనియంకభీములిద్దరూ పరాక్రమవంతులే. అనియంకలో శబరం తొంగి చూస్తుంది.

అనియంక భీమేశ్వర ఆలయం చేరువనే ప్రాఙ్ముఖంగా మున్నది, ముఖలింగేశ్వరాలయ మనబడుచున్న మధుకేశ్వరాలయం. లలిత కళాభిమానులు, చారిత్రక పరిశోధకులు—అందరూ తప్పక చూడదగిన ఆలయం.

దేవుని మూర్తి పురాతనం, తర్వాతి కాలానిది వేదున్న ఆలయం; ఆ తర్వాతి కాలానిది ప్రాకారం. నాల్గుమూలలా చిరుదేవళాలున్నాయి కాబట్టి క్రీ. శ. 11 వ శతాబ్దానికి పూర్వపు దనాలి.

ధ్వజస్తంభం రోడ్డుమీద ఉంది. ఆలయం వెనుక వంశధారానది ఉంది. ముందుకూడా ఒకప్పుడు ప్రవహించేదేమో అనే సందేహం పరిశోధకులకూ కల్గింది.

ఆలయం ముందు అటూ ఇటూ సింహాలున్నాయి. ఆలయానికో, లేక వేరొక చోట లభించగా అచట నిల్పారో తెలీదుకాని వాటి తీరు గాంగేయంగాక గుప్తసంప్రదాయం అనిపిస్తుంది.

మెట్లకు ఎడమవైపు—ఎక్కడో దొరికియుండినది కావచ్చును—శిథిల శిల్పం ఉంది. పరిశోధకులు ఈ శిల్పాన్ని 'కిరాతార్జునీయం' అనడం సరికాదు. సాధారణంగా శబరాది గిరిజనుల్లో కాన్పించేటటువంటి పాగా (మకుటం)గల వీరుడు. ఒకచేత బాణం, దంకకు పెద్దవిల్లు, వింటికొనక్రింద—వీరుని పాదాల వద్ద వున్నది పరాజితుడుకాని పందికాదు. వీరుని కో స్త్రీ (చామరపాణి) వింజామర పట్టినది. కాబట్టి ఆ వీరుడొక రాజైయ్యుండును. ఈ శిల్పంలో దాగిన చరిత్ర తెలియదు. కాని ఒక వీరుని విజయ చిహ్నం అనక తప్పదు.

ఎత్తయిన ప్రాకారం—ప్రవేశానికి ఒక దాని తర్వాత ఒకటి రెండు ద్వారాలున్నాయి—పార్శ్వాల్లోను, పైనా శిల్పం ఉంది. ఎడమవైపున్నది ఒకచేత ఆయుధమున్న ద్వారపాలిక—స్త్రీ. ఈమె చతుర్భుజ. చేతుల్లో కత్తి, వింజామరలేగాక పండ్లు, పూజించే బుట్ట వంటిది (సజ్జ) ఉన్నది. పంది ప్రక్కనుండి పోగా ఎదురుగా కన్పించేది మధూకేశ్వరాలయం మధ్యలో ముఖమండపం, గర్భాలయం గలది.

ఇక్కడకూడా ఆలయ నిర్మాత, లింగ ప్రతిష్ఠిత కాలం గూర్చిన శాసనాధారాల్లేవు. శతాధికమైన ఆలయ శాసనాల్లో పురాతనమైనది, తృతీయ వజ్రహస్తుని పట్టపురాణి పృథ్వీ మహాదేవి (క్రీ. శ. 1058) బెజయమ్మ (విజయమహాదేవి)ది. క్రీ. శ. 1068 నాటిది. చోడగంగు శాసనంలో ద్వితీయ కామార్ణవుని తండ్రి దానార్ణవుడు ఇమ్మడి వజ్రహస్త (అనంతవర్మ (ముమ్మడి) వజ్రహస్త, అనియంక భీమ) దేవుడైతే క్రీ. శ. 10 వ శతాబ్దానికే ఈ ఆలయం ఉంది. కాగా యీ అనియంక భీమునికి మరో రాణియందు కల్గిన వానిపేరు మధుకామార్ణవుడు (క్రీ. శ. 1019–1038). ఇమ్మడి కామార్ణవునికి (క్రీ, శ. 1014) ద్వైమాతురుడు.



మధూకేశ్వరాలయ ప్రాకారం రెండవ ద్వారంపై పశ్చిమాభిముఖంగావున్న మరొక చారిత్రక శిల్పం.

మధూకేశ్వరుని పేరీ మధుకామార్ణవునిలో కన్పించుచున్నది. ప్రతిమాశాస్త్రపరిశోధకాభిప్రాయం ప్రకారం ఆలయనిర్మాణకాలం క్రీ. శ. 8 వ శతాబ్దం. చోడగంగు కొర్ని శాసన (క్రీ. శ 1112), విశాఖపట్నం శాసనాల ప్రకారం వంశావళిలో ద్వితీయ కామార్ణవుడైతే ఆలయం క్రీ. శ. 9 వ శతాబ్దారంభానికే ఉందనాలి. కాగా పరిశోధకులీ ఆలయ శిల్ప వాస్తువుల పోలికలు ఉత్కళ కర వంశీయుల నాటి ఆలయాల్లో చూచారు. శిల్పంలో ఆహార్యం పోలికలు 7, 8 శతాబ్దాలనాటి సిర్పూర్ (రాయపూర్ జిల్లా) లక్ష్మణేశ్వరాలయ శిల్పాల్లో కన్పిస్తున్నాయి. ప్రతిమా లక్షణ శాస్త్రజ్ఞుల నిర్ణయం ప్రకారం క్రీ. శ. 8 వ శతాబ్దం ఐతే నాటి రాజులైన ఇంద్రవర్మ, అనంతవర్మ, దేవేంద్ర వర్మాదుల్లో కొందరి శాసనాలు లభించాయి. వానిలో ఆలయ వృత్తాంతం లేదు.

ఆంధ్రేతిహాస పరిశోధకమండలి కార్యదర్శి ప్రొ. రాళ్లబండి సుబ్బారావుగారు నాతో క్రీ. శ. 10 వ శతాబ్దంనాటి నిర్మాణం అన్నారు.

దేవుని ప్రతిష్ఠాకాలం పురాతనం; తర్వాత బహుశా 7–8 శతాబ్దాల్లో మధూకేశ్వరాలయ నిర్మాణం, ఆ తర్వాత క్రీ. శ. 11 వ శతాబ్దం వరకూ ప్రాకారాదులు, చిరుదేవళాదులు నిర్మాణం అయ్యుండునవే నా నమ్మకం. అసలు దేవాలయం శిథిలంకాగా వాటినీ, అచటచట లభించిన శిల్పశకలాల్నీ కతిపయకాలపు ప్రాకార నిర్మాణాల్లో ఉపయోగించారేమోననే సందేహం కూడా ఉంది. కొన్ని చిరుదేవళ శిల్పాలు మధుకేశ్వరాలయ శిల్పానికి భిన్నంగానూ ఉన్నాయి.

దక్షిణ కోసలాధిపతులు ఈ కళింగ రాజ్యాన్ని జయించి కొందరు త్రికళింగాధిపతులమన్నారు. తిరిగి గాంగుల కోడిపోయిన ఆ పాండు (శబర) వంశీయులు ఓఢ్రప్రాంతాలకుపోయి కరవంశీయులైనట్లున్నది. మహాశివగుప్త ధీవరదేవుడు, (క్రీ. శ. 549–55) పాండువంశపురాజు తాను కూడా త్రికళింగాధిపతి నన్నాడు.

రాజధాని అర్థంలో కళింగ నగరాలు చాలా



మధూకేశ్వరాలయం ఆగ్నేయ మూలలోని దేవాలయ కుడ్యంమీది శబరవీరుడు

ఉన్నాయి. 'గంగామలకుల ప్రతిష్ఠిత' హస్తివర్మ (క్రీ. శ. 571–81) శైలోద్భవుల గెల్చినాడు. రాజధానిని దంతాపురంనుండి మార్చినాడు. నూతన రాజధాని కళింగ నగరం. ఆ కళింగనగరంలో విజయ చిహ్నంగా ఆలయ నిర్మాణంచేసిన శాసనాధారం ఉంది. అదే ఈ మధూకేశ్వరాలయం అయ్యుండునా? గాంగులు పేర్కొన్న కళింగనగరం, చోడగంగు పట్టాభిషిక్తుడైన నగరం ఒకటే ఐతే హస్తివర్మ రాజధాని కూడా నేటి నగరకటక – ముఖలింగమేననీ అనుకోవాలి. పశ్చిమ చాళుక్య కీర్తివర్మ క్రీ. శ. 537 లో కళింగమును ఓడించెను, తర్వాత సత్యాశ్రయ పులికేసి జయించెను.

నగరికటక–ముఖలింగ ప్రాంతాన దిబ్బలు చాలా ఉన్నాయి. ఒకచో కోటదిబ్బ అనబడే తావూ ఉంది. కాని ఇంతవరకు దుర్గ శిథిలా లనేవేవీ లభించలేదు. వేంగిలో విష్ణుకుండిను లంతమైనా, పశ్చిమ చాళుక్య, రాష్ట్రకూట దండయాత్రల తర్వాత కూడా కళింగాన పాలకులు గాంగులే.

మధూకేశ్వరాలయం గూర్చిన చర్చకు ముందుగా చిరుదేవళాలు, తదితర శిల్పం చూడాలి.

ప్రదక్షిణం చేస్తుంటే దక్షిణంవైపు ప్రాకారం గోడవద్ద నిల్పిన శిల్పాలు మరొక చోటనుండి తెచ్చినవిగానే కనిపిస్తాయి. భూమిస్పర్శముద్ర బుద్ధుని పెద్దవిగ్రహం అలాంటిదే. కొంద రీ విగ్రహం జైనవజ్రనాథుని దన్నారు. ఇదొక పురాతన బౌద్ధక్షేత్రం అనే విషయం తర్వాత చూదాం. అలాంటివే వేరుస్థానాల్లో లభించినవాటిని మధుకేశ్వరాలయంలో ఉంచారు. వాటిలో వాగ్దేవినే పరిశోధకులు జైన సరస్వతి (విద్యాదేవి?) అన్నారు. ఈ శిల్పం చూడ చక్కనిది.

అలా తెచ్చిపెట్టినవాటిలో గరుడ (వాహన) విష్ణు. యజ్ఞవరాహమూర్తి విగ్రహాలు ఏమాత్రం మధుకేశ్వరాలయానిగ్గాని, గాంగులగ్గాని చెందినవిగా కన్పించవు. ఈ విగ్రహాలవంటివే రాయపూర్ జిల్లాలో (ఛాయాచిత్రాలు చూపాము) గుప్త సంప్రదాయ శిల్పం—దక్షిణ కోసల పాండు (ఉత్కళకర) వంశీయు లవే గావాలి.

ఆగ్నేయంలో చిరుదేవళద్వారశిల్పం తదితరంగా వుంది. పద్మాలు, ఆకులు చాలా ఉన్నాయి. సూర్యదేవు డున్నాడు. కరవాలంపై ఆనుకున్న స్త్రీ ఉంది. ఒకవైపు మొలలో బాకున్న ధనుర్ధారి ఉన్నాడు. పశ్చిమాభిముఖంగా వున్నది ఇంద్రేశ్వరాలయంగా భావింపబడినది. ఈ దేవళంపైగల ఒక వీరునిశిల్పం



సోమేశ్వరాలయం గూటిలోని ఒక శృంగార శిల్పం



మధూకేశ్వర దేవాలయంలో వాయవ్యమూలలో నున్న చిన్న దేవలంపైని ఒక శిల్పం

వుంది. పరిశోధనీయం అనుకొంటున్నాను. డాలుపై ఆనుకొన్న ఈ ఖడ్గపాణి ఒక రాజై యుండును. ఇతని పోలిక మరోచోట ఉన్నది.

నైరుతిలో ప్రాఙ్ముఖంగావున్న దేవళంపై ఆలింగనామూర్తి చూడదగిన శిల్పమే. ఈ దేవళంపై వేణుపాణిస్త్రీ, ఏదో భూతం, అంజలి ఘటించిన పురుషుల వరస, కమలఖడ్గాలుపట్టిన స్త్రీ, మొదలగు శిలా లున్నాయి.

పశ్చిమమున కుమారస్వామి చిరుదేవళం ఉంది.

వాయవ్యంలో పూర్వాభిముఖంగా వున్న దేవళ శిల్పం కూడా పరిశోధనీయ మనిపిస్తుంది. పార్శ్వాల్లో మయూరాసనంలో కుమారుడూ, గణపతి; త్రిపాద శివుడు (దక్షిణ), వృషభవాహనమూర్తిలో విశేషం కాదు. కొంద రీ దేవళాన్ని యమేశ్వరాలయము అన్నారు. ద్వారశిల్పం పైన—ఏనుగులు, గుర్రాలపై వారి ద్వంద్వయుద్ధ దృశ్యాలు, ఇందులో స్త్రీలూ ఉన్నారు. ఏనుగుల పాదాల్కింద, తొండములో చిక్కినవారున్నారు. ఈ తోరణశిల్పం ఏదో ఒక చారిత్రక విషయాన్నే సూచిస్తుందా ?

పృథ్వీమూలుని గోదావరీశాసనంలో విషయం. నైరుతి దిగ్గజమైన కుముదము ఈశాన్య దిగ్గజమైన

సుప్రతీకమున కోడిపోయిన విధము ప్రతీకంగా 'అనేక చతుర్దంత సమర సంఘట్ట ద్విరదగణ విపుల విజయు'డైన వేంగీ ఇంద్రభట్టారకవర్మ, 'గంగామల కుల గగనతల సహస్ర రశ్మి', 'ద్విజాతాన్వయ పయోద సంభూత సితరశ్మి' అయిన కళింగ ఇంద్ర వర్మ (జిర్జంగి శాసనకర్త) కోడిపోయిన చరిత్ర సూచించేదా! గజవాహనుడు ఇంద్రుడు. ఇద్దరూ ఇంద్రవర్మలే.

ఉత్తర ప్రాకారాని కంటి (సంప్రదాయ సిద్ధం) అమ్మవారి కొలయం ఉంది. తోరణశిల్పం సప్త మాతృకలు. కుడి గూటిలో భయంకరవదన బగళాదేవి ఉన్నది. లోన దేవి ప్రసన్న వదన. 'ఘంటామూల హలాని శంఖ ముసలే చక్రం ధనుస్సాయకం హస్తాబ్జైర్దధతీ' కాబట్టి మహాసరస్వతి అంటున్నారు. ఆమెయే మహాలక్ష్మి, మహామాయా వగైరా కాబట్టి దుర్గాదేవి అనుకోవాలి. చూడచక్కని దేవీమూర్తి. చోడగంగు ముఖలింగ శాసనం (శ్రీ భీమేశానికి లభించిన) లో పేర్కొన్న భగవతి ఈమె యై యుండునా!

నైఋతీ వాయుదేవళా లున్నాయి.

వరుణేశ్వరాలయంగా భావింపబడినది, పశ్చిమాభిముఖంగా ఉంది. శిల్పంలో సింహాలు, నారసింహావతారం ఉన్నాయి.



మరొక గూటిలోని బగళాముఖి



ముఖలింగం గ్రామాన లభించిన వాగ్దేవి సుందర శిల్పం

మధుకేశ్వరాలయం వెలుపలి గోడలపై గూళ్ల చిన్నవి చాలా ఉన్నాయి. అనేక పార్శ్వదేవతా శిల్పాలున్నాయి. పూర్వాభిముఖంగావున ఈ ముఖ్య దేవాలయానికి దక్షిణాన మరో ద్వారమున్నది. బహుశా రాణివాసం — స్త్రీల ప్రవేశమార్గమో, భక్తులు దేవదర్శనానంతరం వచ్చేందుకో ఏర్పాటు. ఈ దక్షిణ ద్వారం పార్శ్వాల్లోను, పైనా చక్కని శిల్పం ఉంది. తోరణఫలకంపై పార్వతీపరమేశ్వరులు పాచికలాడుట—ఎల్లోరా రాష్ట్రకూట శిల్పాని కేమీ తీసిపోదు. పడమర గోడపై గణపతి మోదకహస్తుడు గాడు. ఆ గోడపై చూడదగిన శిల్పం ద్వాదశ భుజ నటరాజ. ఊర్ధ్వరేతస్కుడు. దుర్గ (కాళి) నృత్య విన్యాసాల్లో (లాస్యం) శివునితో పోటీపడగా అతి ప్రమాదకరమైన ఊర్ధ్వతాండవంచేసి శివుడామె నోడించిన కథ ఉంది.

ఉత్తరం వెలుపలి గోడపై శిల్పాల్లో శివుని ఏకపాదమూర్తి వగైరాలేగాక సౌరవైష్ణవాలూ ఉన్నాయి. ఈ గోడపైగల ఏమగుముందు నిలిచివున్న

ఇం(దుడే, పరిశోధకులు కొందరు హ(జహస్తదేవ మహారాజన్నారు. ఇలా చారిత్రక పురుషునిగా భావించిన ఆ పరిశోధకులు ఆగ్నేయాలయంపైనున్న వీరుల గూర్చి ఏమీ (వాయలేదు.

మధూకేశ్వరాలయం, కొర్ని శాసనంలో చోడగంగు చెప్పిన '...ద్వారోర్ధ్వ విచి(త పత్ర లతికా శ్చి(తాణి...' వర్ణన అత్యుక్తి అనిపించదు. చాలా దేవాలయాలు చూచాను, అనేకాలయాల శిల్ప ఛ్ఛాయాచి(తాలు చూచాను. మధూకేశ్వరాలయ ద్వార శిల్పం దాని కదే సాటి. పార్శ్వాల్లో గంగా యమునా మూర్తులు. ఆలయంలోకి వెళ్లేవారికి కుడివైపున మహిషాసురమర్దని సుందర శిల్పం. ఇచట మహిషుడు పల్లవశిల్పం పోలికలుగల ఉన్నతకాయుడైన వీరుడు—మహిష శిర్షుడు - మహిషకాయంగాదు, అందుండి వచ్చినట్లులేదు. దేవి ఒకచేత వాని శృంగభంగం చేస్తున్నట్లున్నది.

ఆలయంలో (పవేశించేవారికి కుడిగా ద్వార శిల్పం ((కిందనుండి పైకి) వరుసల్లో యువతి—కోతి వగైరా ఉన్నాయి. ఎడమవైపున శిల్పం ఆధునిక (స్త్రీల్లో కొందరికి వెగటుఅయితే కావచ్చును. ఒక నిత్య సత్యం, విశ్వ సందేశం స్ఫురింపజేస్తుంది. (స్త్రీజన్మ పారమార్థిక (పయోజనం — శ్రేయం మాతృత్వం అని. దిగువ అరలో యువతి (సాలభంజిక—దోహద శిల్పం అనీ అంటారు), చిలుక, చూతఫలం—రెండవ అరలో మిథునం (బహుశా (పథమ పరిచయం), మూడవ అరలో మిథునం, ఆపైన మాతాపు(తులు. ఈ శిల్పం 'కుమార సంభవం' అయితే కావచ్చును.

తక్కువ స్థలంలో సజీవమనిపించే శిల్పం—ఆ రూపకారుల నైపుణ్యం మెచ్చుకోకుండా ఉండలేము.

మధూకేశ్వరాలయ ముఖశిల్పంలో పరిశోధకులు శార్దూం ఎలా భావించారో అర్థం కావడంలేదు.

ఈ ముఖశిల్పంలో పైన మూడువరుసల శిల్పం ఉంది. ఈ శిల్పం నేనుమా(తమే 'ఫొటో' తీసుకోగలిగినందుకు గర్విస్తాను. పైవరుస గజయూథం—కళింగరాజులు గజపతులు— ఏనుగులవేట, మచ్చికచేయు దృశ్యం గావచ్చును. చోడగంగు ముఖలింగ ((శీ భీమేశంకు లభించిన) శాసనంలో అని యంక భీమ ద్వితీయ వ(జ హస్తదేవుడు మద గజాన్నే పరిభవించిన బలశాలి అన్నాడు. రెండవ వరుసలో మృగయావినోదం, (కూర మృగ సంహారం,



కొర్ని శాసనంలో వర్ణించబడిన మధూకేశ్వరాలయ ముఖమండపంపై మూడువరుసల శిల్పం



సోమేశ్వరాలయం ఉద్యాం గూటిలోని
మహిషాసురమర్దని

ఒకనాటి రాజుల 'హాబీ', 'డ్యూటీ'. శతాబ్దాలుగా అనేక సంస్థానాధిపతుల ఆచారం పాటించారు. కాగా వసంతో(చైత్రో)త్సవాల్లో యువవీరులు అడవి జంతువుల - ముఖ్యంగా అడవి పందిని-వేటాడి తేవడం, తెచ్చినవారికి స్త్రీలు నృత్యగానాలతో స్వాగతం-క్షత్రియోచితాచారం. కాని అలాంటి ఆచారం గిరిజనుల్లోనూ ఉంది. మూడవ (దిగువ) వరసలో రాజసభ, మల్ల విద్యాప్రదర్శనాదులున్నాయి. అనేక సంస్థానాల్లో అదో ఆచారం- మైసూరు జెట్టి కులస్తుల చరిత్ర కూడా చూడండి. కళింగ ప్రాంతాన జట్టి అంటే పోరాటమనే అర్థం. కొందరు పరిశోధకులీ శిల్పంలో బలరామకృష్ణులు, కంసుని రాజసభ, చాణూరముష్టికవధ చూచారు కాని నా కంటికేనాడు ఛాయాచిత్రంలో కూడా ఆ భావాలు కన్పించవు.

మధుకేశ్వరమూర్తి ధవళశిలామయం కాని తరుకోటరం విస్పష్టంగా కన్పిస్తుంది. లింగాగ్రం కొంత పాడైనకారణం, అర్చకులు తగవులాటలో పడిన దెబ్బ అంటారు. కాని అది సరికాదనిపిస్తుంది. సుమారుగా సమకాలపుదైన పశ్చిమ చాళుక్యుల అలంపుర క్షేత్రంలో లింగాని కలా ఉందట. అక్కడ లింగాగ్రాన వరుసవేది ఉంటుందనే నమ్మకంలో రససిద్ధులు తొలచివేశారంటారు. అది సరికాదు.

బౌద్ధస్తూపాల్లో ధాతునిక్షేపం పోలికే - దేవునికో ఆలయం మనకు ఇల్లువలె ఉండాలనుకోడం గాదు. లింగమూర్తే కాయం, జీవం ఎగైరా విశ్వాసాల ఫలితం.

మధుకేశ్వరమూర్తి తరుకాండము, కోటర సహితం— ఈ కోటరాన్నే ముఖంగా ఊహించి ముఖలింగేశ్వరుని జేశారు. ఛాయాచిత్రం చూడండి. ఎక్కడా ముఖంలేదు. కాగా మన పరిశోధకులే గాదు; ఇతర ప్రాంతీయులు కూడా పరిశోధించినట్లు కన్పించదు కాబట్టి ఆ కారణాలు వివరిస్తాను.

ముఖలింగం పూర్వం శక్తిక్షేత్రం; జీవహింస కూడా చేసేవారని విన్నాను. కాని చెప్పినవారెవరూ చూడలేదు. శాక్తేయం అనడానికి పరివార దైవాలు ప్రధానంకాదు.

మధూకేశ్వర లింగం వెనుక బెల్లంవండే పెనం వంటిది ఒక పెద్ద గట్టి మట్టి పళ్ళెం ఉంది. అదెక్కడిదో, అక్కడి కెలా వచ్చిందో ఎందు కక్కడ ఉందో ఎవరికీ తెలీదు. ఎవరూ పరిశోధించలేదు.



మధూకేశ్వరంలో గూటిలోని నదీదేవత



పంచాయతన దేవాలయాలలో ఒకదానిమీదవున్న మిథునశిల్పం

అభిషేక జలం అందులో పోయడానికంటారు. అది శిరశ్చక్రంగా భావించారా అంటే లింగమూర్తుల కా సంప్రదాయం లేదు. మధుకేశ్వరుడు వ్యక్తావ్యక్త లింగమూర్తి.

దైవదర్శనం జేసుకొని తిరిగి వెళ్లేవారికి నందిమండపంపై తోరణశిల్పం, పార్శ్వాన సింహ వాహినీ దేవి, ప్రక్కనే మైథున శిల్పం ఉన్నాయి.

ఈ సింహవాహినీ దేవినే కొందరు పరిశోధకులు జైనచక్రేశ్వరి అని వ్రాశారు. శివాలయానికి జైన చక్రేశ్వరి సంబంధం ఏమిటో వారికే తెలియాలి. జైన చక్రేశ్వరి ఛాయాచిత్రం (రాజస్థాన్) నావద్ద ఉంది. ఆమె రెండుచేతుల్లో చక్రాలుంటాయి. నరవాహనికాని మృగవాహిని కాదు.

ముఖలింగంలో వున్న మూడు శివాలయ శిల్పాల్లో శృంగార శిల్పం ఉంది కాని అవేవీ అశ్లీలంగా, కామోత్తేజకరంగాక సభ్యంగాకాన్పిస్తే, మృగవాహినీ దేవి పార్శ్వంలోగల దొకటే మైథున శిల్పం— ఎబ్బెట్టుగా ఉంది. ఐతే ఈ శిల్పంలో తలవెంట్రుకల తీరులనుబట్టి వేరొక శిథిలాలయానివో, మరోచోటివో ప్రాకారనిర్మాణకాలాననే ఇక్కడ పేర్చిపెట్టారేమో అనిపిస్తుంది.

తిరిగి పోయేవారి కగుపించే తోరణ శిలా ఫలకంపై శిల్పంలో కొందరు జైనబౌద్ధాల్లూహించి వ్రాసేశారు. ఈ శిల్పాన్నే వచ్చినవారికి 'శ్రీ ముఖ లింగేశ్వర మాహాత్మ్యం' కథ—శాపతప్తులైన శబరుల కథగా మాపుతున్నారు. పరిశోధకు లీ సందర్భంలో గూడా వకాప ముద్రాంకితులైనందుకు ఆశ్చర్యంగా ఉంది. ఛాయాచిత్రంచూస్తే ఆ కళవిహా కాన్పించక ఒకానొక చారిత్రక సంఘటన శిల్ప మనిపించకపోదు.

రాష్ట్రం, దేశీ, విదేశీ పరిశోధకులు, గ్రంథ కర్తలు శిల్ప వాస్తువులను గూర్చి వ్రాసినదే వ్రాశారు కాని శిల్పంలో చరిత్ర పసికట్టలేదు సరికదా స్థానిక విశ్వాసాల పుక్కిటి పురాణ కథలూ, కాకమ్మ కథలూ విని ఊరుకున్నారు.

చోడగంగు కొర్ని శాసనంలో మధూకేశ్వ రోదంతం మధూకవృక్షం (ఇప్పచెట్టు)నుండి జనించు టచే మధూకేశ్వరుడైనాడని వున్నది. ఇందులో వాస్తవం మధూకేశ్వరమూర్తి మధూకదారునిర్మితం అవాలి.

శబరుల సందర్భం ఉత్పత్తి కారణం కొరుకుడు పడదు. తొలి గాంగులకన్నా మలిగాంగుల విషయాలే ఎక్కువ లభించినందున మలిగాంగుల సంబంధమున సుప్రసిద్ధ దేవాలయాలు పురీ జగ న్నాథుడూ, శ్రీకూర్మం కూర్మనాథుడు— క్షేత్రపతి హ్యాల్లో—స్థలపురాణాల్లో గిరిజన ప్రమేయం చాలా ఉంది. అలాంటిదే మధూకేశ్వర సందర్భం గానచ్చును.

గంధర్వులకూ గిరిజనులకూ మేనమామ సామ్యాలున్నాయి. గానప్రియులు, చిత్రవర్ణప్రియులు, గిరివిహారులు. కాగా రైతు చేతిలో కొడవలి, చేకర్ర అంతముఖ్యంగా గిరిజనుల్లో ఆయుధం, పిల్లనగ్రోవి ఉంటాయి.

ఛాయా చిత్రం చూడండి—మధ్యనొక చెట్టు, గ్రంధ పీఠం—ఒకవైపు ఫలపుష్ప ఆయుధ పాణు లైన గిరిజనులు - వారి నాయకుడేనేమో సాష్టాంగ ప్రమాణం చేస్తున్నాడు ఆయుధపాణియైన వీరుడు. వినయనమితాంగుడైయున్నాడేగాని వృక్షచ్ఛేదనో ద్యుక్తుడుగా లేడు. ఈ గిరిజనులందరూ అతిథిని గౌరవించవచ్చారనాలి. గిరిజన స్త్రీ లుండుటవలన

శాపతప్తుడైన గంధర్వరాజు, ఇరువురు భార్యలు కథ మొలిచినదేమో? ఎడమవైపు ఉత్తమాసనంపై నున్నది ఏ దేవుడూ కాదు. ఏదోవొక విప్రుడు, ఆచార్యుడు, మంత్రిగా తోచును. అతని ఆధిక్యం సూచించుట, వీవనలువేసేవారు, వెనుక మరికొందరిలో చూడనగును. నా కిందులో బౌద్ధం స్ఫురించుటలేదు.

ఈ శిల్పఫలకం ఏదో వొక చారిత్రక సంఘటననే సూచిస్తుందని నా నమ్మకం. ఉన్నతాసీనుడై యున్న వ్యక్తి ప్రణామభంగిమంలోనున్న వీరుని ఆశీర్వదించుటో, ఉపదేశించుటో శిల్పంలో కాన్పించేది- కాని శివుని సాక్షాత్కారం గాదు.

అనేక అనాగరిక సంప్రదాయాల్లోనున్న శబరులను హిందూసంప్రదాయానికి చేర్చుటా? పౌరాణిక యుగాన్నుండి శబరులు ఆర్యులమనేవారికి, ఆ బ్రాహ్మణ సంప్రదాయానికి చేరువైనవారే. వీరిని వారు అసుర దస్యు అనార్యాది నామాలతో వ్యవహరించలేదు.

ప్రాంతీయంగా ఈ కళింగం శతాబ్దాలుగా కాంతారం, కంటకావర్తం, గిరిజనావాసం (నేటికీ చాలచోట్ల.)

ఉన్నతాసీనుడు యజ్ఞం చేస్తున్నట్లులేదు కాబట్టి ఆ వామదేవమహర్షి కాదనాలి.

పొగిలపడివున్న గిరిజనవీరుని పోలిన శిల్పం ఆగ్నేయంలోవున్న దేవళంపై వున్నదిగాని ఆ శిల్ప సాదృశ్యం మధూకేశ్వరాలయంపై లేదు.

వినయనమితాంగుడైయున్న వీరుడు కామార్ణవుడా, వజ్రహస్తుడా, మధుకామార్ణవుడా— ప్రాంతీయ గిరిజన నాయకునితో గాంగరాజమంత్రి సంప్రదింపులా తెలియదు. కాని—

చోడగంగునాటి ఉత్కళ సోమవంశపురాజు మంత్రి ఒకడు రాజుచే పరాభవింపబడి, 'రాజద్రోహి'యై 'కర్ణాటరాజు'ను చేరి ఉత్కళరాజు నోడింపజేసిన ఐతిహ్యం ఉంది. ఆ 'కర్ణాటరాజు' మైసూరు వాడుకాడు — శ్రీ మదనంతవర్మ చోడగంగదేవ మహారాజే. వేములవాడ భీమకవి పేర్కొన్న రాజ కళింగ గంగు, చోడగంగు తండ్రియైన దేవేంద్రవర్మ రాజరాజు కావోపడు. కాబట్టి ఆ రాజు కళింగగంగు చోడగంగే అనాలి. వాటికి వేంగీ చాళుక్య రాజ్యం రాజరాజనరేంద్రుని కొడుకైన రాజేంద్ర చోడ



ముఖలింగం : మధూకేశ్వరోదంతం అనుకుంటున్న తోరణ శిల్పం.

దేవుడనే కులోత్తుంగచోళదేవుని సామ్రాజ్యభాగం. బాగా చోడగంగు విజృంభణ కులోత్తుంగచోళుని మరణానంతర చరిత్ర. ఉత్కళ సోమవంశీయుల నోడించి త్రికళింగరాజై రాజధానిని నగరం (నగరి కటక — ముఖలింగ) నుండి కటకాని(ఒరిస్సా)కి మార్చెను.

శిల్పఫలకంలో ఉన్నతాసీనుడు సోమవంశరాజా మంత్రి అయ్యుండునా? తెలీదు.

పోతే మరో చారిత్రకాంశం. శ్రీ కూర్మనాథాలయానికి బాగా సంబంధించిన నరహరితీర్థులు నాటి కళింగరాజైన భానుదేవుని ప్రతినిధి, రాజగురువు, మంత్రి. క్రీ. శ. 1281 లో శబరులు శ్రీ కూర్మంపై దండెత్తిరాగా ఉపశమింపజేసిన చరిత్ర ఉంది. ఈ శిల్ప ఫలకం ఈ చారిత్రక సంఘటనయొక్క చిత్రణమై యుండునా?

సాష్టాంగపడియున్న వీరుడు రాజై యుండునంటే కొందరు నమ్మకపోవచ్చును. చారిత్రక శిల్ప దృష్టితో చూడాలిగాని సినిమా నాటకాల్లో కవిత్వంలో వర్ణనలు (ఆభరణాలు, వైభవం వగైరా) కాదు. పూర్వం కట్టు బొట్టు వగైరా అంతే. మా పూర్వులు చాలా గొప్పవారు, నాగరికులు వగైరాగా చెప్పుకునే వారనేకులు ఆధునిక దుస్తులవారుకూడా గుర్తించాలి. నేడు గోచిపాతరాయుళ్లుగా, అనాగరికులుగా కన్పించే సవర, కోయ వగైరా గిరిజన సంప్రదాయం గతచరిత్రలో ఉంది.

మధూకేశ్వర మూర్తి చూచుటకు దారునిర్మితకోటరసహితతరుకాండమువలె నుండును. కాని శిలాకఠినము. ఆకృతి, మహాత్మ్యంలో కథ గూర్చి పరిశోధకులు సత్యాన్వేషణ చేయలేదు. వీరికి చోడగంగు కొర్నిశాసనపాఠము పరిచయమే.

శ్రీ కూర్మం కూర్మనాథుడు కమఠావతారం అంటూ చేరికలుచేసి చూపిన వ్యక్తావ్యక్తలింగం — ఆదిలో అది ఒక పురాతన బౌద్ధస్తూపం అయ్యుండుననే సందేహాలున్నాయి.

గుడిమల్లం గుడిలో శాతవాహనుల నాటిదైన లింగమూర్తి కేవల పురుష రహస్యాంగాకృతిలో నున్నది. లింగాకృతి.



మధూకేశ్వరస్వామి వ్యక్తావ్యక్తమూర్తి

మధూకేశ్వరునిది లింగాకృతిగాదు. కాని ఈ రూపం వ్యక్తావ్యక్త లింగానికి చేరిక. ముఖం లేకపోయినా ముఖలింగేశ్వరుడు అని అనుటంటే పరిశోధకులు సత్యాన్వేషణ చేయలేదు. ఓఢ్ర ఉచ్చారణలో మారి పునస్సంస్కృతీకరణంలో ముఖలింగం అయిందంటారీ పరిశోధకులు కూడా— ఆ పేరు క్కారణం వెదకలేదు. ఇప్పచెట్టు—మధూకం - మరో పేరు 'మొహువా'. మధూకవృక్షజనితం మొహులింగం ముఖలింగంగా ఉచ్చరింపబడెనంటారు. ఈ మార్పుకు 'మొహువా' ఓఢ్రఉచ్చారణవరకూ వెళ్లనక్కర్లేదు. మధూకలింగ, మొధోకలింగో, మొకలింగో, ముఖలింగంగా మారివుంటుందని ఎవరైనా సులువుగా చెప్పవచ్చును. ఆ సందర్భంలో మధుకళింగ, గ్రీకుల మొక్కొకలింగ, మోదెకలింగలో ముఖ్యకలింగ, మధ్యకళింగ ప్రాంతీయార్థం వలె, మధూకలింగ అని తెలియరావడంలో వింతలేదు ప్రాంతీయంగా అడవి ఇప్పచెట్లు—ముఖలింగం అని గ్రామ, దేవనామం శాసనాల్లో కన్పించదు.

శాసనాల్లో స్పష్టంగా ఈ దేవుడు గాంగవిశ్వేశ్వరుడైన త్రికలింగేశ్వరదేవుడని యున్నది. త్రికలింగ తెలుగులో ముక్కలింగ (త్రినేత్రుడు–ముక్కంటి)– ముక్కలింగేశ్వరుని త్రికలింగేశ్వరుడని తెలియని వారెవరో ముఖలింగేశ్వరుడని నామకరణం చేశారు. ఈ నూతన నామకరణం క్రీ. శ. 16 శతాబ్దం పూర్వం జరుగలేదు. శాసనాల్లో మధుకేశ్వరుడనే ఉంది. ముఖ్య కళింగేశ్వరుడు, త్రికలింగేశ్వరుడు ముఖలింగేశ్వరుడైన కారణం ముఖంమాత్రంకాదు.

మధుకేశ్వరుడు మధూకవృక్షోద్భవుడన్నందున (శాసనం) దారు నిర్మితం అయితే ఆ శిలా కాఠిన్యం ఎలా వచ్చిందనే సందేహం కల్గడం సహజం. తరుకాండం, కర్ర ఏదైనా చిరకాలం ఇసుక వగైరా భూపదార్థాల్లో కప్పడిఉంటే కాలక్రమాన శిలాకాఠిన్యం రావడం (Petrification) శాస్త్రీయం. కొన్ని ఖనిజాల ఉత్పత్తి చరిత్ర చూడండి.

తరుకోటరం–తరుకాండం– అదీ ఇప్పచెట్టుదైన కారణం ఏమి టంటారు!

సహస్రాబ్దాల నాటి మానవ నాగరికతా చరిత్ర చదివితే, అనేక దేశాల్లో, మతాల్లో, ఆదిములలో, వారి జనజీవన విధానానికెంతో సన్నిహితమైనది సదివలె, వృక్షం. పవిత్రం, జీవవృక్షం– నేటికీ వృక్షంగూర్చిన పవిత్ర భావాల్లేని మతం విశ్వాసాల్లేవు.

దేవునికి ఆకారం అనేది లేదొకప్పుడు. నిరాకారుడు. సాకారభావం రాకపూర్వం లింగరూపం పూర్వం—వ్యక్తావ్యక్తలింగం.

వృక్షం పూజనీయం; దేవుని సృష్టి; జీవరూపం; వృక్ష పూజ ప్రత్యామ్నాయాలు ప్రపంచమంతటా ఉన్నాయి.

బౌద్ధంలో బుద్ధుని సాకార రూపార్చన పూర్వం బౌద్ధులు పూజించినది పాదుకలు, వృక్షం—

ఆదిలో దైవం స్త్రీ లేక పురుషుడు ఏదో తెలీదు ఇతర దేశాల్లోనేగాక మన పవిత్ర సాహిత్యంలో గూడా కొందరు దైవాలు (భావసంపద) స్త్రీ, పురుషులు; రెండూ లేకున్న స్త్రీ శక్తి పురుషుడు, పురుషశక్తి స్త్రీ—తర్వాత ప్రకృతి పురుష; స్త్రీ పురుష—అలానే కొందరు దైవం స్త్రీ—మరికొందరు దైవం పురుషుడు—ఈ భావాలన్నీ నాటి జనుల జీవన విధానాలపై సృష్టియైనవే.

సృష్టికి స్త్రీ ఎంత అవసరమో పురుషుడూ అంతే అని గుర్తించాక శైవశాక్తేయాలు కలసిపోయాయి. ఐనా ఆనాటి వేర్పాటు ధోరణి నేటికీ కొన్నిఆలయాల్లో అమ్మవారికి పురుష ప్రమేయం లేకుండా అర్చకుడు చీర కట్టుకొని స్త్రీ వలె నటించడం, గరగలెత్తు (కరగ)కునేవారిని, ఎర్రమారికలనే 'మా దేవత సత్తెం జూడండ్రి' అనే వారినీ గుర్తించండి.

స్త్రీ పురుష ఉభయలింగప్రాధాన్యం గుర్తించాక దైవరూపం ద్వ్యలింగంకూడా అయింది–అర్ధనారీశ్వరుడు. ఆ వుంతలో నమ్మకాలే ఆడపిల్ల అలంకారాలబాలకృష్ణుడూ, విష్ణువటపత్రశాయి వగైరా.

మధూకేశ్వరమూర్తిలో ఈ ద్వ్యలింగ భా



వసంతశోభ–మధుకేశ్వర దేవాలయం ద్వారంమీద శిల్పం



సోమేశ్వరాలయంలోని శృంగార శిల్పాలు

ఉండడంటే తరుకాండం పురుష, కోటరం స్త్రీ సంకేతరూపాలు అవాలి.

పూజల్లో 'సెక్సు' బహుపురాతనం. నా సందేహాలు వివరిస్తూ వాటి పూనా భండార్కర్ ఓరియంటల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ క్యూరేటర్ (స్వర్గీయ) డాక్టర్ పి. కె గాడేకు వ్రాశాను. ప్రొఫెసర్ డి. డి. కోశాంబి (స్వర్గీయ) ప్రత్యుత్తరిస్తూ మనదేశంలో పురాతనకాలంలో 'సెక్సు' ఆరాధన కాదనలేము అంటూ మధుకేశ్వరమూర్తి వంటి ఆకృతులు దేశంలో (ఫొటో పంపాను) బహుఅరుదు అంటూ అలాంటి తరుకాండాకృతి స్థాణువుల తాము కోశాం—ఇనాం (కోశాంబి) వద్ద కట్టాళ్ళుగా ఉపయోగితం కావడం చూచి పురావస్తుశాఖవారిచే రక్షణ కల్పించామని నాకు వ్రాశారు. అలిఘర్—మధురా రోడ్డులో మధుర సమీపంలోకూడా ఉన్నాయని వ్రాశారు. సమగ్రంగా ఏ ఒక పరిశోధనా పూర్తిచేయడానికి జీవితకాలం చాలదు. అసమగ్రం అయినా ప్రకటించమనే సూచించారు. కాని ఆచటి వాని ఛాయాచిత్రంగాని, వర్ణనగాని పంపలేదు సరికదా మధుకేశ్వరమూర్తి గూర్చి పరిశోధన కుపయుక్తంఅయ్యే విషయం ఏమీ సలహాగా—సూచనగా కూడా వ్రాయలేదు.

కోశాంబిజాబువలన తూర్పునఉన్న ఈ లింగం వంటి స్థాణువులు పశ్చిమాన ఉన్నాయని తెలియడంతో నాకు మరో పని తగిలింది. ఆ కోశాం—ఇనాంకు ఏ గాంగరాజుల సంబంధంలేదు.

మధుకేశ్వరాలయానికి ఒకప్పుడు శక్త్యాలయం అనే జనవాక్యం ఉన్నట్లు శ్రీ భీమేశం అన్నారు.

ఆరాధనల్లో ఒకప్పుడు లైంగికం (సాముహిక రతులు) ఉన్నట్లే హింసాకాండ (వధ—యజ్ఞం) బలులుకూడా బహుపురాతనాచారం.

తరుకోటరాల్లో, చెట్లపైన నరులు కాపురమున్న చరిత్ర బహుపురాతనంకాని అనాగరికులుగా ఆటవికులుగా మిగిలియున్నవారికింకా ఆ భావాలు పోలేదు. రాజస్థాన్‌లో తరుకోటరాల్లో దేవతలుంటారనే నమ్మకం. విశాఖపట్నంలో విద్యార్థిగా నున్నప్పుడు చూచాను, వాటికి అడవిగాఉన్నా డాబాతోట పెద్దతోటలో తొర్రలో తేళ్ళు, పాములు, కప్పలు, తొండలు, కొన్ని చోట్ల పక్షులగూళ్ళు.

సైంధవ సంస్కృతిలో దేవతలు వృక్షాధిష్ఠానదైవాలు. ఆ పోలికలు పురాతన జాతులందరిలో ఉన్నాయి: శైవ శాక్తేయాల్లో పాదపేశ్వరుడు, శాకంబరి వంటివే.

'విష్ణుపురాణం'లో మద్యాధిష్ఠానదేవి వారుణి ఆవాసం (కదంబతరుకోటరం)—పూరీ జగన్నాథక్షేత్రం. ఏకాదశి (కన్య) దేవి కథల్లో ఆమె నివాసం చెట్టుతొర్ర. తెలంగాణాలో గోండుల్లో ఇప్పచెట్టుపై దేవతలుంటారనేది నమ్మకం వాటి దక్షిణకోసల ప్రాంతీయమైన వేటి గిరిజన ప్రదేశాల్లో తరుకోటరాల్లో దేవతలుంటారనేది నమ్మకం

రావి, మర్రి, మారేడు, ఖర్జూరం, అత్తి, తాళం, వేప వగైరా చెట్లు దేవీదేవుల ప్రీతిపాత్రం కావడం వంటి వాటిని మించిన ఉపయోగాలు కదంబ (కడిమి) మధుక (ఇప్ప) వృక్షాలకున్నాయి. గిరిజనుల్లో ఆర్థికంగా, సాంఘికంగా ఇప్పచెట్టుకు చాలా ప్రాధాన్యం ఉంది.

ఈ త్రికళింగదేవరనిర్మాణంలో ప్రాంతీయంగా కాన్పించే నేరేడు, కడిమి, మద్ది వగైరా అనేక వృక్షాలుండగా ఇప్పచెట్టునే ఎంచుకున్నారేమంటే

గిరిజనుల్లో దానికో ప్రత్యేక స్థానం ఉండడం కారణం అనవచ్చు ఆదిలాబాదు, బస్తరు ప్రాంతాలవరకూ పోనక్కర్లేదు, భద్రాద్రి రామదర్శనం చేసిన వారికీ ఈవిషయం తెలియవచ్చును. గతంలో బ్రిటిష్ ప్రభుత్వానికి ఉప్పు, నల్లమందువలె ఆదాయం చేకూర్చిన చెట్టు ఇప్ప.

ఇప్పపూవుల వర్తకం, వినియోగం, సారా తయారు వగైరా ఆర్థిక వ్యాపారాదు లున్నాయి. ఇప్పచెట్టు నే చూడలేదు. కాని తెలంగాణా గోండు చరిత్రబట్టి ఇప్పకర్ర చాలా గట్టిదైయ్యుండు నను కొంటున్నాను.

పురాతనకాలంలో—విగ్రహారాధనకు పూర్వం నిరాకార—నిర్గుణోపాసనలో ఆరాధ్యదైవరూపం సాంకేతికం—స్తంభ, స్థాణు, లింగరూపాలు. స్త్రీ ఉరోజ, జననేంద్రియరూపాలు తర్వాతి కాలానివి. సాకార సగుణోపాసనలో వచ్చినవి అర్చ, బేర, మూర్తి, మానవాకారాలు,

దేవాయతన నిర్మాణానికేగాక ఆరాధ్యదేవతా రూపానికీ మన దేశంలో జరిగింది, దారు నిర్మాణం గాబట్టి బహుపురాతన ఆలయాలు, మూర్తులు



మధూకేశ్వరాలయం ద్వారశిల్పం మరొకవైపు



సోమేశ్వరాలయంలోని అర్ధనారీశ్వర శిల్పం

నశించాయి. మట్టిబంక, కలప వాడేవారు. ఆ పురాతన విశ్వాసమే మృద్దారునిర్మాణం ప్రశస్తం, పవిత్రం అనే నమ్మకం నేటికీ ఉంది—మనదేశంలో ఇంకా. 'సిమెంటు' యుగంలోకూడా అలా చేస్తున్నారు.

అది గుహాలయమైనా, శిలానిర్మితమైనా ఆలయాలు చూడండి. దారునిర్మితం పోలికలు రాతి దూలాలు, వాసాలు వగైరా. మైసూరురాష్ట్రంలో దేవతామూర్తుల నిర్మాణానికి దారువినియోగం జరుగుతున్నా మన ప్రాంతాల్లో 'తక్కువ కులము'ల వారనబడేవారిలో, గ్రామీణుల్లో కలప ఉపయోగం కన్పిస్తుంది. కులవివక్షతపాట్కారంలేని పూరీజగన్నాథంలో పుష్కరాని కోసారి జరిగే 'నవకళేబరోత్సవం'లో దారువినియోగం జరుగుతూ వేఉంది. అక్కడ మూర్తి అసంపూర్ణ వ్యక్తావ్యక్త మానవదేహం—ముఖలింగంలో వ్యక్తావ్యక్త లింగ (Aniconic) రూపం— ఈ పోలికలు పురాతనదేశా లంతటా ఉన్నాయి. ఈజిప్టులోనూ పోలిక లున్నాయి.

యవనాచార్య డనబడిన వరాహమిహిరుడు 'బృహత్సంహిత'లో దేవుని మూర్తి రూపానికి పవిత్రమైనవీ, యుక్తమైనవీ—అయిన కలపలు వివరించాడు. నాటికి దారు నిర్మాణమే సంప్రదాయం. ప్రతిష్ఠం

చేది బ్రాహ్మణుడై యుంటే ఉపయోగించవలసిన దారువులు చందన, దేవదారు, మధుక, శమీవృక్ష కాండాలు.

చోడగంగు శాసనంలో దేవుడు మధూక వృక్ష జనితుడు. ఇప్పసెట్టు ప్రాశస్త్యం. వరాహమిహిరుని వివరణ. పోతే పరిశోధకులు కొందరు తొలిగాంగుల్లో కొందరు బ్రాహ్మణులన్నారు. కాగా వృక్షమూలుని గోదావరి శాసనం తొలిగాంగుల్లో ఇంద్రవర్మను ద్విజుడన్నది.

కాబట్టి మధుకేశ్వర ప్రతిష్ఠాత క్రీ. శ. 6వ శతాబ్దపు హస్తివర్మ గాకపోయినా తొలి గాంగుల్లో ఒకడు లేకున్న కళింగ కదంబుల్లో ఒకడు. గోకర్ణేశ్వరుని (విపివేశ్వరుడు), కళింగ కదంబుల జయంతీశ్వరుని, మలిగాంగులు మధుకేశ్వరుని జేపారవాలి.

పశ్చిమ కదంబుల్లో మయూరశర్మ మరి కొందరు బ్రాహ్మణులు, తర్వాత క్షత్రియులైనారు. తూర్పు కదంబులు గాంగుల సామంతులు; గాంగ రాణులు కదంబ కన్యలు. అనంతవర్మ పుత్ర ముమ్మడి దేవేంద్రవర్మ (గాంగశకం 254) విశాఖపట్నం శాసనంలో తన మేనమామ కదంబ కులుడు, మహామండలేశ్వరుడైన రాణకధర్మఖేడి అన్నాడు.

ఇప్పచెట్టు అంటే తత్సంబంధంగా ప్రాంతీయంగా గిరిజనులూ వస్తారు.

'శ్రీ ముఖలింగేశ్వర మాహాత్మ్యం'లో చిత్కళ తనకు లభించిన బంగారు ఇప్పపూలు చేరువ సుమంతపురంలో అమ్మేది. ఈ సుమంతపురం నేడూ ఉందట. గాంగుల శాసనాల్లో శబరసంబంధం కన్పించదు కాని శిల్పంలో, క్షేత్ర మాహాత్మ్యంలో శబరసంబంధం చాలా ఉంది. పోతే కళింగాన (చోడగంగు శాసనం) కామార్ణవుడు శబరాదిత్యు నొకని నోడించి రాజ్యం స్థాపించినట్లున్నది. ఆ శబరుడు చారిత్రకం అయితే దక్షిణకోసల పాండు (కోసలగుప్త-ఉత్కల కరవంశ) వంశీయుడు అయ్యుండును.

పశ్చిమ దేశాలనుండి వలసలు, దండయాత్రలు (ఆర్యులు కూడా) జేస్తూ వచ్చి మనదేశంలో స్థిరపడిన



సిర్పుతిమూలంలోని చిన్నదేవళంపై ఉన్న ఆలింగనమూర్తి

వారసేకులు ఆలాగే మనదేశంలో పశ్చిమ ప్రాంతాల నుండి వ్యాపించి తూర్పున స్థిరపడినవారు, పాలించిన వారూ ఉన్నారు. వీరిలో వాకాటకులతర్వాత Tribal) ఆటవిక గిరిజన కిరాత సేనా విభాగాలున్న వారు రాష్ట్రకూటులు, పశ్చిమ చాళుక్యులు. కళింగ ప్రాంతం వీరి దండయాత్రలూ చూచింది. పోతే కుబ్జవిష్ణువర్ధనుడు గెల్చిన ప్రాంతాల్లో రాజ నీతిగా సేనాపతులనే ప్రాంతీయపాలకుల చేసిన చరిత్ర ఉంది.

కళింగగాంగులను నేను గిరిజనులు, ఆటవికులంటున్నాననుకోనక్కర్లేదు — మన పూర్వులంతా అంతే—

శబర (సవర) జాతిధర్మాసన గ్రామం 'సమతు'. వారిజాతి (Tribe) నాయకుడు, పెద్ద కులపతి ఉండే గ్రామం. ఆ 'సమతు'యే స్థలపురాణంలో పూవు అమ్మిన సుమంతపురమై యుండునా? మా బంధువుల్లో చంద్రవంశ్యులం అంటూ బిరుద (పట్టపుపేరు) నామంగా సాంతో అని వాడేవారు శ్రీకాకుళంజిల్లాలో ఉన్నారు. ఈ సాంతోలో చూడ వలసినది 'సామంత' (Subordinate) యా? లేక

ఈ శబర 'సమతు'యా? పూర్వం 'పామంతు'డంటే లోబడినవాడనే అర్థంలోగాక పారుగువాడు ('పడోసీ') అనే అర్థంలో వ్యవహరితం. కాగా శబరులు ఆర్యులకు (గంగానది) పొరుగువారుగా ఆనాడే పేర్కొనబడినారు.

తొలిగాంగుల్లో 'అనియంకభీమ' బిరుదు వారు లేరు. క్రీ. శ. 10 వ శతాబ్దంనాటి కళింగగాంగుల్లో ముమ్మడి అనంతవర్మ, ఇమ్మడి వజ్రహస్తదేవుడే (క్రీ. శ. 980–1014) మొదటి అనియంకభీమ బిరుదాంకితుడు. సమకాలీనుడైన విమ్మవర్మన విమలాదిత్యుడు (వేంగీ చాళుక్య) ముమ్మడిభీమ, బిరుదాంక భీముడేగాక అనియంకభీముడు కూడాను. కొండపడమటి రాజులు నాదెండ్ల వారూ ఈ బిరుదు వాడారట. ఈ 'అనియంకభీమ' బిరుదే రామరాను అణ్యంక, అనంగ (భీమ)గా మారిన వివరం గాంగశాసనాల్లోనే పసి కట్టవచ్చును. అనియంక అర్థం యుద్ధరంగాల్లో నాయకత్వం వహించి ముందుండే - మొనగాడు.

ఈ సుప్రసిద్ధవీరుల, రాజుల బిరుదు 'అనియంక' అర్థమూ సవరవారి 'గామాంగ్' అర్థమూ ఒకటే–మొనగాడు. సైన్యాల్లో ముందుండి నాయకత్వం వహించేవాడు.

ఆప్తమిత్రులకు ఘంతవ్యుడను – సవరవారి 'గామాంగ్' శబ్దమే గమంగ్, గమ్మంగ్–చివరికి గంగ అయ్యుండునా?

వంశధారానది గాంగుల 'గంగా'నది, ఆలోచించండి. ఎవరూ కారాలు మిరియాలు నూరనక్కర్లేదు. ప్రపంచ చరిత్రలో విజయులే పార్వతేయులు, అనాగరికులు, ముష్కరులు అనే విషయం ఆర్యులు కూడా; పరాజితులే నాగరికులు అనే సందర్భాలు సహస్రాబ్దాలనుండీ ఉన్నాయి.

నదీమూలం, రాజు/క్షత్రియ జన్మవృత్తాంతం తెలియగోరడం మహాపాపంగా చెప్పిన కారణం నగ్నైరామన కనవసరం. కళింగగాంగులు విప్రులైనా, క్షత్రియులైనా, గిరిజనులైనా ఎవరైనా ఆంధ్రులు—యోధాన యోధులు. తొలి మలి గాంగులు సుమారు వేయేండ్లు పాలించారు. మలిగాంగుల నాటి సమాజ, ఆర్థిక, భూస్వామ్యాది వ్యవస్థావివరాలు, పరిపాలనాదులంగూర్చి వాటి తెలుగుభాష–శాసనాల్లో మన కిచ్చారు. ఇతర రాజులు రాణుల ప్రసక్తి లేకున్నా మలిగాంగుల శాసనాల్లో చోళరాజు తనయ రాజసుందరి (చోడగంగుతల్లి)ని దేవేంద్రవర్మ రాజరాజు, పూర్వుల్లో మరొకరాజు వైదుంబరాజకన్యనూ పరిణయమాడుట ప్రత్యేకించి చెప్పకోడంలో మలిగాంగులు వైదుంబ చోళులకన్న తగ్గుస్థాయిలో నున్నట్లు ఊహించాలి. కళింగగాంగకన్యలు తూర్పు చాళుక్యుల కోడళ్లు.

ఒకనాటి ఉత్తర–దక్షిణ భారత రాజకీయాల్లో కీలకంగావున్న ముఖ్యకళింగ ప్రాంతం — ఇతర దేశాల్లో ప్రసిద్ధిపొందిన ప్రాంతం— నేడు విశాఖ శ్రీకాకుళం జిల్లాలు. అన్నిటా వెనుకబడి ఉన్నాయి.

మధుకేశ్వరమూర్తి విషయమై డాక్టర్ సంకలియా (పూనా)కూడా ఏమీ చెప్పలేనన్నట్లుగా జాబు వ్రాసారు.

తరుకాండం పోలే స్థాణువు పశ్చిమగాంగుల (మైసూర్) తావుల్లో లేదు. కాని కళింగగాంగుల ముఖ్యకళింగ ముఖలింగంలో ఉంది. (మధుకేశ్వరుడు); అలాంటి స్థాణువులు కోశాం–ఇనాం (కోశాంబి) వద్ద మధుర సమీపంలో ఉండడం విశేషమే. (ప్రొపెసర్ కోశాంబి జాబు). ఈ తూర్పు పడమరల సంబంధం కొరుకుడుపడటం లేదు.



సోమేశ్వరాలయంలోని హరిహరుడు

మధుకేశ్వరమూర్తి ఒకనాటి శక్తిక్షేత్రం అనేందు కాధారం? పోనీ గిరిజనాచారం అయిన నరబలి (గోండు) ఇచ్చేవారంటే ఆ పీఠం అదీ వేరు. ఇదో యజ్ఞం చేసిన తావు అంటే యజ్ఞాల్లో జంతువుల వధ నవరంధ్రాలు మూయడం గదా అంటారు. తరుకొండంపై తలపెట్టి వధించి రక్తం పెనంలా ఉన్నదాంట్లో పట్టేవారాలంటే ఆధారాల్లేవు.

పోతే ఈ క్షేత్రంలో తరుకొండం యూప స్తంభమో జయస్తంభమో అయ్యుండునా? రెండిటికీ అవినాభావసంబంధ మున్నదిగదా — ఈ సందేహ సందర్భంలో జ్ఞప్తికి వచ్చేది సముద్రగుప్తుడు. అలహాబాద్ ప్రశస్తిలో కళింగప్రాంత దిగ్విజయం ఏరండపల్లిని నేటి శ్రీకాకుళంరోడ్ రైల్వేస్టేషన్ ఆముదాలవలసగా పరిశోధకులు గుర్తించారు. మధుకేశ్వరమూర్తి సముద్రగుప్తుని నాటి జయ (యూప) స్తంభమై యుండునా?

ముఖలింగ— నగరికటకాలు బహు పురాతన క్షేత్రా లనుకోడంలో బౌద్ధక్షేత్రం అనే సందేహం కల్గింది.

గారవద్దవున్న సాలిహుండాం బౌద్ధక్షేత్రమే. చోడగంగు శాసనంలో చెప్పబడిన ముండపల్లిగా గుర్తించాను. చీనా యాత్రికుడు యువాన్‌ఛాంగ్ కువిలాల్ – రేవులోక్కానిపించే కళింగ నగరపు బౌద్ధ స్తూపం క్రీ. శ. 7 వ శతాబ్దం నాటికి శిథిలంగా వున్నా సాలిహుండాం బౌద్ధస్తూపం అనుకుంటున్నాను. ఆ కళింగనగరం చేరువనే నది ఉంది; నదీతీరాన బౌద్ధవిగ్రహా లున్నాయని యువాన్‌ఛాంగ్ వ్రాశాడు. సాలిహుండాం గ్రామంలో నదీతీరాన్నే పురావస్తుశాఖవారి త్రవ్వకాల్లో బౌద్ధవిగ్రహాలు లభించాయి. ఈ కళింగ నగర బౌద్ధక్షేత్రాని కుత్తరంగా (సుమారు 24 మైళ్ళు) మరో సంఘారామ మున్నట్లే యాత్రికుడు వ్రాశాడు. ఆ మరో బౌద్ధక్షేత్రం నగరికటక–ముఖలింగమా లేక ఆపైన గల (సిద్ధాంతం) సిద్ధార్థకమా గుర్తించలేకపోయాను. అక్కడ త్రవ్వి చూడవలసిన స్థలాలు చాలా ఉన్నాయి.



విందువిగ్రహాంగాక శిల్పశకలాలు చూస్తే చాలా బౌద్ధదేవమూర్తులు, శాక్తేయం అనిపిస్తాయి. అలాంటి శకలాలు చూసి కొందరు ముఖలింగం శక్తిపీఠం అనుకున్నారేమో!

ముఖలింగం ఆలయాని కీశాన్యంలో క్షేత్రపాలకునిక్షేత్రం రత్నగిరికొండ ఉంది. కోటదిబ్బ అనేది. తోటలు అటువైపున్నాయి. అవన్నీ తిరిగి చూడలేకపోయాను. అటువైపు సాలిహుండాం శిథిలాల్లో లభించినట్టి పెద్ద 'సైజు' ఇటుకలు కన్పించాయని శ్రీ భీమేశం వ్రాయగా నా సందేహాలు సరైన వనుకున్నాను. తర్వాత 1962 చివర్లో శ్రీ భీమేశం జాబుల్లో పురావస్తుశాఖవారు బౌద్ధక్షేత్రాన్ని త్రవ్వకాల్లో కనుగొన్నట్లు, అచట విల్లు–అశ్వం బొమ్మలున్న నాణెం లభించినట్లు తెలిసింది. ఆ నాణెం బహుశా సాతవాహనులదేమో! ఇటుకల పరిమాణంబట్టి ఆ క్షేత్ర నిర్మాణం సాతవాహన యుగానిదే అనుకుంటాను. బౌద్ధ వాఙ్మయంలో కళింగ రాజధాని దంతాపురం ఈ ముఖలింగ మయ్యుండునా? గాంగరాజుల 'అమరపుర ప్రతిస్పర్ధి' దంతాపురం, బౌద్ధుల దంతాపురం ఒకటో వేర్వేరో తెలియాలి. ఆముదాలవలస దగ్గరి దొట్టవలస–పురుషోత్తమపురం (నే చూడలేదు) రోడ్డులో దంతహుండా దిబ్బలే దంతాపురం, దంతవరపుకోట, దంతవక్త్రునికోట అంటున్నారు— పరిశోధకులు కొందరా కోవనే వ్రాశారు.

# ఓ చెట్టూ - రెండే పువ్వులూ

**నాటిక**

| | |
|---|---|
| రామానుజం | రాజు |
| చలపతి రావు | సత్యం |
| మాధవరావు | గీత |
| వేణు | సుగుణ |

శ్రీ గొల్లపూడి మారుతీ రావు

## మూడవ రంగము

మరుసటి రోజు ఉదయం.

వాతావరణంలో ఏమీ మార్పులేదు. గడ్డం క్రింద చెయ్యి వుంచుకొని వేణూ ఏదో ఆలోచిస్తున్నాడు. గీత లోపలికి వచ్చింది. వేణూని చూచి గతుక్కుమంది. అయినా అతనికి తత్తరపాటు కనిపించకుండా సర్దుకొని టేబిలుమీద బల్లలప్రక్కనా వెదుకుతోంది.

గీత : (తనకు తానే చెప్పుకున్నట్టుగా) నాన్నగారి కళ్ళజోడు కనిపించడంలేదు. ఎక్కడపుంచి పోయారో ఏమిటో! (బల్లపక్కన చూసి) ఆ, ఇక్కడ ఉంది. (ఆమెనే గమనిస్తున్నాడు వేణు. అది తెలుసు గీతకి. అతని ముందు నుంచి లోపలికి వెళ్లబోయేముందు అతని దృష్టికి దొరికిపోయింది. ఏదో మాట్లాడాలి కనక) ఇవాళ యింకా యిక్కడే వున్నావే! పాలకి వెళ్లలేదా?

వేణు : ఒంట్లో బాగుండలేదు.

గీత : డాక్టరుగారికే జ్వరంగావుంటే ఎవరు మందిస్తారు?

వేణు : జ్వరాన్ని తెప్పించినవాళ్లకి బాగుచెయ్యటం తెలీదా? రాత్రంతా నువ్వూ నిద్రపోలేదు కదూ?

గీత : అంటే — నువ్వూ మేలుకొనే వున్నావన్న మాట.

వేణు : కమ్మగా నిద్రపోవాలనా నిన్న నాన్నతో ఆ మాటన్నావు? (దగ్గరకువచ్చి, భుజంమీద చెయ్యివేసి) గీతా! ఆ మాట అబద్ధంకదూ?

గీత : కాదు వేణూ! నన్ను క్షమించు (అతను తలెత్తి ఏదో అనబోతే) అవును. బాగా ఆలోచించాకనే చెప్పా నామాట. కారణాలు నన్నడక్కు!

వేణు : (ఉద్విగ్నుడయి) నిన్నడగను. నేనే చెప్తాను విను. (సూటిగా ఆమెను చూస్తూ) ఈ యింట్లో బ్రతకడం యిష్టం లేదా?

గీత : ఛ ఛ! అదేంకాదు.

వేణు : నేను ఉద్యోగం చేసేవరకూ ఆగాలనా?

గీత : ఊహు.

వేణు : (కోపం వస్తోంది.) నాకున్న అందం, డబ్బూ చాలవా?

గీత : (మాట్లాడ లేదు.)

వేణు : నీ అందానికీ, నీ హోదాకీ, అంతస్థుకీ నా కంటె గొప్ప మొగుణ్ణి సంపాదించుకోవా లన్న ఆశతోనా?

గీత : అదేం కాదు వేణూ! అదేం కాదు. (ఏడవబోయింది.)

వేణు : (కోపం, ఉద్రేకం) నోర్ముయ్! ఇంక ఆపు కన్నీళ్లు. కన్నీళ్లతో క్షమాపణలు చెప్పుకునే దరిద్రపు ఎత్తుగడ నా దగ్గర వెయ్యకు. నువ్వుకాదంటే, ఏడ్చి, మొత్తుకొని, నీ కాళ్ల ముందు తలబద్దలు కొట్టుకుంటూ నమకోకు.

గీత : అంత ధైర్యవంతుడివి—ఎందుకూ యింత బాధ?

వేణు : బాధ! నన్ను చేసుకోనని చెప్పిన క్షణంనుంచీ ధారాపాతంగా వర్షించే నీ కళ్లు సంతోష

పడుతున్నాయని నమ్మమంటావా? నీకు మాత్రం లేదూ బాధ?

గీత : నేనే కావాలని దూరమవుతున్నప్పుడు బాధెందుకు?

వేణు : ఆత్మవంచన! ఆత్మవంచన ముందూ, ఆడది తర్వాతా పుట్టారు. నామంచి దూరమై, ప్రేమించిన వాళ్లకు దూరమయ్యే పరమార్థాన్ని స్త్రీ లోకానికి చాటుతావా?

గీత : (కన్నీళ్లమధ్య నవ్వొచ్చింది) ఊహూఁ. దూరమవుతున్నా దెబ్బలాడి పెళ్లి చేసుకుంటావనే మగవాళ్లంటారని హెచ్చరిస్తాను. నేనేం చేస్తే నీ కెందుకు?

వేణు : నాక్కావాలి.

గీత : (నవ్వడానికి ప్రయత్నిస్తూ) నా మాటవిని, డాక్టరుగారూ—అనవసరంగా నా గురించి తలపాడు చేసుకోకండి— మీ వైద్య వృత్తితో లోకోద్ధరణ చెయ్యండి.

సత్యం : (అప్పుడే లోపలికివస్తూ) ఓహో! కాబోయే దంపతు లిద్దరూ కబుర్లాడుకుంటున్నట్లున్నారు.

వేణు : అఁ! దంపతులు కావక్కరలేదని యిప్పుడే కబురు తీసుకొచ్చింది నీ చెల్లెలు.

సత్యం : అదేమిటి?

వేణు : ఆ ప్రశ్నే అరగంటనుంచి రకరకాలుగావేసి ఓడిపోయాను.

సత్యం : అవునా గీతా?

వేణు : అంతే కాదురా! నన్ను మనస్ఫూర్తిగా దేశానికి త్యాగంచేసి వైద్యవృత్తి నిర్వహించమని యిప్పుడే దీవించింది.

సత్యం : అలా వీల్లేదు గీతా! మే మిద్దరం హైస్కూల్లో చదివే రోజుల్లోనే వీడిదగ్గర బతాసీలు, శనగిలూ తీసికొని— నిన్ను వాడికిచ్చి పెళ్లి చేస్తానని ప్రామిస్ చేసేశాను. అయినా ఆడది పెళ్లి చేసుకోనంటే నువ్వెలా నమ్మావురా!

వేణు : ఏం? నీ చేతల్లాగే ఆవిడ మాటలకు అర్థాలుండవా ఏమిటి?

గీత : అన్నయ్యా! (కోపం, ఉద్విగ్నత)

సత్యం : కొద్ది కాలంలోనే నా చేతలకి అర్థం కల్పిస్తున్నానులే. కాని ఆవిడ మాటల విషయంలో నువ్వు పూర్తిగా రైటు. ఒరేయ్! మా చెల్లెల్ని చేపట్టి మమ్మల్ని ధన్యుల్ని చెయి. ఈ కుటుంబంలో ఆడొక్కతయినా సుఖపడుతుంది.

గీత : అన్నయ్యా! (కోపం, ఉద్విగ్నత)

సత్యం : చూశావా - అదెంత గట్టిగా సాక్ష్యం చెబుతుందో?

గీత : నాకీ పెళ్లి యిష్టం లేదన్నయ్యా!

సత్యం : అంటే నీ కర్థం తెలుసా ఆడపిల్లా? ఈ దౌర్భాగ్యపు సంసార చక్రంలో, ఈ నాలుగు గోడలమధ్య యిరుక్కొని, అక్కరలేకపోయినా మగ్గడానికి మనస్ఫూర్తిగా అంకితం అయిపోతున్నావన్నమాట. ఏం నువ్వేం మార్లిన్ మన్రో ననుకున్నావా? దీనా మహారాణీ ననుకున్నావా—ఆకాశంనుండి ఊడిపడ్డ అప్సరసననుకుంటున్నావా?—నీ కోసం పరాసరి స్వర్గం నుంచి ఓ గొప్ప వరుడు దిగి రావడానికి? తెలివి తక్కువగా ప్రవర్తించకు. నీ లాంటి వాళ్లకు జీవితంలో ఒకే ఒక్క అవకాశం వస్తుంది. ఈ ప్రపంచంలో నీ కోసం తాపత్రయపడేది ఒకే ఒక్క వ్యక్తి— వీడిని కాదన్నావంటే నీకు జీవితంలో మళ్లీ పెళ్లి జరగదు.

గీత : అన్నయ్యా!

సత్యం : ఇంకేం మాట్లాడకు—ఆరు రోజులు ఆలోచించి నీ నిర్ణయం—నాకు కాదు. ఈ వేణూకి చెప్పు ఒక వారం రోజులు ఏ నిర్ణయం తీసుకోకు బ్రదర్! ఆడవాళ్లు తమ నిస్సహాయతని అర్థం చేసుకోవడానికి ఆ మాత్రం వ్యవధి అవసరం. అవసరమైన పని వుంది— కొన్ని ఏర్పాట్లు చేసుకోవాలి - వస్తాను. (గుమ్మందాకావెళ్లి) బై దిబై—అది పెళ్లి చేసు

కోసంటే నాకు చెప్పు. ఓ లక్షాధికారి ఏకైక పుత్రికని—రంభలాంటిదాన్ని తీసుకొచ్చి నేను స్వయంగా పెళ్ళి జరిపిస్తాను. దీనిమీద కసి తీర్చుకోవడానికైనా చేస్తాను. (ఆ మాట అంటూండగానే చలపతిరావు లోపలికి వచ్చాడు. తండ్రి మొహం చూచి లోపలికి వెళ్ళిపోయాడు సత్యం.)

చల : ఏమిటంటాడు వాడు?

వేణు : గీతకి గీతోపదేశం చేస్తున్నాడు.

చల : వాడికొకటి తెలిసి చస్తేగా?

వేణు : వాడు తెలివి తక్కువ వాడని మీ రెందుకనుకుంటారో నా కర్థం కాదు. అలా చూస్తూండండి. వాడు మనందరూ తెల్లబోయేటట్టు ఏదో గొప్ప పని చేస్తాడని నా నమ్మకం.

చల : (నవ్వి) వాడు చెయ్యకపోయినా ఆశ్చర్యం లేదోయ్! తెలివైనవాళ్ళమనుకొంటున్నవాళ్ళే తెలివి తక్కువగా ప్రవర్తిస్తూంటారే—అదే ఆశ్చర్యం. (గీతకు ఈ మాటలు అర్థమయాయి. పనిలేకపోయినా ఏదో సర్దుతున్నట్టు నటిస్తోంది. వేణూకు అర్థమయింది.) నన్ను క్షమించు వేణూ! మాకు పుట్టిన వాళ్ళు మా మాటని ఎదిరించేంత గొప్పవాళ్ళవుతారని తెలీక, రామానుజం నేనూ ఏవో ఆశలు పెట్టుకున్నాం. ఆఖరికి నీకూ పెట్టాం. రెండోసారికూడా నేనే ఓడిపోయాను.

వేణు : దానికేం లెండి.

గీత : వేణూకి మరో మంచి సంబంధం అన్నయ్య చూసి పెడతానన్నాడు నాన్నా (అతి సీరియస్‌గానే అంది.)

చల : ఛీ! నోర్ముయ్! వాడెందుకు? పెద్దవాళ్ళని ధిక్కరించగల ఆడదానివి. నువ్వేచూసి పెట్టరాదూ? అందర్లోకీ నీకే నామీద ప్రేమ, జాలి, అభిమానం ఉన్నాయనుకున్నాను. నువ్వే నా మాట నిలబెడతావనుకున్నాను. కాని యిలా వెన్నుపోటు పొడుస్తావనుకోలేదు. ఛీ ఛీ!

గీత : (నవ్వి) చూశావా వేణూ! నిన్నుకాదని నే నెందరి కోపాన్ని సంపాదించుకున్నానో?

రామా : (ఇప్పుడువస్తూ) ఎవరికోపం వచ్చినా మరేం ఫర్వాలేదమ్మా! నేను నీ వేపున్నాను. నీ కిష్టం లేనిపని వీళ్ళొక్కటీ చేయించలేరు. (చేతిలో సినిమా పత్రిక వుంది. దాన్ని గీత ముందుంచి) చూడమ్మా! ఇవాళ మంచి సినిమా ఒకటి వచ్చింది. సాయంకాలం, నన్ను తీసుకువెళ్తావా?

గీత : నేను నిన్ను తీసుకువెళ్ళడమేమిటి మావయ్యా?

రామా : అదికాదమ్మా—నేనొకణ్ణే వెళ్తే ముసలాడికి యీ పిచ్చేమిటని నవ్వుతారు. నువ్వావుంటే నీకు చూపడానికి నేను తోడుగా బయలుదేరానను కుంటారు—నిన్ను పెళ్ళి చేసుకోవడం లోకోద్ధరణకని మా వాడనుకున్నట్టు.

వేణు : (కోపంగా) నేనేం లోకోద్ధరణ కనుకోవడం లేదు. నన్ను చేసుకోక పోవడమే లోకోద్ధరణకని ఆవిడ అనుకుంటోంది.

రామా : నిజం చెప్పమ్మా! నిన్ను పెళ్ళి చేసుకోవడం వల్ల మీ కుటుంబాన్నంతా ఉద్ధరిస్తున్నట్టు వాడెప్పుడూ కబుర్లు చెప్పలేదూ?

గీత : లేదు మావయ్యా!

రామా : లేదూ! (తలగోక్కుని) పోనీ నే నెప్పుడైనా మాట్లాడానా?

గీత : అబ్బే! లేదు.

రామా : మా యింటికి కోడలిగావస్తే నీకు సుఖం కరువవుతుందని ఎవరైనా అన్నారమ్మా!

గీత : (తలూపింది)

రామా : మరెందుకు కాదన్నావ్?

చల : (ఇక కోపం ఆపుకోలేక) బుద్ధిలేక! మతిచలించి!

రామా : నువ్వు మాట్లాడకురా. ఇది మా స్వవిషయం. ఇరవై యేళ్ళు మా ముందు పెరిగిన అమ్మాయి మమ్మల్ని కాదనడానికి మేమేం నేరం చేశాం?

గీత : అదికాదు మావయ్యా

రామా: కేవలం ఇలాంటి ఆలోచనంతోనే నీకు గుండె పగిలి—మా అందరికీ మతులు స్థిరం తప్పుతాయని తెలుసుకోగలిగే వయస్సుందికూడా—అంత కఠోరమయిన నిర్ణయాన్ని—

గీత : మావయ్యా!

రామా: (గీతతో) నీ కిష్టంలేకపోతే ఎంతమాత్రం మార్చుకోవద్దమ్మా (మళ్లీ చలపతితో) అంత కఠోరమయిన నిర్ణయాన్ని-తీసుకుందంటే బుద్ధిలేక, మతిలేక అని తీసి పారేస్తామా? ఆడదానికి బుద్ధి లేకపోవడం కూడా—మగవాడికి చాలా బుద్ధివున్నంత విలువయినదిరా—నీకేం తెలుసు!

గీత : నా గురించి నువ్వు బాధపడవద్దు మావయ్యా.

రామా: నాకా! నాకేం బాధమ్మా! ఇవాళ సాయంకాలం సినిమాకు వెళ్లడాన్ని గురించి ఆలోచించుకుంటున్నాను. కాని వీళ్లు—చేతికందిన బంగారాన్ని వాళ్లకే మిగుల్చుకోవాలన్న స్వార్థపరులు, అందుకే బాధపడుతున్నారు. వాళ్లని మనిద్దరం క్షమిద్దాం. పద.

చల : ఒరే రామానుజం. నీ కిచ్చిన మాటను నిలబెట్టుకోలేక పోతున్నాను. క్షమించు.

రామా: నా కిచ్చిన ఏ మాటని నిలబెట్టుకున్నావిరా, యివాళ ఈ విషయానికి ప్రత్యేకంగా క్షమాపణ చెప్పు కుంటావు? —అవసరానికి ఉపయోగించుకోమని యిచ్చిన డబ్బుని తీసుకున్నావా? కులాసాగా కూర్చున్నప్పుడు నాతోపాటు సరదాకయినా బోర్నవిటా తాగావా? నా యింట్లో నీ యింటిలాగ వుండమంటే అద్దె యివ్వడం మానేశావా? నీది క్షమాపణల జీవితంరా. ఈ పిరికితనాన్నే ప్రేమిస్తున్నావు నువ్వు. అది లేకపోతే బ్రతకలేవు నువ్వు. ఇంకా నీకంటె నీ పిల్లలు చాలానయం.

వేణు: నాన్నా! అనవసరంగా మావయ్యనెందుకు నానామాటలంటావు?

గీత : అవును మావయ్యా! నాన్నదేం తప్పులేదు.

(అప్పుడు సుగుణవచ్చి గుమ్మందగ్గర నిలబడింది)

రామా: (ఇప్పుడు దొరికిపోయింది) చూశావా! నీదే తప్పని ఎంత అందంగా ఒప్పుకున్నావో? మరెందుకమ్మ లాగా పని చేస్తున్నావు?

గీత : నేను చెప్పలేను మావయ్యా?

సుగు: నేను చెప్పగలను నాన్నా.

(అంతా ఆశ్చర్యపోయి తలలెత్తారు)

రామా: నువ్వా!! నీ కెలా తెలుసమ్మా. గీత చెప్పిందా?

సుగు : గీతకాదు నాన్నా. రాజు చెప్పాడు.

వేణు: రాజా!!

(ఈసారి గీతకూడా ఆశ్చర్యపోయింది)

సుగు : ఒక్క నేనే గీతని ఒప్పించగలననే ధైర్యం వుంది.

వేణు : (ఉద్విగ్నుడయి) అంత అనవసరం ఏ మొచ్చిందక్కయ్యా! అంతగా ఒప్పించి, బలవంతం చేసి పీటలమీద కూర్చోవలసిన అవసరం నాకు లేదు.

రామా: అవసరం నీకు కాదురా-మాకు. లక్ష్మీదేవి లాంటి అమ్మాయి ఈ ఇంట్లో తిరుగుతూ వుంటేచూసి ఆనందించే అవసరం మాది. వేణూ! నీ మనస్సుకు నచ్చే అమ్మాయిని ఎంచుకునే హక్కు నీ కెలా వుందో, ఈ వంశాన్ని ఉద్ధరించే కోడల్ని ఎంచుకొనే హక్కు నాకూ వుంది. ఇరవై ఏళ్ల మనిద్దరి అభిప్రాయమూ ఒకటయింది. ఇవాళ నువ్వు నేరయినా నేను నామాట నిలబెట్టుకుంటాను.

సుగు : ఆడపిల్లల సమస్యలు నీకు తెలీవు తమ్ముడూ! ఇవాళ కూడా గీత నిన్ను ప్రేమిస్తున్నట్టు ఎవరినీ ప్రేమించడం లేదు. నిన్ను చేసుకోలేకపోతే ఎవరినీ చేసుకోదు.

రామా: వాడి మాటకేం? మీ యిద్దరూ మాట్లాడుకోండి. ఒరే చలపతీ! నువ్వింట్లోకి పోరా!

(రామానుజం యింట్లోకి నడిచాడు. అతని వెనుకనే వేణూ వెళ్ళిపోయాడు. మరోమాట లేకుండా చలపతిరావూ నడిచిపోయాడు. గీతమాత్రం తలవంచుకుని కుర్చీలో కూర్చుని వుంది. ఆమెనే చిరునవ్వుతో, పరీక్షగా గమనిస్తోంది సుగుణ. కొంతసేపటికి గీత తలెత్తి, నీటిలో మునిగిపోతున్న వ్యక్తి రక్షణ కోరినట్టు పలకరించింది.)

గీత : వదినా!

సుగుణ: ఏ బాధ నా కర్మమయిందమ్మా!

గీత : నన్నేం చెయ్యమంటావు వదినా? నాకేం పాలు పోవడం లేదు.

సుగు: అవును. పదేళ్ళక్రితం నేనూ యిదే పరిస్థితిలో ఉన్నాను. కాని ఆ రోజు నాకు, సలహా చెప్పే వారెవరూ లేకపోయారు. ఈ వేళ జీవితంలో అన్నివిధాలా నష్టపోయిన నేనున్నాను నీకు.

గీత : వదినా!

సుగు: అవును గీతా! ఒకప్పటి నా తెలివితక్కువతనానికి జీవితం నామీద యిలా దెబ్బతీసింది. ఇవాళ మళ్ళీ నా జీవితంలో అదృష్టాన్ని ఊహించలేను. అవునంటావా?

(గీత తలూపింది)

ఆడది ఒక్కసారి పొరపాటుచేస్తే దిద్దుకోవడానికి వ్యవధికూడా దొరకదమ్మా. ఈ ప్రపంచంలో నీ అదృష్టవశాత్తూ నీ చుట్టూ వున్న వాళ్ళంతా నీకు మళ్ళీ ఆలోచించుకునే వ్యవధి యిస్తున్నారు. ఎందుకో తెలుసా?

గీత : ఎందుకు?

సుగు: అలాంటి అవకాశం లేక నాశనమయిన నా సాక్ష్యం వుంది కనుక.

గీత : ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు వదినా?

సుగు: నువ్వు చేస్తున్నది తప్పు — అది అర్థం చేసుకోమంటాను.

గీత : తప్పా?

సుగు : అవును. ఒకటే చెప్పు — వేణూ ముందు పిల్లల గురించీ సంసారం గురించీ మాట్లాడావు కదూ?

గీత : (ఆశ్చర్యంగా) నీ కెలా తెలుసు?

సుగు: అవునా, కాదా?

గీత : వేణే ఆ ప్రసక్తి తెచ్చాడు.

సుగు : నువ్వు ఎదురు తిరిగావు అవునా?

గీత : ఊఁ

సుగు : చాలా తప్పు చేశావమ్మా. మగవాడు లేని కష్టలను ఊహించుకుంటాడు. భయపడతాడు. దానినుంచి పారిపోవాలని ప్రయత్నిస్తాడు. ఆడది ఉన్న కష్టాల్ని అనాలోచితంగా ఎదుర్కొంటుంది. నిశ్శబ్దంగా నిలదొక్కుకుంటుంది. నువ్వు ఎదిరించి వాడిని భయపెట్టావు. భయాన్ని పోగొట్టవలసిన నువ్వే దాన్ని పెంచావు.

గీత : నేనా?

సుగు: అవును నువ్వే. పెళ్ళి చేసుకోనని వాడు అని పారిపోవలసింది. అలాంటిది నువ్వు అన్నావంటే ఆశ్చర్యంగా వుంది.

గీత : అదేమిటి వదినా?

సుగు : అవునమ్మా, నాకీ సమస్య పదేళ్ల పాతది. ఆ రోజు ఈ మాత్రం ఆలోచించుకో గలిగి వుంటే యివాళ యిలా వుండేదాన్ని కాదు. గీతా! ధైర్యంలేని వాడికి దురదృష్టంకూడా శాపమై తగులుతుంది. నామీద నీకు గౌరవం వుంటే నేను చెప్పేది యిదే.

(రాజు వచ్చాడిప్పుడు. వాళ్ళిద్దరినీ చూసి బయటికి నడవబోయాడు.)

సుగు : (అతన్నిచూసి) రాజూ! (ఆగి యిటు తిరిగాడు.) నిన్న నీతో అంతసేపు వాదులాడినందుకు క్షమాపణ చెప్పకుందామని రాత్రంతా అనుకున్నాను. కాని మంచి పనే జరిగిందని యివాళనిపిస్తోంది.

రాజు : ఏమయిందిప్పుడు?

సుగు: నిన్న నీ మాటలు విన్నాకే యివాళ వీళ్ల పొరపాటు అర్థమయింది. మనిద్దరమూ వాళ నమ్మి, మరొకర్ని యివాళ ప్రమాదంనుండి తప్పిస్తున్నాం. చూశావా? ఒకరికి జరిగిన కీడువల్ల మరొకరికి మేలు జరిగే అవకాశం కూడా వుంది.

రాజా: (గీతతో) అవునమ్మా! నువ్వు వేణూని చేసుకోకపోవడం తెలివి తక్కువతనం.

సుగు: ఎందుకంటే అలాంటి తెలివి తక్కువపనే పదేళ్ళక్రిందట మీ అన్నయ్యా చేశాడు కనుక. అతని మాట నువ్వు నమ్మాలి గీతా!

రాజా: (నెమ్మదిగా) అవును చేశాను. నువ్వు సుగుణ చూపిన తెలివితేటల్ని మగవాడి ముందు చూపకు. అది చాలా ప్రమాదం.

సుగు: ఆ విషయమే యిందాకట్నుంచీ చెబుతున్నాను.

గీత: నన్ను కొంతసేపు ఆలోచించుకోనివ్వండి.

సుగు: అదే మంచిది. ఇక లోపలికి వెళ్ళు!

(ఆమె వెళ్ళినవేపే యిద్దరూ చూచారు. గీత వెళ్లాక యిద్దరి చూపులూ కలిశాయి.)

సుగు: నన్ను క్షమించు రాజా!

రాజా: (నవ్వి) ఆ మాట నేనూ అనాలేమో!

సుగు: (పాము కాటేసినట్టు తలెత్తి) పదేళ్లక్రిందటి సంఘటనకి కాదు. నిన్నటి నీ ఉద్రేకానికి. పదేళ్ల నాటి విషయానికా? నిన్ను జీవితంలో క్షమించలేను. (అంతలో నిట్టూర్చి) అయినా యివాళ ఆలోచించి ఏం ప్రయోజనం? ఇద్దరికీ ఒక జీవితకాలం ఆలస్యంగా జ్ఞానోదయ మయింది.

రాజా: అవును.

(ఇప్పుడు సత్యం యింట్లోంచి వచ్చాడు. చాలా అందమయిన బట్టలు వేసుకున్నాడు. జమీందారు బిడ్డలాగ వున్నాడు. చేతుల్లో చాలా ఖరీదైన, బరువైన పెట్టెలున్నాయి. వాటిని నేలమీద దింపి.)

సత్యం: నా కోసం ఎవరైనా వచ్చారా అన్నయ్యా.—ఓ అందమయిన కారులో చాలా అందమయిన అమ్మాయి— పేరు లత.

(రాజా సమాధానం చెప్పలేదు.)

సుగు: (ఆ పెట్టెల్ని చూస్తూ) ఎక్కడికో బయలుదేరినట్టున్నావే?

సత్యం: అవును వదినా!—మీ ఆడవాళ్ల భాషలో చెప్పాలంటే నేను లేచిపోతున్నాను.

(రెండు సూట్ కేసుల్నీ చూసి)

మూడు వస్తువులుండాలే! ఏం మరిచిపోయాను? ఆఁ హేండ్ బేగ్.—

(లోపలికి వెళ్లాడు. రాజా, సుగుణా ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. రాజా ముఖంలో ఆశ్చర్యాన్ని చూసి సుగుణ పకాలున నవ్వింది.)

సుగు: అతనికున్న ధైర్యం, చేవ మీ యింట్లో ఎవరికుంది? (ఈ లోగా యింట్లోంచి ఎవరో రావడం గమనించి.)

అయితే ఎక్కడికి లేచిపోతున్నారు మరిదిగారూ! (ఇప్పుడు మాధవరావుని గమనించి) ఓహో! నువ్వా అన్నయ్యా!

మాధ; లేచిపోవడ మేమిటమ్మా (ఆశ్చర్యంగా.)

సుగు: నీ కింకా తెలీదా! సత్యం యింట్లోంచి లేచిపోతున్నాడు.

(ఇప్పుడు హేండ్ బేగ్ తో సత్యం వచ్చాడు.)

మాధ: ఏమిటి బావా? ఎక్కడికో లేచిపోతున్నావట?—ఈ పెట్టెలతోనా?

సత్యం: కాదు బావా! ఆసుపత్రిలో ఉచితంగా యిచ్చే రొట్టెలతో! అవునుగానీ—వాళ్లు ఆసుపత్రిలో చెల్లాయికిచ్చే రొట్టెలు నువ్వే ఫలహారం చేస్తున్నావట.

మాధ: ఎవరు చెప్పారు!

సత్యం: అక్కడి కుక్కల్నిచూసి గ్రహించాను.

రాజు : సత్యం ! పెద్దా చిన్నా లేదూ ! నోటికి ఎంతవస్తే అంతా అనెయ్యడమేనా ?

సత్యం : ఆ మాట బావ అన్నాడేమో చూడు. ఎలా గయినా బ్రతకనేర్చిన మనిషిలే. విష్‌యూ గుడ్‌లక్ బావా. (వీధిలోకి చూస్తూ) ఇంకా లత రాలేదే ! (అరచేతిలో పిడికిలి గుద్దు కుంటూ పచార్లు చేస్తున్నాడు. ముగ్గురూ అతని విచిత్రంగా గమనిస్తున్నారు.)

(ఇప్పుడు గీత గ్లాసులో కాఫీ పట్టుకొచ్చింది)

గీత : కాఫీ తీసుకో అన్నయ్యా !

సత్యం : (అందుకుంటూ) థాంక్సు గీతా ! యిది నువ్విచ్చే చివరికాఫీ. ఇన్నాళ్లూ నువ్విచ్చేదే పుచ్చుకోవడం అలవాటైంది. ఇకనుంచీ నేనూ యివ్వగలను. చూడు. నీ కెప్పటికయినా పెళ్లి జరిగితే నాకు తప్పకుండా తెలియజెయ్. అప్పుడు మేము ఢిల్లీలోనో, శ్రీనగర్‌లోనో, సిమ్లాలోనో ఉంటాం.—అప్పుడు కాబోయే బావగారూ నువ్వూ మా దగ్గరికి హనీమూన్ వద్దురుగాని.

గీత : ఎక్కడికయినా వెళ్లివస్తావా అన్నయ్యా !

సత్యం : (నవ్వి) ఈ సారి వెళ్లడమేగాని రావడం వుండదమ్మా.

మాధ : అయితే ఈ లత ఎవరో—ఆ అమ్మాయిని పెళ్లి చేసుకుంటావటోయ్.

సత్యం : అది మీ కాలం ఫేషను బావా! లతే నన్ను చేసుకుంటోంది.

మాధ : మంచిదే.

సత్యం : అయితే మా కాపరం అనుపల్లిలో కాదు. దాదాపు యిలాంటి రెండిళ్లు ఖరీదుచేసే పోష్ కారులో.—

మాధ : కారులోనా !

సత్యం : అనుమానంగా వుంటే—నేను వెడుతున్నప్పుడు వీధిలోకి తొంగిచూడు. ఆరు నెలలు కార్ నివాసం. ఆరు వేల రూపాయల ఖర్చుతో దేశమంతా ఒక ప్రదక్షిణం చేసి వస్తాం.

మాధ: నువ్వూ పెద్దవాడివే. నేను నీకు చెప్పవల సిన వాడిని కాకపోవచ్చు. అయినా ఈ పని మంచిది కాదేమో ఆలోచించు.

సత్యం: కట్టుకున్న పెళ్లాన్ని కాళ్లూ చేతులూ కట్టేసి అనుపల్లిలో పారేసి, అత్తవారి దయాదాక్షిణ్యాలమీద బ్రతకడం మంచి దంటావా బావా? లేకపోతే ఇలా ఓ పొగరు బోతులాగ తిట్లు తింటూ బ్రతకడం మంచి దంటావా? మనిద్దరిలోకీ ఎవరు బలవంతుడో తెలుసా?-నువ్వు. నేనుఅనేమాటల్లో ఏఒక్కటి, బయట ఎవరినయినా అంటే నన్ను సజీవంగా సమాధిచేసేవారు. కాని నీకుచేతకాదు. ఎందుకో తెలుసా ? నీ ఆత్మగౌరవాన్ని, స్వేచ్ఛని ఇక్కడి బ్రతుక్కి పణంగా యిచ్చేశావు గనుక—నీ అసమర్థతలోంచే నేను మొదటి పాఠం నేర్చుకున్నాను బావా! అందుకనే వెళ్లిపోతు న్నాను.

రాజు: చాలా తెలివైన పని చేస్తున్నాననుకున్నావురా?

సత్యం: తెలివైనపనే నన్నయ్యా! పెళ్లాం పిల్లల్ని మరొకరి పంచన వదిలేసి, నిశ్చింతంగా జీవితం నుంచి పారిపోయిన కనీసం నీ కంటె చాలా తెలివైన పనిచేస్తున్నానన్నయ్యా. నిన్ను మాశాకే బావమీద కాస్తయినా గౌరవం మిగి లింది. ఎందుకో తెలుసా? రోగిష్టి భార్యని కనిపెట్టుకు వుండటానికైనా ఈ దౌర్భాగ్యపు వాతావరణాన్ని భరిస్తున్నాడు. కాని నువ్వు నికృష్టంలాంటి సంసారాన్ని దూరంగావుంచి సుఖంగా బ్రతుకుతున్నాననుకొంటున్నావు? ఈ ఆత్మవంచనతోనా నాకు సలహా యిస్తున్నది నువ్వు?

సుగు: సత్యం, మీ అన్నయ్యనేనా యీ మాటలు?

సత్యం: అవును వదినా! మాటలనడానికి మొదటి అర్హతని యివ్వాళ నేను సంపాదించుకున్నాను. బ్రతుకు భయంతో ప్రేమించిన అమ్మాయిని

పెళ్లి చేసుకోలేని పిరికి వాడాయన! బతుకు భయంనుంచి నన్ను నేను రక్షించుకోవడానికి అమ్మాయిని ప్రేమించేట్టు చేసుకున్న ధైర్యవంతుణ్ని నేను! ఈ ప్రపంచంలో పెద్దరికం వయస్సునిబట్టా, గుణాన్నిబట్టా?—నువ్వే నిర్ణయించు.

గీత : నువ్విలా వెళ్లిపోతే నాన్నగారు ఏమయిపోతారో ఆలోచించన్నయ్యా! నువ్వు వెళ్లడానికి వీల్లేదు.

సత్యం: ఏమిటి? వీల్లేదా! వీలున్న అందమయిన అమ్మాయిని పెళ్లి చేసుకోవడానికి ధైర్యంగా నిర్ణయించుకోలేని దానివి నువ్వు నాకు సలహా చెప్తున్నావా?

గీత : (తెల్లబోయి) అన్నయ్యా!

సత్యం: కేవలం సంసార భయానికి తమ జీవితాల్ని ధ్వంసం చేసుకున్న యింతటి సజీవ నిదర్శనాల్ని (సుగుణనీ, రాజునీ చూపుతూ) కాలదన్ని వంశాచారాన్ని నిలబెడుతున్న నువ్వు నాకు సలహా చెప్తున్నావా? — అదృష్టాన్ని అదృష్టమని గుర్తించడానికి తెలివి కావాలి. ఇంకా నువ్వు జీవితంలో ఏమీ నష్టపోలేదు. వేణుని యిప్పటికయినా పెళ్లి చేసుకో!

చల : (నవ్వుతూ) ఏమిట్రా కేకలు?

గీత : నాన్నా—అన్నయ్య ఎవరో అమ్మాయిని పెళ్లి చేసుకుని వెళ్లిపోతున్నాడు.

సత్యం: ఎవరో అమ్మాయికాదు—నా అదృష్టవశాత్తూ నన్ను ప్రేమించిన ఓ లక్షాధికారిణి. నేను చాలా అందంగా కనిపించానట ఆవిడకి. చాలా ధైర్యవంతుడినని కూడా అనుకుంది—మా బావని చూడలేదు కనుక. 'డ్రైవ్ చెయ్యగలవా?' అని అడిగింది. నేర్చుకుంటా నన్నాను. నెలరోజులు నేర్పింది. 'బూట్లు పాలిష్ చెయ్యగలవా?' అంది. కొనిస్తే చేసుకుంటానన్నాను. ఇది ఆవిడేకొంది. 'నా భర్తగా ఉండగలవా కొంత కాలం?' అంది. 'ప్రయత్నిస్తాను'—అన్నాను. అంతే—నన్ను లేవదీసుకుపోవడానికి నిశ్చయించింది. 'ఆధునిక రుక్మిణీ కళ్యాణం' హౌ డూ యూ లైకిట్?

చల : ఛీ నోర్ముయ్.

సత్యం : అంతగౌరవం నాకెందుకు నాన్నా! నేనేం పదిమంది ఆడపిల్లల్నికని దేశం మీదపడి బతకండ్రా అని వదిలేశానా? పెద్దకొడుక్కి గుమాస్తా చదువు, చిన్నకొడుక్కి నౌకరు చదువూ చదివించగలిగానా? ఇరవై ఏళ్ల కూతురికి పెళ్లి చెయ్యడం చేతకాక గుండెలమీద కుంపటి చేసుకున్నానా? వద్దు నాన్నా! ఆ అర్హత నాకు లేదు. మరెవరిచేతనయినా మూయించుకోండి మీ నోరు.

రాజు : సత్యం!

సత్యం : చూశావా అన్నయ్యకూడా నాతో ఏకీభవిస్తున్నాడు. అన్నయ్య నీలాగే తన సంతానాన్ని గుమాస్తాలుగా, నౌకర్లుగా చేసే తరిఫీదు యిస్తున్నాడు నాన్నా!

చల : మగాడివి. ఎవరో అమ్మాయితో దేశంమీదపడి తిరగడానికి సిగ్గులేదూ?

సత్యం: సిగ్గా? డ్రాయింగు మాష్టారి ఆరో కొడుకుగా కాలం వెళ్లబుచ్చడానికే ఇరవై ఏళ్లు సిగ్గుపడలేదు. సుఖంగా బతకడానికి అన్ని అర్హతలూగల అందమయిన అమ్మాయి భర్తగా ఉద్యోగం యిస్తే నిర్వహించడానికి సిగ్గెందుకు నాన్నా! కావలిస్తే నా బాల్యమిత్రుడు వేణుని అడగండి.

వేణు: (నవ్వుతూ) ఏమిటి?

సత్యం: నువ్వు చెయ్యని నేరానికి నిన్ను జైల్లో పెడతారనుకో. తప్పించుకొనే మార్గాన్ని ఓ అందమయిన అమ్మాయి చూపుతుంది. సిగ్గుపడి ఊరుకుంటావా?

వేణు : సందేహం ఎందుకు? వెంటనే బయటపడతాను.

సత్యం: విన్నారా?

వేణు: ఏం జరిగిం దిప్పుడు?

గీత : అన్నయ్య ఎవరో అమ్మాయితో యిల్లు వదిలి వెళ్లిపోతున్నాడు.

సత్యం: ఆ అమ్మాయి పెళ్లి చేసుకుంటాననే అదృష్టం కలిసి వచ్చింది. కవక (గీతవేపుచూస్తూ) అమ్మాయి అంగీకరించే ఏ పెళ్లయినా యింత అందంగా వుంటుంది.

వేణు: నీకు పిచ్చెక్కిందా ఏమిటి?

సత్యం: ఎక్కలేదు. అదే ఆశ్చర్యం బ్రదర్! అయినా పిచ్చెక్కే పరిస్థితులు నీ కెక్కడ అర్థమవు తాయి? జీవితాన్ని 50 ఏళ్లు ముందుకు చూసి సరిదిద్దుకోగల తండ్రికి ఒకే ఒక్క కొడుకువి. అజీర్ణంచేసేదాకా చదువుకో గలి గిన స్తోమతూ, ఆసక్తి వలిచే వాతావరణంలో పెరిగినవాడివి. చిన్నప్పటినుంచీ నమ్మకంగా ఒక అమ్మాయి ప్రేమలో బ్రతికిన వాడివి. నేనో! బొమ్మలువేసి అల్లుళ్లని పోషించే తండ్రికి ఆరో కొడుకుని. పిచ్చెక్కని ఈ గట్టి బుర్రనుమాత్రం పిచ్చితో చచ్చిపోయిన మా అమ్మ ప్రసాదించింది. ఇప్పుడయినా ఆ అమ్మాయికి భర్తగా టెంపరరీ ఉద్యోగం దొరికిందనుకో. ప్రొబేషన్ డిక్లేర్ అయేవరకూ కొంచెం కష్టపడాలిమరి.

(బయట కారు హారన్)

అదిగో లత వచ్చేసినట్టుంది. (ఇప్పుడు రామానుజం వచ్చాడు. చేతిలో ఓ పుస్తకం వుంది. చదువుతున్నచోట మధ్యన వేలుంది. దాన్నే చూస్తూ లోపలికి వచ్చాడు.)

రామా : ఒరే చలపతీ—మంచి—జోకొరా! (ఇప్పుడు తలెత్తేసరికి అంతమందీ కనిపించారు. తన వేపే చూస్తూ—అప్పటికీ ఒక సూట్‌కేస్ చేతోట్టుకున్న సత్యం కూడా కనిపించాడు.)

సత్యం: ఏమిటి మావయ్యా అది?

రామా : ఉద్యోగంలేని నటుడొకడు ఓ సర్కస్ కంపెనీ మేనేజరుని కలిశాడట. చచ్చిపోయిన ఎలుగు బంటివేషం వేసుకు రోజంతా బోనులో కూర్చునే ఉద్యోగం యిస్తానన్నాట్ట. గతిలేక నటుడు ఒప్పుకున్నాడు. వేషంవేసి యితన్ని బోనులోకి పంపారట. తీరా లోపలవెళ్లికిలిస్తూ భయంకరమైన ఎలుగుబంటి కనిపించేవరికి, హడలిపోయి, 'రక్షించండి మొర్రో' అంటూ కేకలు వెయ్యడం ప్రారంభించాడట. (నవ్వాపు కుంటూ) అప్పుడా రెండో ఎలుగుబంటి ఏమందో తెలుసా?

సత్యం: 'నోరు ముయ్యరా ఫూల్. లోకంలో నువ్వొక్కడివే నిరుద్యోగివనుకున్నావేమిటి?' అంది అంతేనా?

రామా: (ఆశ్చర్యంగా) నీ కెలా తెలుసు?

సత్యం: ఇన్నాళ్లూ నేను చెబుతున్న డైలాగు అదేగా? ఇంత అందమయిన సర్కస్ కంపెనీ ఎక్కడయినా చూశావా మావయ్యా?

రామా: (విరగబడి నవ్వి) భలేగా వుందిరా నీ జోక్! నేను చదివిందాన్ని మించిపోయింది.

(అంత హఠాత్తుగా నవ్వాపి)

పిల్లలవరూ నవ్వరేం?

సత్యం: దాన్ని వాళ్లు మరిచిపోయి చాలా ఏళ్లయింది మావయ్యా! మనమేం చేస్తున్నామో అర్థం కాక తెల్లబోయి చూస్తున్నారు.

సుగు: సత్యం పెళ్లి చేసుకున్నాట్ట నాన్నా!

మాధ: అతని భాషలో అయితే ఎవరో అమ్మాయి అతన్ని లేవదీసుకుపోతోంది.

రామా: అలాగా! (సత్యం దగ్గరికివచ్చి) కంగ్రాట్యులేషన్స్! చాలా సంతోషం!

చల : రామానుజం! వాడు బుద్ధితక్కువపని చేస్తూంటే నోట్లో గడ్డిపెట్టక ప్రోత్స హిస్తున్నావా?

రామా: వాడి బుద్ధి వాకెందుకు లేదా అని ఈర్ష్య పడుతున్నానురా! నిజం చెప్పు. వాడిక్కడ వుంటే, వచ్చే పదిహేనేళ్లలో వాడి పెళ్లి

గురించికాని వాడి జీవితం గురించికాని ఆలోచించే వాడివా నువ్వు?

చల : అయితే నువ్వూ వాడిపక్షాన చేరావన్నమాట.

సత్యం: సత్యంపక్షాన అందరూ సాక్ష్యం పలుకుతారు నాన్నా! థాంక్సు మావయ్యా! ఈ యింట్లో నీ ఒక్కడిమీదే నాకు గౌరవం. నువ్వు నా భుజం తడితే అంతే చాలు. వస్తా మావయ్యా—

రామా: ఎక్కడికిరా!

సత్యం: మొదట తిన్నగా బొంబాయి. అక్కణ్ణించి మిగతా ప్రోగ్రాం ప్లాన్ చేస్తాం.

మాధ: మరి పెళ్ళెక్కడ?

సత్యం: ఆవిడ హాండ్‌బాగ్‌లో. అక్కడ రూపాయన్నర స్టాంపుమీద కాంట్రాక్టు రాసి యిచ్చాను.

సుగు: ఏమని?

సత్యం: అర్థేచ, ధర్మేచ, కామేచ, నాతిచరామి—వస్తా మావయ్యా!

(రెండు సూట్‌కేసులూ తీసుకుని గుమ్మం దాకావెళ్ళి వెనక్కి తిరిగి, అందర్నీ తీక్షిగా పరికించాడు.)

నేను చేసిన పని మంచిదే అని మీ కెప్పటికయినా అనిపిస్తే మీ మనస్సులలో మీరు రాజీపడండి. కాని యిది చెడ్డపని అని తోస్తే—ఇలా జరగడానికి ఎవరు కారణమో, ఎందుకు కారణమో అంతా గుండెలమీద చెయ్యి వేసుకు ఆలోచించండి. ఇలా జరిగే జీవితాలకు యిలాంటి పర్యవసానం తప్పదు. రాయి విసిరినవాడు దాని దెబ్బకు సిద్ధపడాలి.

(బయట హారన్)

అదిగో మా బాస్ హారన్ మోగిస్తోంది. వస్తా, గుడ్‌బై.

(బయటకు వెళ్ళిపోయాడు.)

చాలాసేపు నిశ్శబ్దం—

రామా: వాడయ్యా మగాడు. మంచి చెయ్యడానికి, చెడు చెయ్యడానికీ ధైర్యం, మనస్థైర్యం ఉన్నవాడు.

(జోక్ బుక్ విప్పుతూ లోపలికి వెళ్ళిపోయాడు.)

(మాధవరావు గుమ్మందాకావెళ్ళి, కారు బయలుదేరి వెళ్ళడం ఆసక్తిగా చూశాడు. ఇంకా తనివి తీరక కాబోలు, చూదామని బయటకు నడిచాడు.)

రాజు : ఆఫీసుకి వెళ్తాను నాన్నా! వేళయింది.

(అని గాలిలో అనేసి బయటకు వెళ్ళిపోయాడు.)

చలపతిరావు మెల్లగా నడిచి దివాను ముందున్న బల్లమీద చతికిలబడ్డాడు.

వేణు: సత్యం అర్థం లేకుండా మాట్లాడే మనిషి కాదు. వాడు చెప్పింది—

చల : అర్థమయినా, తప్పున్నా సవరించుకోగలిగే వయస్సు దాటిపోయిందయ్యా. అవసరం లేని గోడకి అందమయిన పాఠం చెప్పేవాడు తప్పుకున్నాడు. ఏం లాభం?

గీత : (ఇప్పుడు ముందుకొచ్చింది. ఆమె మాటలు విని అంతా ఆమెవేపే ఆశ్చర్యంగా చూశారు.) లాభం వుంది నాన్నా. (అంతా అటుతిరిగారు) అన్నయ్య మీ ఒక్కరికేకాదు. అందరికీ బుద్ధి చెప్పి వెళ్ళాడు.

(లోపలికి వెళ్ళడానికి అటుతిరిగిన వేణూ నిర్ఘాంతపోయి యిటుతిరిగాడు.)

చల : ఏమిటే నువ్వనేది?

గీత : వ్యవధిమించిపోకుండా నా స్వార్థానికి నేను తొందరపడుతున్నాను. నన్ను క్షమించు వేణూ.

వేణు : (అర్థంకాక) దేనికి!

గీత : నేను తెలివితక్కువగా ప్రవర్తించి నిన్ను బాధపెట్టినందుకు. నీ కభ్యంతరం లేకపోతే నేను పెళ్ళికి సిద్ధంగా వున్నాను.

సుగు : గీతా! నిజంగానా?

గీత : అవును వదినా! ఏం వేణూ? మాట్లాడవేం?

సుగు : వాడేం మాట్లాడుతాడమ్మా! శిక్షించడం, క్షమించడంకూడా నీ హక్కేనమ్మా! అవు ననడానికీ, కాదనడానికీ వాడికి అధికారం లేదు.

వేణు : అక్కయ్యా!

సుగు : నీకు హాస్పటల్‌కి టైమవుతోంది, కదా! ఇది మాట్లాడే సమయంకాదు—ఆలోచించు కొనే సమయం. బయలుదేరు త్వరగా. నువ్వు వెళ్లు గీతా!

(వేణూ యింట్లోకీ, గీత వంటగదిలోకీ వెళ్లి పోయారు. విశ్శబ్దంగా, నిశ్చలంగా కూర్చున్న చల పతిరావుని చిరునవ్వుతో గమనిస్తోంది సుగుణ. కొంత సేపటికి అతను తలెత్తితే ఆమె చిరునవ్వు కనిపించింది)

చల : ఎందుకు నవ్వుతున్నావమ్మా? నన్ను చూసేనా?

సుగు : నీ మౌనాన్ని చూసి మామయ్యా! నిజం చెప్పు. ఒక్కక్షణం క్రితమే ఆత్మహత్య చేసుకోవా లనిపించిందికదూ ?

చల : అనిపిస్తే ఆశ్చర్యమా?

సుగు : పోనీ ఇప్పుడు బతకాలని వుందా?

చల : నీ నవ్వు చూస్తే ఎప్పుడూ నాకా ఆశ కనిపిస్తుందమ్మా!

సుగు : పిచ్చి మామయ్యా. ఆలోచనలుమాని ఈ కుంచె పట్టుకొని బొమ్మలు వెయ్యి.

(అతని చేతిలో కుంచెనీ, Pallete నీ వుంచింది.) అందంగా చెట్టురూపు దిద్దావు. అపురూపంగా, రెక్కలువిచ్చుకున్న పువ్వులతో చెట్టంతా నింపెయ్. ఊఁ. కానియ్.

చల : (కేన్వాసువేపు చూస్తూ) వద్దమ్మా—ఎంత చెట్టుకయినా—రెండు పువ్వులుంటేనే అందం.

సుగు : అదేమిటి?

చల : అవునమ్మా. రాజా, గీతా యిద్దరే వుంటే ఈ సంసారం యిలా వుండేదా? వేనూ రామానుజంలాగ ఆడుతూ పాడుతూ వుండమా?

సుగు : (నవ్వి) మంచి సిద్ధాంతమే. అయితే రెండు పువ్వులే వెయ్యి. రెండు పువ్వుల్ని అలంకరించు కున్న చెట్టు ఎంత అందంగా వుంటుందో నిరూపించు. ఊఁ కానియ్.

(చలపతి కుంచె కదుపుతూవుంటే—చెక్కిలి మీద చెయ్యి వేసుకుని సుగుణ ఆసక్తితో చూస్తోంది.)

(అయిపోయింది.)



# భావకవిత్వంలో నండూరి

## శ్రీ రామమోహన్ రావు

'Man is borne free but is every where in chains' అన్న రూసో సిద్ధాంతం ఫ్రాన్సు దేశంలో పాతుకొనిపోయింది. మానవుణ్ణి మానవుడిగా పరిగణించకుండు మర్యాద మన్ననలు మంటగలిపే స్వేచ్ఛను రూపుమాపి ఆశయాలకు సంకెళ్ళువేసి కదలనీయక మెదలనీయక కాలరాచి బంధిఖానాలలో బంధించి రాజులు తమ అధికారాన్ని చెలాయించుకొన్నారు. ప్రజలలో అసంతృప్తి చెలరేగి విశ్రుంఖలత్వానికి దారి తీసింది. సమానత్వం, సహోదరత్వం ఏనాడో తెరవెనుకకు మరలిపోయాయి. స్వేచ్ఛకు తావులేదు. అధికారం అందలం ఎక్కి అమాయకుల ప్రాణాలను పొట్టను పెట్టుకున్నది. నలుమూలల అంధకారం అలముకొన్నది. జాతియావత్తు అధికారుల ఆలోచనల్లో శలభాల్లా మాడిపోతున్నారు. ఏ జాతి మాత్రం ఎంతకాలం ఓపిక వహిస్తుంది? 1789 సంవత్సరం వచ్చింది. అది ఫ్రాన్సు దేశ చరిత్రలో సువర్ణయుగం. అధికారాన్ని హస్తగతం చేసికొని అమాయకుల గుండెలపై అహంకారంతో గంతులువేసే క్రూరులపై తిరుగుబాటు బయలుదేరింది. స్వేచ్ఛ, సమానత్వం, సహోదరత్వం కావాలనే వినాదం మిన్ను ముట్టింది. జనులహృదయాల్లో చైతన్యం వెల్లివిరిసింది. ఆనందానికి అవధిలేదు. చీకటిపోయి వెలుతురు కన్పించింది. చక్రవర్తులకోటలు పేటలుగా మారి సామాన్య మానవునకు నిలయమై విరీక్షణ కాస్కారమైనాయి. అధర్మం అధఃపాతాళానికి త్రొక్కబడింది. కులం మతం ప్రాతిపదికలకు, బూజుపట్టిన ఆచారానికి, అనుష్ఠానికి తిలోదకాలిచ్చి నూతన సమాజ నిర్మాణం కొలకు ఆశ చిగురించింది ఫ్రెంచి రివల్యూషన్. దేశంలో జరిగిన మార్పులు సాహిత్యంపైన సోడమూపి నూతన సాహిత్య ప్రక్రియకు దోహదం చేశాయి. అట్టిసాహిత్య ప్రక్రియయే కాల్పనిక కవిత. ఫ్రాన్సుదేశం యిలాంటి నూతన సాహిత్య ప్రక్రియలకు పుట్టినిల్లయి దారిచూపిన దీప కళికలా ప్రపంచంలో ఒక స్థానాన్ని సంపాదించుకొన్నది.

కాల్పనిక కవిత ప్రాచీనకవిత్వంపై ధ్వజమెత్తింది. భాషలోను భావంలోను మార్పుతెచ్చి ప్రకృతిని ఆరాధ్య దేవతగా భావించి కమ్మని కవితకు నాంది పల్కింది. ఫ్రాన్సులో బయలుదేరిన కాల్పనికోద్యమం జర్మనీదేశాన్ని ప్రభావితం చేసింది. దానితో హెర్డర్, షిల్లర్ మొదలగు రచయితలు తమ దేశంలో ముమ్మరంగా ప్రచారం చేశారు. అది వారి ప్రచార ప్రాబల్యంలో మహోద్యమంగా వెలసింది. ఫ్రాన్సులో కాల్పనిక కవిత తలెత్తినప్పుడే ఇంగ్లండులో కూడ మొగ్గ తొడిగింది. తరువాత ఫ్రాన్సు జర్మనీ దేశాల ప్రభావం బలమై స్థిరత్వాన్ని కలిగించింది. చివరకది 18 వ శతాబ్దాంతానికి శాఖోపశాఖలై వ్యాపించింది. మొదటగా ఆంగ్ల సాహిత్యంలో వర్డ్స్వర్తు, కొలరిడ్జి, బ్లేక్ ఫ్రెంచి రివల్యూషన్ ఫలితాలను చూచారు. ఇకను వారు కూడనూ తమ కవితకు పట్టాభిషేకంచేసి సింహాసనంపై కూర్చుండబెట్టారు. రచయితలు చేబట్టిన ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. బ్లేక్, బైరన్, షెల్లీ, కీట్సు మున్నగువారు కాల్పనిక కవితలు వ్రాయటం ప్రారంభించారు. వీరిపైన ఫ్రెంచి రివల్యూషను చెరగని ముద్రలువేసి గుండెల్లో నాటుకొనిపోయింది. ఒక్కొక్కరిని ఒక్కొక్క విధంగా మార్చి ముందుకు నడిపించింది. 'The French Revolution influenced Wordsworth, Coleridge, Blake on sentimental side, Shelly on the intellectual side, Byron on the political side.' (M. M. Rai Jami-"Romantics and Victorians'). అయితే కీట్సుపైన ఒక ప్రత్యేక ప్రభావం ఉన్నదని చెప్పటానికి వీలులేదు. కాని

ఫ్రెంచి రివల్యూషను అతనినికూడ ప్రోత్సహించి కవితావతరణకు కారణమయ్యిందని చెప్పవచ్చును.

కాల్పనిక కవిత ప్రారంభం కావటంతో సాహిత్యంలో వాతావరణం మారింది. విపరీతమైన వర్ణనలకు స్వస్తిచెప్పి నిసర్గమైన ప్రకృతినే వస్తువుగా భావించి ఆణిముత్యాలు కవులు సృష్టించారు. కొండలు కోనలు, భూమ్యాకాశాలు, తరులు విరులు క్రొత్తరూపు దిద్దుకొన్నాయి. ప్రకృతిమాత ఒడిలో ఉయ్యాలలూగి తీయని కలలుగని స్వప్న జగత్తులో త్రుళ్ళింతలాడి అపూర్వమైన భావనాలోకాన్ని సృజించి జానపదజీవితాన్నితీర్చి ప్రణయాన్ని ప్రేమనుపేర్చి సాహిత్యంలో సోపానాలు నిర్మించారు. కేవలం ప్రాచీన కవితను ద్వేషించటం కాల్పనిక కవుల పరమావధిగాదు. ప్రాచీన కవితనుండి పాత్రలను గ్రహించి తమ భావాలను జోడించి క్రొత్తదనాన్నితెచ్చి, కవితను ఆత్మాశ్రయపు పంధావైపుకు నడిపించారు. విషయాన్ని చెప్పకుండా వర్ణించడం ప్రధానం కాదు. అట్టివర్ణన తమ నిర్ణయాలకు చుక్కెదురు. మదిలో మదించుకొనిపోయిన మమతల్ని మనోవీణపై మధురంగా పల్కించటం వారి ధ్యేయం. ఆ ఆశయ సాధనకు భాషనుసులభంచేసి భావాన్ని సున్నితం సుకుమారంచేసి ఛందస్సును మలచారు. ఆంగ్ల కాల్పనిక కవుల ప్రధానోద్దేశం... 'To tell of rural life, the sorrows, the loves and natural Joys of the poor and found in the pathetic and passionate description of common human nature their best and most vital subject. (Stopford Brooke-"Naturalism in English Poetry"). కవులు భావనాప్రపంచానికి పరుగులుపెట్టి పడుచుదనాన్ని పరువాన్ని పండించారు. ఆ పొంగే వయస్సులో ఎడబాటు సహింపలేక కొందరు; భగ్నమైన ప్రణయాన్నిచేత చిక్కించుకోలేక అసమర్థులై నిరీక్షణ సల్పి విరహులైన వారు కొందరు; ఏదో ఒక విధంగా వీరు నైటింగేల్‌తో, లార్కుతో తమ విరహాన్ని చెప్పుకొని కాస్త ఊరట పొందారు. కాలం జరుగుతున్న కొలదీ కవిత స్ఫూర్తివంతమై ప్రతి కవికి ఊహాసౌధాలు నిర్మించింది. వాడు బయలుదేరిన కాల్పనిక కవిత్వం యువకులపై బాగా ప్రభావం చూపింది. స్పెన్సరు వ్రాసిన 'ఫెయిరీ క్వీన్' రచనలో ఆంగ్ల రచనలో కాల్పనిక కవిత్వం ముమ్మూర్తులా నిండింది.

ఆంగ్ల కవులైన వర్డ్స్‌వర్తు, షెల్లీ, కీట్సు, బైరన్ మున్నగువారు ప్రియురాండ్రను ప్రేమించి ప్రేమను భగ్నం చేసికొన్నారు. ఆ సమయంలోనే రకరకాలైన భావగీతాలు వ్రాసి తమ బాధకు ఉపశమనం కలిగించుకొన్నారు. ఆ గీతాలే కాల్పనిక కవితకు మూలస్తంభాలయ్యాయి.

ఆంగ్ల సాహిత్యాన్ని మనవారు అధ్యయనం చేయటంతో వారివలె వీరుకూడ నూతన కవితానిర్మాణానికి ఉరకులు వేశారు. కాల్పనిక కవితా పరవశంలో మునిగిపోయి అట్టి కవిత అల్లటం మొదలుపెట్టారు. ఆ విధంగా ముందు ప్రారంభించినవారు రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల, నాయని, బసవరాజు, నండూరి మొదలైనవారు. వీరందరు రచనల్లో తలమున్కలైనవారు. ఇందులో ఒకరు వర్డ్సువర్తు అయితే మరొకరు కీట్సు అయి రసికతను చిలకరించే గీతాలు వ్రాశారు. ఆంగ్లరీతులు తెలుగులోనికి వచ్చాయి. చురుకుదనంలో ప్రణయం పొంగి వలపు పాటలు పాడించి వగలు నిండించింది. వలపు పాటలకు తట్టుకోలేక తబ్బిబ్బుఅయి ప్రణయ పరిష్వంగాన్ని వీడలేక హృదయాన్ని మాననిగాయం చేసికొని ప్రణయదేవత కొఱకు తపస్సు చేశారు. భావకవుల జీవితాల్లో ప్రణయ కలాపాలు సంచలనం కలిగించాయి. ప్రియురాండ్రను ప్రేమించారు. ప్రేమకు ప్రళయం సంభవించింది, మనస్సు చితికిపోయింది. చితికిన హృదయాన్ని అతుకుపెట్టుకొనుటకు ప్రియురాండ్రను అక్షరంలో నిక్షేపించుకొని ఆరాధించారు. వారే కావ్యాల్లో నాయికలై అవతరించి హృదయాన్ని తట్టారు. మదిలో మెదిలిన సుందరి దివ్యసుందరంగా నర్తిస్తూ గీతాల మాటున దాగి దాగుడుమూతలాడుకొన్నారు. దొరికినట్లే దొరికి దూరమై దూర దూర తీరాలకు పయనించారు. చూపు తూపులు విసిరినట్లే విసరి హఠాత్తుగా అస్త్రసన్యాసం చేశారు. తొలి

వలపు లందించిన తొయ్యలి ఎడబాటు సహించలేక పోయారు. కొండగాలి తిరిగినప్పుడల్లా గుండెలు ఊసులాడుకొన్నాయి, ముద్దుల మురళి మ్రోగినప్పుడు హృదయమే బృందావనమై స్వర్గధామమైనది. లేజవరాలు ఎంకి పెదవులు కదలినప్పుడు అందాన్ని ఆనందాన్ని పొందారు. మూర్తి ముద్దుల మూట కడుతున్నప్పుడు ముగ్ధమోహన రూపులై మురిసిపోయారు. మురిసిపోయిన వారిలో కృష్ణశాస్త్రి, విశ్వనాథ, అడవి, తల్లావఝ్ఝల, నాయని, నండూరి ముఖ్యులు. ఊర్వశి కృష్ణశాస్త్రిని పాడించి పాడించి దివినుండి భువికి దిగకుండ వలపు గుమ్మరించింది. కిన్నెరసాని వాగై వంకలుదీరి పలుపోకలుపోయి మెరుపులో మెరసి వెలుగులో వరసి విశ్వనాథుని విడచి సిరిసీడల మాటుకు తరలింది. శశికళ కొండరాతిపైన చేరి ముదిత చిత్తంతో చిత్రాలుగీస్తూ, 'అరచి అరచి పిలువలేను, తరచి తరచి వెదుకలేను, వరచి యెగురు కాంక్షలతో పడి చెదరును నా గుండెలు' అంటూ నా రూపం నీ కుంచెలో చూపింపవూయని తియ్యటి కోరికతో రాతిబండల మాటున దాగింది. బాపిరాజు శశికళను యికను వెదుకలేక వేసారిపోయారు. హృదయేశ్వరి శివశంకరశాస్త్రి ముందునిలబడి—ప్రియా నీ రూపు నిర్నిమిత్ ఉత్సుకతో నిరీక్షించుచున్నదానను నీ సుధానుభూతి నా కెన్నటికో మరి లభించేది. నీ సమాగమ ప్రాప్తికొఱకు తహతహలాడు జవ్వనిని నను చేరగరావా—అంటూ హృదయయేశ్వరియై హృదయంలో ఉండిపోయింది. వత్సల నాయని గుండెలను మీటింది. మనోవీణను మ్రోగించి మధుర శ్రుతులు పల్కించింది. అవ్యయానంద మధురరేఖాంచలములు దిద్దుకొనుచు సంతతము విమల స్వప్నగాథల తేలియాడుతూ హృదయమందిరంలో కందళించి మన స్సులోవికసించి కళలుదేరి తరుణశారద రాకాసుధాకరాచ్ఛ బింబమునుదాటి అనంతపథ యాత్ర సాగించి తిరిగి అర్ధాంగిలో అదృశ్యమయ్యింది. ఎంకి నండూరి ఒడిలో ఉయ్యాల లూగింది. కథలుచెప్పి, పాటలు పాడి పాపాలు పోగొట్టి, కళ్ళతొ కనకాభిషేకాలు చేసింది. సిరి చీరగట్టి నాగమల్లెలు నల్లని కురుల ముడిపెట్టి ఏటిగట్టున నిలబడి వయ్యారంగా సాగిపోతూ అడవి మల్లెలతో దోబూచులాడుకొన్నది. కాని వేదులకు బసవరాజుకు ప్రత్యేకంగా భావనారాయణులు ఎంత వెదకిన ఈ లోకంలో కన్పించక పోవటంలో నామాంకితం చేయలేకపోయారు. ఈ విధంగా వాయికలను కవులు సృష్టించి సాహిత్యంలో ఒక అధునాతనమైన స్థానాన్ని సంపాదించారు. భావకవిత్వం ప్రబలిపోయి భావకవుల ఆకారాలను పూర్తిగా మార్చివేసి మాటలలో ప్రణయం తొంగిచూచింది. ఆంధ్ర సాహిత్యంలో ఒక వినూత్నమైన సాహిత్య ప్రక్రియకు శ్రీకారం చుట్టింది, భావకవితాయుగం.

భావకవిత్వానికి నిర్వచనాలు, వ్యాఖ్యానాలు బయలుదేరాయి. సాహిత్యం పుంజీభూతమై పుంజుకొంటున్నప్పుడే అందరి దృష్టినిపొంది నిర్వచనం చేయుటకుగాని వ్యాఖ్యానం చెప్పటకుగాని దారితీస్తుంది. ఈ కవిత ప్రాచీనకవితకు భిన్నంగా ఉండటంచేత కొందరిని కలకల నవ్వించింది. మరికొందరిని ఏడిపించింది. కలకల నవ్వినవారు మూడు కాలాలపాటు వర్ధిల్లాలని దీవించారు. ఇక ఏడ్చినవారు అభావకవిత్వమని, అపస్మారక కవిత్వమని, 'బావ' కవిత్వమని హేళన చేశారు. అది చాలక కత్తిరి చేతబట్టుకొని కత్తిరింపులు చేయుటకు పూనుకొన్నారు. 'కొయ్య బొమ్మలు మెచ్చుకళ్ళకు కోమలులు సౌరెక్క'నా మరి క్రొత్తదనాన్ని అహ్వానించలేక ప్రాతదనాన్ని పట్టుకొని పెనుగులాడుతారు. పిన్నలు పెద్దలు ఎంతగా ద్వేషించినప్పటికి కవిత గజ్జకట్టి నర్తించింది. మొదటగా గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రపత్రికలో పదేపదే నూతనంగా బయలుదేరిన కవితను భావకవిత్వమని పేర్కొనెడివారట. అటుతరువాత వారన్న మాటస్థిరంఅయి భావకవిత్వముగానే పరిగణింపబడుతూ వచ్చింది.

భావముయొక్క కవితా రూపము గనుక భావకవిత్వమన్నారు. విశ్వనాథ సత్యనారాయణగారు 'కావ్యములు రసప్రధానములు. కావ్యములందు ప్రతిపద్యమునందు భావముండవచ్చును. కాని కావ్యము సమష్టి మీద రసాభిముఖముగా పోవును. ఖండ కావ్యములందును భావములు రసవ్యంజకములు కావచ్చును. కాని ఖండకావ్యములు ప్రధానముగా ఒక భావమును ఆశ్రయించియే యుండును. అందుచేత దీనిని భావకవిత్వ

ఫ్రెంచి రివల్యూషను అతనినికూడ ప్రోత్సహించి కవితావతరణకు కారణమయ్యిందని చెప్పవచ్చును.

కాల్పనిక కవిత ప్రారంభం కావటంతో సాహిత్యంలో వాతావరణం మారింది. విపరీతమైన వర్ణనలకు స్వస్తిచెప్పి నిసర్గమైన ప్రకృతినే వస్తువుగా భావించి ఆణిముత్యాలు కవులు సృష్టించారు. కొండలు కోనలు, భూమ్యాకాశాలు, తరులు విరులు క్రొత్తరూపు దిద్దుకొన్నాయి. ప్రకృతిమాత ఒడిలో ఉయ్యాలలూగి తీయని కలలుగని స్వప్నజగత్తులో త్రుళ్ళింతలాడి అపూర్వమైన భావనాలోకాన్ని సృజించి జానపదజీవితాన్నితీర్చి ప్రణయాన్ని ప్రేమనుపేర్చి సాహిత్యంలో సోపానాలు నిర్మించారు. కేవలం ప్రాచీన కవితను ద్వేషించటం కాల్పనిక కవుల పరమావధిగాదు. ప్రాచీన కవితనుండి పాత్రలను గ్రహించి తమ భావాలను జోడించి క్రొత్తదనాన్నితెచ్చి, కవితను ఆత్మాశ్రయపు పంథావైపుకు నడిపించారు. విషయాన్ని చెప్పకుండా వర్ణించడం ప్రధానం కాదు. అట్టివర్ణన తమ నిర్ణయాలకు చుక్కెదురు. మదిలో మదించుకొనిపోయిన మమతల్ని మహోవీణపై మధురంగా పలికించటం వారి ధ్యేయం. ఆ ఆశయ సాధనకు భాషనుసులభంచేసి భావాన్ని సున్నితం సుకుమారంచేసి ఛందస్సును మలచారు. ఆంగ్ల కాల్పనిక కవుల ప్రధానోద్దేశం... 'To tell of rural life, the sorrows, the loves and natural Joys of the poor and found in the pathetic and passionate description of common human nature their best and most vital subject. (Stopford Brooke–"Naturalism in English Poetry"). కవులు భావప్రపంచానికి పరుగులుపెట్టి పడుచుదనాన్ని పరువాన్ని పండించారు. ఆ పొంగే వయస్సులో ఎడబాటు సహింపలేక కొందరు; భగ్నమైన ప్రణయాన్నిచేత చిక్కించుకోలేక అసమర్థులై నిరీక్షణ సల్పి నిరీవహులైన వారు కొందరు; ఏదో ఒక విధంగా వీరు నైటింగేల్‌తో, లార్క్‌తో తమ విరహాన్ని చెప్పుకొని కాస్త ఊరట పొందారు. కాలం జరుగుతున్న కొలదీ కవిత స్ఫూర్తివంతమై ప్రతి కవికి ఊహాసౌధాలు నిర్మించింది. నాడు బయలుదేరిన కాల్పనిక కవిత్వం యువకులపై బాగా ప్రభావం చూపింది. స్పెన్సరు వ్రాసిన 'ఫెయిరీ క్వీన్' రచనలో ఆంగ్ల రచనలో కాల్పనిక కవిత్వం ముమ్మూర్తులా నిండింది.

ఆంగ్ల కవులైన వర్డ్స్‌వర్తు, షెల్లీ, కీట్సు, బైరన్ మున్నగువారు ప్రియురాండ్రను ప్రేమించి ప్రేమను భగ్నం చేసికొన్నారు. ఆ సమయంలోనే రకరకాలైన భావగీతాలు వ్రాసి తమ బాధకు ఉపశమనం కలిగించుకొన్నారు. ఆ గీతాలే కాల్పనిక కవితకు మూలస్తంభాలయ్యాయి.

ఆంగ్ల సాహిత్యాన్ని మనవారు అధ్యయనం చేయటంతో వారివలె వీరుకూడ నూతన కవితా నిర్మాణానికి ఉరకులు వేశారు. కాల్పనిక కవితా పరవశంలో మునిగిపోయి అట్టి కవిత అల్లటం మొదలుపెట్టారు. ఆ విధంగా ముందు ప్రారంభించినవారు రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల, నాయని, బసవరాజు, నండూరి మొదలైనవారు. వీరందరు రచనల్లో తలమున్కలైనవారు. ఇందులో ఒకరు వర్డ్స్‌వర్తు అయితే మరొకరు కీట్సు అయి రసికతను చిలకరించే గీతాలు వ్రాశారు. ఆంగ్లరీతులు తెలుగులోనికి వచ్చాయి. చురుకుదనంలో ప్రణయం పొంగి వలపు పాటలు పాడించి వగలు నిండించింది. వలపు పాటలకు తట్టుకోలేక తబ్బిబ్బుఅయి ప్రణయ పరిష్వంగాన్ని వీడలేక హృదయాన్ని మానసిగాయం చేసికొని ప్రణయదేవత కొరకు తపస్సు చేశారు. భావకవుల జీవితాల్లో ప్రణయ కలాపాలు సంచలనం కలిగించాయి. ప్రియురాండ్రను ప్రేమించారు. ప్రేమకు ప్రళయం సంభవించింది, మనస్సు చితికిపోయింది. చితికిన హృదయాన్ని అతుకుపెట్టుకొనుటకు ప్రియురాండ్రను అక్షరంలో నిక్షేపించుకొని ఆరాధించారు. వారే కావ్యాల్లో నాయికలై అవతరించి హృదయాన్ని తట్టారు. మదిలో మెదిలిన సుందరి దివ్యసుందరంగా నర్తిస్తూ గీతాల మాటున దాగి దాగుడుమూతలాడుకొన్నారు. దొరికినట్లే దొరికి దూరమై దూర దూర తీరాలకు పయనించారు. చూపు తూపులు విసరినట్లే విసరి హఠాత్తుగా అస్త్రసన్యాసం చేశారు. తొలి

వలపు లందించిన తొయ్యలి ఎడబాటు సహించలేక పోయారు. కొండగాలి తిరిగినప్పుడల్లా గుండెలు ఊసులాడుకొన్నాయి, ముద్దుల మురళి మ్రోగినప్పుడు హృదయమే బృందావనమై స్వర్గధామమైనది. లేఖవరాలు ఎంకి పెదవులు కదలినప్పుడు అందాన్ని ఆనందాన్ని పొందారు. మూర్తి ముద్దుల మూట కడుతున్నప్పుడు ముగ్ధమోహన రూపులై మురిసిపోయారు. మురిసిపోయిన వారిలో కృష్ణశాస్త్రి, విశ్వనాథ, అడవి, తల్లావఝ్ఝల, నాయని, నండూరి ముఖ్యులు. ఊర్వశి కృష్ణశాస్త్రిని పాడించి పాడించి దివినుండి భువికి దిగకుండ వలపు గుమ్మరించింది. కిన్నెరసాని వాగై వంకలుదీరి పలుపోకలుపోయి మెరుపులో మెరసి వెలుగులో వరసి విశ్వనాథుని విడచి నీలినీడల మాటుకు తరలింది. శశికళ కొండరాతిపైన చేరి ముదిత చిత్తంతో చిత్రాలుగీస్తూ, 'అరచి అరచి పిలువలేను, తరచి తరచి వెదుకలేను, పరచి యెగురు కాంక్షలతో పడి చెదరును నా గుండెలు' అంటూ నా రూపం నీ కుంచెలో చూపింపవూయని తియ్యటి కోరికతో రాతిబండల మాటున దాగింది. బాపిరాజు శశికళను యికను వెదుకలేక వేసారిపోయారు. హృదయేశ్వరి శివశంకరశాస్త్రి ముందునిలబడి–ప్రియా నీ రూపు నిల్పితి ఉత్సుకతో నిరీక్షించుచున్నదానను నీ సుధానుభవాతి నా కెన్నటికో మరి లభించేది. నీ సమాగమ ప్రాప్తికొఱకు తహతహలాడు జవ్వనివి నను చేరగరావా–అంటూ హృదయయేశ్వరియై హృదయంలో ఉండిపోయింది. వత్సల నాయని గుండెలను మీటింది. మనోవీణను మ్రోగించి మధుర శ్రుతులు పల్కించింది. అవ్యయానంద మధుర రేఖాంచలములు దిద్దుకొనుచు సంతతము విమల స్వప్నగాథల తేలియాడుతూ హృదయమందిరంలో కందళించి మనస్సులో వికసించి కళలుదేరి తరుణశారద రాకాసుధాకరాచ్ఛ బింబమునుదాటి అనంతపథ యాత్ర సాగించి తిరిగి అర్ధాంగిలో అదృశ్యమయ్యింది. ఎంకి నండూరి ఒడిలో ఉయ్యాల లూగింది. కథలుచెప్పి, పాటలు పాడి పాపాలు పోగొట్టి, కస్తూరి కనకాభిషేకాలు చేసింది. నీలి చీరగట్టి నాగమల్లెలు నల్లని కురుల ముడిపెట్టి ఏటిగట్టున నిలబడి వయ్యారంగా సాగిపోతూ అడవి మల్లెలతో దోబూచులాడుకొన్నది. కాని వేదులకు బసవరాజుకు ప్రత్యేకంగా భావనారాయణులు ఎంత వెదకిన ఈ లోకంలో కన్పించక పోవటంలో నామాంకితం చేయలేకపోయారు. ఈ విధంగా నాయికలను కవులు సృష్టించి సాహిత్యంలో ఒక అధునాతనమైన స్థానాన్ని సంపాదించారు. భావకవిత్వం ప్రబలిపోయి భావకవుల ఆకారాలను పూర్తిగా మార్చివేసి మాటలలో ప్రణయం తొంగిచూచింది. ఆంధ్ర సాహిత్యంలో ఒక విమాత్నమైన సాహిత్య ప్రక్రియకు శ్రీకారం చుట్టింది, భావకవితాయుగం.

భావకవిత్వానికి నిర్వచనాలు, వ్యాఖ్యానాలు బయలుదేరాయి. సాహిత్యం పుంజీభూతమై పుంజుకొంటున్నప్పుడే అందరి దృష్టినిపొంది నిర్వచనం చేయుటకుగాని వ్యాఖ్యానం చెప్పుటకుగాని దారితీస్తుంది. ఈ కవిత ప్రాచీనకవితకు భిన్నంగా ఉండటంచేత కొందరిని కలకల నవ్వించింది. మరికొందరిని ఏడిపించింది. కలకల నవ్వినవారు మూడు కాలాలపాటు వర్థిల్లాలని దీవించారు. ఇక ఏడ్చినవారు అభావకవిత్వమని, అపస్మారక కవిత్వమని, 'బావ' కవిత్వమని హేళన చేశారు. అది చాలక కత్తెర చేతబట్టుకొని కత్తిరింపులు చేయుటకు పూనుకొన్నారు. 'కొయ్య బొమ్మలు మెచ్చుకళ్ళకు కోమలులు సౌరెక్క'నా మరి క్రొత్తదనాన్ని ఆహ్వానించలేక ప్రాతదనాన్ని పట్టుకొని పెనుగులాడుతారు. పిన్నలు పెద్దలు ఎంతగా ద్వేషించినప్పటికి కవిత గజ్జకట్టి నర్తించింది. మొదటగా గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రపత్రికలో పదేపదే నూతనంగా బయలుదేరిన కవితను భావకవిత్వమని పేర్కొనెడివారట. ఆటుతరువాత వారన్న మాటస్థిరంఅయి భావకవిత్వముగానే పరిగణింపబడుతూ వచ్చింది.

భావముయొక్క కవితా రూపము గనుక భావకవిత్వమన్నారు. విశ్వనాథ సత్యనారాయణగారు 'కావ్యములు రసప్రధానములు. కావ్యములందు ప్రతిపద్యమునందు భావముండవచ్చును. కాని కావ్యము సమష్టిమీద రసాభిముఖముగా పోవును. ఖండ కావ్యములందును భావములు రసవ్యంజకములు కావచ్చును. కాని ఖండకావ్యములు ప్రధానముగా ఒక భావమును ఆశ్రయించియే యుండును. అందుచేత దీనిని భావకవిత్వ

మని అనవచ్చున'ని పేర్కొన్నారు. శ్రీశ్రీగారు దీనిని గురించి 'హృదయాలను మానసాలను కలవర పరుస్తూ 'అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాద ప్రాంతరాలలో కవికి నిరాఘాటంగా విహరించే అధికారం కలదు. అట్టి అతని సంచారాలలో ఏ నవ్య హఠాత్తనవో కావ్యగీతం ఒకటి మెరుగులు తీరిన విలక్షణ రచనా ధోరణిలో వెలుగు చూస్తుంది. ఆ గీతం కవి అనుభవించిన రసస్వాదము సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించగలుగుతుంది. ఉత్కృష్ట భావకవిత్వానికి నా నిర్వచనం ఇది*' అని అన్నారు. విశ్వనాథ వివరణ శ్రీశ్రీ వివరణకన్న భిన్నంగా ఉంది. ఏ కవియైనా ముందుగా ఒక దృశ్యాన్ని ఊహించుకొని తరువాత పాఠకులకు సాక్షాత్కరింపజేసికొంటాడు. తను మొదటగా పొందిన అనుభూతికి భావనచేర్చి అక్షరంగా మార్చి అందిస్తాడు. ఏ నిర్వచనమైనా కవిలో కల్గిన హృదయగత మానసిక వ్యవస్థనే భావం అంటాము. లేక హృదయంలో కల్గిన 'వికృతి' అంటాము. అట్టి వికృతిని భావంగా పేరు పెట్టి పిలుస్తున్నాము. ఈ భావమే కవికి తోడుగా నిలిచి దార్శనిక జగత్తుకు తరలిపోయినపుడు అద్భుతమైన ప్రమోదంపొంది దానికి సూచకంగా కవితగా అవతరిస్తుంది. ఆ కవితలో కవి రససిద్ధి పొందినపుడే అట్టి కవిత అవతరిస్తుంది. భావం ప్రధానంగా జరిగింది గాన భావకవిత్వం అని పెద్దలు పేరు పెట్టారు.

ప్రతికవితకు కొన్ని లక్షణాలుంటాయి. ఆ లక్షణాలనుబట్టి కవిత సాగుతుంది. భావకవిత్వానికి పేర్కొనదగిన కొన్ని లక్షణాలు ఉన్నాయి. అవి సామాన్యంగా భావకవులందరియందు గోచరిస్తాయి.

భావకవుల రచనా వస్తువు ప్రకృతి. అది రచనకు కొండంత బలాన్ని యిచ్చింది. మతిలో ఆవే[illegible]ంచియున్న వ్యవస్థను ఉద్దీపితంచేసి మనోహర[illegible]న కల్పనకు అవకాశం కల్గిస్తుంది. కవితకు ప్ర[illegible]న సంపదనిచ్చినా అచ్చటచ్చట కృత్రిమత్వం చోటు చే[illegible]న్నది. నదీనదాలు నక్షత్రాలు పర్వతాలు క్రొత్తరూపాలను సంతరించుకొన్నాయి. అది ఇది యనిగాక సర్వము ప్రకృతినుండి గ్రహించి పరవశులై కవులు భావకవిత్వానికి మెరుగులు దిద్దారు. భావకవిత్వానికి ప్రకృతికి విడదీయరాని సంబంధం ఏర్పడింది.

ప్రణయం వారి సొత్తు. భావకవుల ఊహలను ఉజ్జ్వలం జేసింది ప్రణయం. ప్రణయం పొంగనిదే భావకవిత ఆవిర్భవించలేదు. యావత్తు ప్రణయం చిలవలుపలవలై మదిని నిండుకొన్నది. భావకవితకు ప్రణయం ప్రాణప్రదానంచేసి నిలబెట్టింది.

ఊహాసుందరులు కవుల రచనల్లో తొంగి చూచారు. వారిని, కవులు గుడిలోని దేవతలను ఆరాధించినట్లు ఆరాధించారు. ప్రతిక్షణం మదిలో మెదిలి కలవరం కలిగించి కమ్మని కవితకు నాంది వచనాలు పలికించారు. కలలో కరగిన కన్యలు రచనలో ప్రణయ మూర్తులుగా కన్పించి మనస్సును ఆందోళన పరచారు. భావకవితలో ప్రేయసికి సమున్నతస్థానం లభించింది.

వర్ణనలకు ప్రాముఖ్యం లేదు. భావం ప్రధానంగా ఉంటుంది. భాషలో స్వేచ్ఛ కన్పిస్తుంది. కనబడిన ప్రతివస్తువు కవుల చేతుల్లో సుకుమారంగా తయారయింది. సూర్యోదయం చంద్రోదయం వివరించటానికి పేజీలు పెరగలేదు. హృదయం స్పందించే విధాన విషయంచెప్పబడింది.

దేశభక్తి, స్మృతి మున్నగు లక్షణాలు కవితలో ప్రత్యక్షమయాయి. సౌందర్యం అందని ఆనందంగా వాస్తవిక జగత్తులో నిలిచి పదేపదే తహతహలాడించింది. ఆత్మగతమైన బాధలకు నిలయమై ఎడబాటును విరహాన్ని కలిగించి ఉత్కంఠతను ఉత్సుకతను పెంచింది. అది చాలక కొండలు కోనలు త్రిప్పింది.

ఇవి సామాన్యంగా భావకవులు రచనల్లో కన్పిస్తాయి. రచనలు సామాన్యుడికి అర్థంగాకుండ (గీతాలు) ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. అయినా పాఠకుడు రసానందజగత్తును చేరుకొని పగలే వెన్నెలగా భావిస్తాడు. ఇందులో కథ కన్పించదు. పుట్టు

* ఈ నిర్వచనాలు శ్రీ నారాయణరెడ్డి 'ఆధునిక కవిత్వము — సంప్రదాయము'అను గ్రంథమునుండి గ్రహింపబడినవి.

పూర్వోత్తరాలుండవు. కాని పచ్చని ఆకులమధ్య పరు వాన్ని ప్రదర్శించి ఇది నా జన్మ అంటూ వివ రిస్తుంది కవిత.

భావకవితాప్రపంచంలో నండూరి 'ఎంకి పాటలు' ఉచిత స్థానాన్ని ఆక్రమించి వెలుగునీడల వేపు ప్రేలుమాపి వెన్నెల మరుగులు పోసి తోటల మాటున సీటుగా నడిచింది. తొలి ఉషస్సులో తొంగి చూచి సంజకెంజాయలో తన్మయించింది సుందర మందారంలా తెలుగునడిగడ్డపై నిలిచి సొగసులు వలపులు వయ్యారాలు అందించింది. ఎంకి నాయుడు బావ రూపాలు ఊహాజగత్తునుండి భువికి అవత రించాయి. ఎంకి జానపదులమధ్య దివ్యభామినిలా దర్శనమిచ్చింది. నాయుడుబావ రాలలో పూలు పూయిం చాడు. వారిరువురు నండూరి మనస్సున నిండిన మమ తను పెనవేసి పిండుకొన్న మధుర హృదయాలు. ప్రకృతి మాత పొంతను గూడు నిర్మించుకొని జీవి తాన్ని నందనవనంగా మార్చుకొని అనుభవించిన మరపు రాని పాత్రలు.

నండూరిపై ఆంగ్లకవుల ప్రభావం ప్రస రించింది. వర్డ్స్‌వర్తు, కీట్సు, షెల్లీ, బర్న్సు మొదలగు వారి రచనలు తలమున్కలగునట్లు చేశాయి. అయితే బర్న్సు రచనలు వారిని ఎక్కువగా ఆక ర్షించాయి. 'ఎంకి పాటల' రచనకు ఆ కవి మూల కారకుడైనాడు. బర్న్సుకవి వస్తుతః స్కాట్లెండు దేశానికి చెందినవాడు. కాని ఆతని కవితలు స్కాచ్ భాషలోకంటె ఆంగ్లభాషలో ప్రసిద్ధిపొందాయి. అతడు గ్రామీణ జీవితాన్ని రచనల్లో చిత్రించిన వాడు. కట్టుబొట్టులను ఒక దృష్టితో పరిశీలించి కొలనిగట్లపై తిరిగే జానపదులను వర్ణించాడు. నండూరి బర్న్సురచనలాదర్శంగా గ్రహించి వర్డ్స వర్తు, కీట్సు, షెల్లీలను తోడుగా స్వీకరించి 'ఎంకి పాటలు' వ్రాశారు. బర్న్సుకవిలా దేశ నుడికారాలు రచనలో చూపించారు. అప్పటికి 'ఎంకి పాటలు' తెలుగు సాహిత్యంలో నూతన ప్రయోగం. భావము భాష పూర్తిగా మారిపోయాయి. నండూరి రచనా ప్రవే శంతో భావకవిత్వంలో విప్లవాత్మకమైన మార్పులు సంభవించాయి. పాటలు గుండెలు నిూటి నిద్రనుండి మేల్కొలిపి కరుడుకట్టిన భావాన్ని పటాపంచలుచేసి ఆమోదాన్ని అందించేవి. చిన్నచిన్న మాటలతో గాంభీర్యమైన అర్థాన్ని ప్రతిపాదించి ఔన్నత్యాన్ని సౌకుమార్యాన్నిచేర్చి భావకవితాకన్యకు అమూల్య వజ్రాభరణంగా నండూరి తీర్చారు.

ప్రాథమికదశలో 'ఎంకిపాటల'ను తృణీక రించినవారున్నారు. ఎంకి నాయుడుబావలు సంకరదంపతు లని తూలనాడారుకొందరు; సహృదయత ఉన్నవారు అమృతమూర్తులని కీర్తించారు. 'ఎంకిపాటలు' మంచి చెడులమధ్య కొట్టుమిట్టాడింది. ఆ సందర్భంలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు బుజంతట్టి ప్రోత్సాహాన్ని యిచ్చి పాటలకు ఊపిరిపోసి ఆంధ్ర పత్రికలో—భారతిలో ప్రచురించేవారట. వారి ఆదరణ నండూరిలో ధైర్యాన్ని పెంచింది. వారు చూపిన ఆసక్తివలన 'ఎంకిపాటల'కు మంచిప్రచారం లభిం చింది. ఎంకి నాయుడుబావలు పంతులుగారు దీవించడం చేతనే ఆంధ్రదేశంలో అడుగుపెట్టారు. 'ఎంకి పాటలు—'ఎట్టివారినైనా "ఔరౌరా" యని అని పించునంతటి మహోజ్వలత పీనియందు విలసిల్లి తత్ప్రభావమున శ్రోతల హృదయసీమలు ఒక్క మాటుగా మిరుమిట్లు గొలుపుటయును కలుగు చున్నది.' [పీఠిక—పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి]. పామరులభాషయని చీదరించుకొన్న పండితులను తలవంకించునట్లుచేసింది.

నండూరి సుబ్బారావుగారు ఎంకిపాటల్లో ఎంకినిగురించి చెప్తూ, 'ఎంకి నా ప్రేమ రసానిక్షేత్రయము, నా శృంగారవాక్కునకు విశ్రామ స్థానము, నా వలపులకు నిదానము'ని అన్నారు. ఆట్టిమాటలు ఉమాకాంతవిద్యాశేఖరులకు వెర్రిగా కన్పించాయి. ఎంకి నాయుడుబావ గాథలను జీవద్భాషలో దాంపత్యపూతముగను, భావోన్నతముగా తీర్చిదిద్దుటలో నండూరి కృతకృత్యులైనారని చె[illegible] వచ్చును.

ఎంకి నాయుడుబావ పాత్రలు జ[illegible]ల్లో [illegible] నుండి కావ్యసితి నందుకొన్నాయి. కల్లా[illegible]లు తెలి యక ఒకరికొసంఒకరు ఎడబాటును సహించలేక విరహాన్ని పొందినవారు వారు. వారి జీవితం 'గుండె గొంతుక

లోన కొట్లాడతాది – కూకుండనీదురా కూసింత సేపు' అన్న పదంతో ప్రారంభమయింది. కన్ను గిలిగించి బులిపించింది. ఈడుండమని ఆడుండమని యిపిగించి యిలుదూరిపోయింది. పెళ్లికాకముందే వారిలో జీవనలత ముందుకుసాగింది. హృదయాల్లో భావాలు ముప్పిరికొన్నాయి. జాముర్రాతివేళ జడుపూగిడుపూ మాని చెట్టుపుట్టలుదాటి చేనిగట్టున మెల్లగాజేరి నాయుడుబావను చూస్తూ వలపులు పండించుకొనేది ఎంకి. ఆ తరువాత వైవాహికజీవితంలో అడుగుపెట్టారు. 'ఉసరికొడతం కసరికొడతం' అన్నీ పోయాయి. ఆనందంగా తిరుపతివెళ్లి వెంకటేశ్వరుణ్ణి దర్శించివచ్చారు. కొంతకాలం ముచ్చట్లలో జరిగిపోయింది. ఒకనాడు నాయుడుబావ గ్రామాంతరానికి వెళ్లాడు. రావటల ఆలస్యమయింది. దూరాన తన రాజకేమయిందో అని కన్నీరుపెట్టింది ఎంకి. బావ వచ్చాడు. ఎంకి కలత మాయమయింది. నాయుడుబావ ఎంకిని ఊరడించాడు. మరల ఎంకితో భద్రాద్రికి ప్రయాణం సాగించాడు. ఎంకి చంకలో సంబరాలు చిందించే బోసినవ్వుల బుజ్జాయి కలిగాడు. ఇక వారి జీవితంలో లోటులేకుండా సాగిపోయింది సంసారం. ఎంకి నాయుడుబావలు గృహస్థాశ్రమంలో ఆధ్యాత్మికమైన అనుభూతినిపొంది దాంపత్యాన్ని ధర్మనిష్ఠగావించుకొన్నారు.

ఎంకి స్వాధీనపతిక. నాయుడుబావను తన కొంగుబంగారంగా చేసికొని సంసార జీవితాన్ని మాధుర్యంగా తీర్చుకొన్నది. ఆమె 'సిలిసీరాగట్టి సీటుగా' వచ్చి నాయుడుబావ నీడలో మేడకట్టుకొన్నది. మెళ్లో పూసలపేరు తల్లో పువ్వులపేరు సెక్కట పిన్నీ మచ్చ ధరించి ముగ్ధసుందరిలా సౌందర్యాన్ని నింపుకొన్నది. ఆమె సామాన్యమైనదికాదు. అసమాన్యంలో అపురూపాన్ని సంతరించుకొన్నది. అందువలనే

పదము పాడిందంటే
పాపాలు పోవాల
కతలు సెప్పిందంటె
కలకాల ముండాల'

అన్న అద్భుతత్వాన్ని పొందింది. అంతటి అద్భుతత్వం పొందినా —

ఈ రేయి నన్నొల్ల నేరవా రాజా
ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర
ఆకాశ మేమూలో
అణగిపోయిన రేయి
మేటి సెందురుడు మల్లె
పాటుసూపుల కులికి
ఈరేయి నన్నొల్లనేరవా రాజా

ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర—అని విప్రలబ్ధయై విరహాన్ని పొందింది. నాయుడుబావ ఎడబాటు గుండెల్లో మంటలు మండించింది. ప్రణయాగ్నికి తట్టుకోలేక ప్రళయం సృష్టించుకొన్నది.

యెలుతురంతా మేసి
యేరు నెమరేసింది
కలవరపు నా బతుకు
కలత నిదరయ్యింద'ని వాపోయింది.

ఆమెయొక్క అమాయకహృదయం నాయుడుబావ కొఱకు ఆక్రందించింది. అలసట నెరుగని జీవితంలో అచ్చట్లు ముచ్చట్లు గంభీరంగా సాగిపోయాయి. ఆ ఆనందసాగరంలో ఓలలాడుతూ

సిరులతో ముత్యాల
సరుల చెల్లాటతో
సిరిసిరీ మువ్వలా
చిందులా గంతులా

వేసి కోటిగొంతులు కలిపి నటనలు సాగించింది. తావాలుచేసింది.

సికలోన సికకలిపి
మొకము మొకమూ కలిపి
వెలుగుదేవతకు చ
క్కలిగింతలెట్టింది

ఎంకి సుందర మందహాసం కోటికి పడగలెత్తింది. చక్కలిగింతలుపెట్టి వళ్లంతా పులకలు కలిగించింది. సౌందర్యం వెలుగుదేవతకన్న మిన్న. సంసారంలో తేనెజల్లులు కురిపించి జీవితాన్ని అమృతమయంగా మార్చింది. ఆపదలు ఎంకిని కౌన్నత్య

మూర్తిగా రూపొందించాయి. ఆమెయొక్క అంతర్గశక్తికి అది నికషోపలం. అందులో ఆమెయొక్క అంతరంగం ప్రభాతంలా వెల్లివిరిసింది.

ఎంకి ప్రణయస్వరూపం. పరువాల రెమ్మ, నీలి కన్నులసుందరి. వల్లెనికురులదాగిన నాగమల్లి. కలకాల మీదినమే నిలుచు మనకన్న నాయుడుబావలో కలసిపోయింది. గాలికైనా కౌగిలీయని బావ పరిష్వంగంలో కళ్లుమూసికొని మురిసిపోయింది. కనుచూపుతో తియ్యగా మాట్లాడి ఊపిరితో తెనుగించుతూ కనుబొమ్మతో ఆడించి మనస్సు కరిగించింది. ప్రక్కనచేరి ఉరకలువేయించింది. క్రొత్త నవ్వుల కులుకులో క్రొత్తమెరుపులు తళుక్కుమనిపించి తెలివి రానీయకుండ కమ్మనికథలు చెప్పి కలలోని మనిషిలా మారిపోయిందా క్షణంలో. పూలబాసలు తెలిసిన ఎంకి నాయుడుబావను పువ్వులలో దాచుకొన్నది. పూలతో నెయ్యాలు కయ్యాలు కల్పించుకొన్నది. చెట్లచాటునదాగి చేలపైనున్న నాయుడు బావతో స్వప్నలోకాన్ని దర్శించి స్వర్గాన్ని అందుకొన్నది.

ఆమె మహాలక్ష్మి. ఐశ్వర్యానికి అధిష్ఠానదేవత. దాంపత్యంలో అనంతమైన ధర్మానికి నిలయమై దాంపత్యధర్మాన్ని పునీతంచేసి గృహస్థాశ్రమాన్ని చల్లని చంద్రుని వెన్నెలలా కూర్చుకున్నది. 'రాసోరింటికైనా' రంగుతెచ్చే ఉత్తమాయిల్లాలు. బింకాలు పంతాలుపట్టకుండ 'జాలిగుండెల' ఎంకిగా మారిపోయింది. మాటలో మంచిలో సొగసులో మనసులో ఉన్నతంగానే నిలబడింది. సరసాలాడటానికే జంకింది. చిటికేస్తే చిరునవ్వులు ఒలకబోసిన భామిని ఆశ్రమవాసస్త్రీగా మారిపోయింది. జానపదాంగన అయినా పూర్వజన్మ సంస్కారబలంచేత తన దాంపత్య జీవితాన్ని సుఖవంతంగా చేసికొని ఆనందించింది. ఆమె ముగ్ధసుందరి. చందమామకైనా కళంకమున్నదిగాని ఎంకికి కళంకములేదు. ముచ్చటగా జీవితాన్ని ముమ్మూర్తులా నిండించుకుని 'తాను ఎదుట నిలిస్తే కాశీదేవుణ్ణి' తల అడుముకొనేటట్లు చేయగల్గిన ముగ్ధమూర్తి.

నండూరి ఎంకి నాయుడుబావలు 'కల్పశాఖికమ ప్రసవించిన సర్వాంగ పరిపూర్ణ పరిణతి ఫలపితంబు లగు దివ్యప్రసూన రాజములు'. 'భావనాసీమలందు ప్రోదిచేయబడి ప్రాభవ సంపదలను సంపాదించుకొన్న ప్రణయమూర్తులు.' అందములు చందములు ముద్దుముచ్చటలతో జీవితనౌకను నడిపించుకొన్న నవదంపతులు. పాట వినగానే పాత్రలు ముందుకువచ్చి నిలబడినట్లుగా ఉంటాయి. వాటికే ప్రాణముంటే ఎంత మురిసిపోతాయో అనిపిస్తుంది. నిజంగా కదిలే ఊహకు కన్నులుంటే ఎంత ఆనందముంటుందో ఎంకి నాయుడుబావలు మనకు నిత్యమూ ఎదురుగా నిలబడితే అంత ఆనందంగా ప్రణయసామ్రాజ్యంలో మునిగిపోతాము. నిర్మలమైన ప్రేమకు చలువపందిళ్ళు నిర్మించిన కమ్మని రూపాలు. ఎంకి నాయుడుబావ పాత్రలను గురించి పలువురు పలువిధాలుగా తమ అభిప్రాయాలను వివరించారు. పురాణం సూరిశాస్త్రి గారు ఎంకి నాయుడుబావలంటే ఎవరోకారు వారు జీవేశ్వరులన్నారు. పంచాగ్నులవారు శృంగార రసాధిష్ఠాన దేవతలగు రతీమన్మథులని పేర్కొన్నారు. వేదం వెంకటరాయశాస్త్రిగారు రంభా నలకూబరులు అలంకారశాస్త్రవిరుద్ధంగా శృంగారసల్లాపంచేసినదోషం వల్ల కలియుగంలో ఎంకి నాయుడుబావలుగా జన్మించారని పల్కారు. వీరుగాక అనాడెందరో భావకవిత్వంలో వెలసిన ముచ్చటైన జంటకు కోరికోరి ముడుపులు చెల్లించుకొన్నారు.

'కథా ప్రారంభం, కళోద్భవం, కళావిన్యాసం, కళాభివృద్ధి అన్నీ కొన్ని జీవితాల్లో స్పష్టంగా కనబడతాయి. కొన్ని కళాస్వరూపాలకి అసలు అంతే దొరకదు. ముక్కుతిమ్మన పదమార్దవం, కీట్సు సౌందర్యాన్వేషణ, క్షేత్రయ్య ఆధ్యాత్మిక శృంగారం యింకా యింకా ఎన్నోతెలీని ఎడారిగానాల ప్రతిధ్వనుల్ని పలికించిన ఎంకిపాటల జన్మకారణం ఏ నాటికీని ఘూడం.' (మ్యూజింగ్సు-చలం). కళ యెప్పుడూ రూపానికి ప్రతిరూపం తయారుచేసి అపరబ్రహ్మ సృష్టి చేస్తుంది. ఆ సృష్టి సామాన్యసృష్టికంటె మించినది. మేధాశీతమైన శక్తిని యుక్తిని చేదుకొని కళాకారుడు రూపాన్నిగీసి కుంచెతో రంగులు పూస్తాడు. కవిని కూడ ఒకరకంగా చూస్తే

కళాకారుడే. ఎంకి నాయుడుబావలను చూచిన తరువాత నండూరి సుబ్బారావు గారు స్వతహాగా కుంచెపట్టుకుని చిత్రాలు చిత్రించక పోయినా ఆ పాత్రలను మనోఫలకంపైన చిత్రించుకొని ప్రజలకందించిన మధురచిత్రకారునిగా కన్పిస్తారు. చదివిన ప్రతి పాఠకుడికి పాత్రలు ముందు ఎకసెక్కాలాడుకుంటారు. చంకను బిడ్డనుచేర్చుకొని కొంగు బట్టుకుని కొండమెట్లు ఎక్కుతున్నట్లు కన్పిస్తారు. ఎన్నిజన్మలసంస్కారబలమో వాటికి నేటికి పదాల్లో ఎంకి నాయుడుబావలు పంతాలాడుకున్నట్లు గంతులువేస్తారు. ఎంకి పండువెన్నెలసోనలు పిండి పండించుకొన్నది. నాయుడుబావ ప్రణయాన్ని పవిత్రం చేసికొని కీర్తించాడు. వారిద్దరు భావకవిత్వానికి ప్రాణప్రతిష్ఠ చేశారు. జీవితాలను పొరపొచ్చంలేకుండా గడుపుకొన్నారు. ఇట్టి భావాలన్నీ చిత్రించుడంచేతనే నండూరి పాటల్లో దర్శనమిస్తారు. అదే కవితకు పరాకాష్ఠ. ప్రకృష్టత్వము.

నండూరి పదిమంది మాట్లాడేభాషకు పట్టంకట్టి కవితారంగంలోకి ప్రవేశం కల్పించారు. ఆ భాషలో కథలు వ్యథలుచెప్పి సుఖసంతోషాలు వివరించి కలలు కలతలు పెంచి పెంపు చేకూర్చి సెబాస్ అనిపించుకున్నవారు. రచనతో సాహిత్యానికి వినూత్నత్వం సంతరించారు. చిన్నచిన్న మాటలు పొందుపరచి నవ్యత నాపాదించి నవనీతాన్ని చిలికించారు. ప్రతిపదంలో రసం పరవళ్ళు త్రొక్కింది. పాటలో పచ్చనిచేలు పండువెన్నెల్లు, నీలినీడలు కనబడి కన్పిస్తాయి. అవి 'ఎల్లావచ్చాయోవచ్చాయి ఒక గుంపుగా కవి హృదయాన్ని చీల్చుకొని భావాలు మరోలోకపు హంసలవలె ఆయన మనస్సుతో ఉద్దేశ్యంతో ప్రమేయం లేకుండా విరుచుకుపడాయి. అందువల్లనే వాటి కంత బలం. ఆయన యీ సంతానం దేశంలో గాలి దుమారంలేపి కవిత్వపు చెత్తనంతా వూడ్చి కడుపులు మండించాయి'' (చలం). వాడేగాదు యీ వాటికి ఈ పాటలంటే ఈసడించుకొని కళ్ళు మూసికొని ఆ పాత్రలంటే ముక్కుమీద వ్రేలువేసికొని తిట్టిపోసే వారున్నారు. సహృదయత లోపించిన సంస్కార రహితులు యిట్టి అసందర్భపు ప్రలాపాలుచేస్తారు. ఇట్టి పరిహాసం తిట్లు తిలోదకాలు శాపాలు ఏనాటికి మాయమగునో మరి. సంస్కారం కలిగి సమానతను గౌరవించుకొని మంచిని మహత్తరంగా భావించుకొని కీర్తించేరోజువరకు ఎదురు చూడాలి. అప్పటికి ఈ దౌర్భాగ్యలక్షణాలన్నీ అడుగంటుతాయని ఆశిద్దాము.

ఎంకిపాటలు దేశంలోకివచ్చిన తరువాత ఆ పాటలనుబట్టి లంబాడి పాటలు, కాపుపాటలు ఇంకా అనేకమైన పాటలు పుట్టాయి. తరువాత పుట్టిన పాటలు ఎంకిపాటలతో సరితూగలేకపోయాయి. భావనా బలం లోపించింది. రసార్ద్రత కలిగించలేకనే ఆ పాటలు సరిరాకపోయినాయి.

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం ఈ మూడు ఉంటేనే కవిత్వమని, కవియని అన్నారు. ఇందేది లోపించినా కవిత్వంకాదు పొమ్మన్నారు. ఆ సిద్ధాంతానికి కాలదోషం పట్టింది. మదిని హృదిని పండి పిండాలి. భావఝరిలో కలిసిపోయి పులకలు పొంగించి ఉత్తుంగతరంగంలా చెలియలికట్టను త్రెంచుకొని ప్రవహించేదిమాత్రం కవిత్వం ఎందుకు కాదు? సతతము సంఘర్షణలో నలిగి నీరసించే వారికి ఎంకి పాటల కవిత్వం నచ్చుతుందా? ఆలోచనలు అజ్ఞానంతో పెంచుకొని నూతనత్వాన్ని చూడలేక కొంటెమాటలంటారు. ఏ కవితకైనా అందం ఉంటే ఆనందించి ఆ ఆనందాన్ని పదిమందికి పంచిపెట్టి పరమార్థాన్ని పొందాలి. అదే కవికి పదివేలు.

మానస సరోవర ప్రాంతాల్లో విహరించి ఆత్మబలంతో చక్కదిద్దిన 'నండూరి సుబ్బారావు తనకు సాక్షాత్కరించిన కవితను అందుకోవడంలో బంధాలను తెంచివేశాడు. నియమాలను తోసి పార వేశాడు. మహాసాహసంతో ఈయన గీతాలు గుండెలలో నుంచి సూటిగా వెచ్చగా ప్రవహిస్తవి. ఈయన సంస్కారం స్వచ్ఛమైన భూసారంనుంచి ఉత్తేజ మందినది. మహాసునిశితమైన హృదయంతో భావిస్తాడు. చూపుతో మాటాడి ఊపిరితో తెనిగించే నిపుణుడు. భావమున భాషలో అన్నిట సాహసంతో ఎ బావుటా ఎత్తినాడు. ఈ తిరుగుబాటు కొందరకు గాలి దుమారమయింది. కొందరకు నవయుగ ప్రభాత వాయు ప్రసరణ మయింది.' (వైతాళికులు—ముద్దుకృష్ణ).

———

# జీవనశిల్పి

## శ్రీమతి యస్. సుందరమ్మ

**1**

ఆ సరసీతటిన్ ఘనవటాగ్రమునందు స్వతంత్రతా సమా
శ్వాసితమైన జీవనము సల్పుము గ్రామటికాంతరద్రుమా
వాసదురాశలేల ఖగవర్య! కులాయముఁ గూల్తురో అన
ర్ఘాసువు లాహరింత్రో అదయాత్మ లమాయిక ఘాతుకుల్ ప్రజల్.

**2**

ఇక్కడ నక్కడం దిరిగి యే చిఱుపుల్లలొ యొండొకండుగా
ముక్కున నేరితెచ్చి కడుముద్దుగఁ గట్టితి వొక్కపూటయుం
దిక్కచిటారు కొమ్మలపయిన్ భవదీయనిసర్గ నీడన
వ్యక్తప్రతి చాతురిం గని భళా! యని మెత్తురు శిల్పిచంద్రులున్.

**3**

అరుణరేఖ లంబరము నం దుదయింపకమున్న లేచి ఆ
హారసమార్జనార్థము దిగంతవిహారమొనర్చి గూటికిం
జేరెదవీవు మాపటికి స్వీయవిధిన్ విడనాడి వ్యర్థవా
క్యారతఁ గాలముం గడుపు సోమరిపోతులు నిన్ను మెత్తురే!

**4**

మేదుర కార్యదీక్షఁగొని మింటిపయిం బెనుగాలివాకలో
ఈదుచుఁబోవు నిన్నుగని యించుక యించుక అసదోవ నా
పాదములం గదల్చి భ్రమపాటున తెక్కలురాక చచ్చునై
మేదిని నిల్చి నీ దెసకు మిన్నక చూతు విహంగమోత్తమా!

**5**

దరులను ముంచు కాలువ విధంబునఁ బొంగుచువచ్చు వాన ముం
దఱఁ బఱతెంచె శీతపవనంబులు సాంద్రగరుద్విలీనముం
దరమృదులాంగవై భవ! పతంగమ! హాయిగ నిద్రబొమ్ము మం
థర తరుపర్ణజాలముల దాగిన వెచ్చని గూటిలోపలన్.

---

# ఆధునిక భాషాశాస్త్రం- వికాసం, పరిణామం

డా. పి. ఎస్. సుబ్రహ్మణ్యం

విజ్ఞాన సముపార్జనకి మానవుడికి భాష అత్యంత ప్రధానమైనది గనక భాషని గురించిన చర్చ కొన్ని జాతుల్లో ప్రాచీన కాలంలోనే ప్రారంభమైంది. గ్రీకులు రోమనులూ ప్రాచీన కాలంలోనే తమ భాషలలోని పదాల వ్యుత్పత్తిని గురించి చర్చలు కొనసాగించారు. అంతే కాకుండా వారు పదాలకీ అవి సూచించే అర్థాలకీ సహజ సంబంధం ఉందా లేక యీ పద పదార్థ సంబంధం కృత్రిమమైనదా అనే విషయంకూడా చర్చించారు. కాని ఆ కాలంలో వారు తమ చర్చలు తమ తమ భాషలకే పరిమితం చేసుకుని ఉండడంవల్ల నిజమైన భాష స్వభావం తెలుసుకోలేకపోయారు. ఇల్లాగే యూదులుకూడా మానవులంతా ఒకే భాష మాట్లాడక విభిన్న భాషలు ఎందుకు మాట్లాడుతారు? అనే విషయాన్ని గురించి ఆలోచించారు. దీనికివారు బైబిలులో ఇచ్చిన సమాధానం. 'మానవులుచేసే నేరాలకి, వారి అహంకారానికీ భగవంతుడిచ్చిన శిక్షే యీ విభిన్న భాషలు' అని! ఈ విధంగా పాశ్చాత్య దేశాల్లో భాషని గురించిన చర్చ మతప్రధానంగా కొనసాగింది. వ్యుత్పత్తి నిర్ణయంలోకూడా వారు తప్పుతోవే తొక్కారు. దీనికి ప్రధాన కారణం వారికి ఒక పదంలో ధాతువునీ ప్రత్యయాన్నీ విభజించే విధానం తెలియక పోవడమే. దీనివల్లనే వారు లాటిన్ వుల్పేస్ (పంచమీ విభక్తి వుల్పిస్) 'నక్క' అనే పదం వొలో 'ఎగురుతున్నాను' పేస్ (సం. వి. పెదిస్) 'పాదం'—యీ రెండు పదాల సమ్మేళనం అనీ లెపుస్ (సం. వి. లెపోరిస్) 'కుందేలు' అనేపదం లెవిస్ 'తేలిక', 'పేస్' 'పాదం' అనే పదాల సమ్మేళనం అనీ నమ్మారు. ఈ పదాల్లో ధాతు ప్రత్యయ విభాగం భిన్నమైనదనీ, ఒక పదంలోని వర్ణాల మార్పులో నియమం ఉంటుందనీ వారికేమాత్రం గోచరించలేదు. వర్ణాల విభేదాన్ని లెక్క చేయక పోవడమే కాకుండా వారు వ్యుత్పత్తి నిర్ణయంలో అర్థానికికూడా ఏమీ ప్రాధాన్యం ఇవ్వలేదు. బెల్లమ్ 'యుద్ధం' అనే పదం యుద్ధం అందమైనది కాదు గనక బెల్లస్ 'అందం' అనే పదాన్నించి వచ్చిందనీ ఫోకస్ 'శాంతి' అనే పదం ఫోకస్ 'అందవికారం' అనే పదాన్నించి వచ్చిందనీ (శాంతి అందవికారమైనది కాదు గనక) ఇలాంటి వింత వ్యుత్పత్తులుకూడా ఇచ్చారు. ఇటువంటి వ్యుత్పత్తులు అక్కడక్కడ కాకుండా వారి చర్చలనిండా నిండిఉండి మనల్ని దిగ్భ్రాంత పరుస్తాయి. ఇంతే కాకుండా భాషల పరస్పర సంబంధం విషయంలోకూడా వారు సరియైన నిర్ణయానికి రాలేకపోయారు. గ్రీకుల నాగరికత రోమనుల నాగరికతకన్న ఉన్నతమైనది కాబట్టి లాటిన్ భాష గ్రీకుభాషయొక్క అపభ్రంశ రూపం అని అనుకున్నారు. క్రైస్తవమతం వ్యాప్తిలోకి వచ్చిన తరవాత ఆ మతాన్ననుసరించి స్వర్గంలో మాట్లాడే భాష హిబ్రూ కావడంవల్ల హిబ్రూయే అన్ని ప్రపంచ భాషలకీ మూలమని వారు నమ్మారు. హిబ్రూ పదాలకీ, యూరపియన్ భాషల పదాలకీ ఏమాత్రం వర్ణార్థ సామ్యంఉన్నా అటువంటి పదాలకి పరస్పర సంబంధం ఉందని నిర్ణయించేవారు. ఈ విషయంలోకూడా వర్ణసామ్యం తక్కువగా ఉన్నపదాలకికూడా సంబంధం కల్పించడానికి హిబ్రూ భాష మిగిలిన భాషలవలెకాక కుడినుంచి ఎడమకి వ్రాసే

వారనే విషయాన్నికూడా ఉపపత్తిగా చూపేవారు. ఆ కాలంలో వారు వ్రాసే అక్షరాలకీ అవి సూచించే వర్ణాలకీ భేదముందనే విషయంకూడా గుర్తించలేదు. పాశ్చాత్యులు భాషల్ని గురించి ఇన్ని విషయాలు సుదీర్ఘంగా చర్చించినా అన్నిటిలోనూ వారు తప్పుతోవే తొక్కేరు. ఇటువంటి లోపభూయిష్ఠమైన అభిప్రాయాలే నిర్దుష్టమైనవని పద్దెనిమిదో శతాబ్దం వరకూ పాశ్చాత్యులు నమ్ముతూ వచ్చారు.

శాస్త్రీయ దృక్పథంతో భాషల్ని పరిశీలించడం పద్దెనిమిదో శతాబ్దం చివరనే ప్రారంభమైందని చెప్పవచ్చు. భాషావేత్తలకి యీ శాస్త్రీయదృష్టి అలవడడానికి ప్రధానమైన కారణాలు రెండు చెప్పవచ్చు. అందులో మొదటిది. ఈ కాలంలోనే పాశ్చాత్యులకి మన సంస్కృత వాఙ్మయంతోటీ, సంస్కృత వ్యాకరణ గ్రంథాలతోటీ పరిచయం ఏర్పడింది. ఈ సంస్కృత భాషా పరిచయం వారికి రెండు విధాలుగా ఉపకరించింది. సంస్కృత భాషలోని పదాలు, పద నిర్మాణం యూరపియన్ భాషలైన లాటిన్, గ్రీకు, జర్మన్, ఇంగ్లీషు మొదలైన భాషల్లోని పదాలు, పద నిర్మాణంతో చాలవరకు పోలి ఉండడం వారిని ఆశ్చర్య చకితుల్ని చేసింది. సంస్కృత భాషని గురించి వారికి తెలియక ముందుకూడా పైన పేర్కొన్న యూరపియన్ భాషలలోని సమానత్వం కొందరు గుర్తించలేక పోలేదు. కాని యీ భాషలన్నీ యించుమించు ఒక ప్రాంతంలోనే ఉన్నవి అవడంవల్ల అటువంటి సామ్యాలు ఒక భాషనుంచి మరొక భాషలోకి ఎరువు తెచ్చుకొన్నవవో, లేక ఒక భాషనుంచి మిగిలిన భాషలు పుట్టడంవల్ల కలిగినవవో అనుకొని వాటిపై శ్రద్ధ చూపలేదు. కాని చాలా దూరంలోఉండి పాశ్చాత్య దేశాలతో ఎట్టి సంబంధంలేని హిందూ దేశంలోని భాషకూ యూరపియన్ భాషలకూ అతిసన్నిహిత సంబంధం గోచరిస్తూ ఉంటే యీ సంబంధంకూడా ఎరువు తెమ్ముకోవడంవల్లనే వచ్చిందని చెప్పడానికి వారికి సాధ్యపడలేదు. ఇక యీ సంబంధానికి మూలమైన కారణం సంస్కృతమూ, ఆ యూరపియన్ భాషలూ పుట్టకలోనే ఒకే మూల భాషనుంచి జన్మించడం అని ఊహించడానికి వారికి ఆట్టేకాలం పట్టలేదు. ఈ అభిప్రాయాన్ని మొదట వెలిబుచ్చిన వారిలో ఫ్రెంచి జెసూట్ మిషనరీ కోరో (Coeurdoux), బెంగాల్ ప్రధాన న్యాయమూర్తి సర్ విలియమ్ జోన్స్–వీరిద్దరూ ముఖ్యులు. కోరో 1767 లోనే సంస్కృత పదాలకీ, లాటిన్ పదాలకీగల సంబంధాన్ని గుర్తించడమే కాకుండా, సంస్కృతంలోని అస్ ధాతువు క్రియా రూపాన్ని లాటిన్ రూపాలతో పోల్చారు. కాని యీయన గ్రంథం నలభై ఏళ్లవరకూ అచ్చుకాకపోవడంవల్ల యీ విషయం అప్పుడెవరికీ తెలియలేదు. సర్ విలియం జోన్స్ ఎనిమిదిన్నర ఏళ్ళ సంస్కృత భాష పఠించి ఏషియాటిక్ సొసైటీ మూడవ వార్షికోత్సవ సభలో (ఫిబ్రవరి 2, 1786) యీ క్రింది విధంగా చెప్పారు.

'సంస్కృతభాష, దాని ప్రాచీన చరిత్ర ఏమయినా, ఆశ్చర్యకరమైన నిర్మాణం కలది. అది గ్రీకుకన్నా పరిపూర్ణమైనది; లాటిన్‌కన్నా విస్తారమైనది; యీ రెంటికన్నాకూడా స్వచ్ఛమైనది. అయినా యీ రెండింటికీ ధాతువుల్లోనూ, వ్యాకరణ రూపాల్లోనూ యాదృచ్ఛికమని చెప్పడానికి వీలులేని సన్నిహితత్వం కలది. ఈ సన్నిహితత్వం ఏ భాషావేత్త యీ మూడిటినీ ఎప్పుడో ఉన్న ఒక మూల భాషనించి జన్మించినవని నమ్మకుండా పరిశీలించలేనంత దృఢమైనది. గాథిక్, కెల్టిక్ భాషలుకూడా, వీటి నిర్మాణం చాలా భిన్నమైనదయినా, సంస్కృతభాషతో బాటు ఒకే మూల భాషనించి జన్మించాయని చెప్పడానికికూడా కొన్ని ఆధారాలు ఉన్నాయి. ప్రాచీన పర్షియన్ భాషనికూడా యీ భాషా కుటుంబంలోనే చేర్చవచ్చు.' సర్ విలియమ్ జోన్స్‌కు ముందు కొందరు పండితులు ఈ భాషలలోని సామ్యాలు గుర్తించినా, వారిలో ఎవ్వరూ యీయనలా 'యీ సామ్యాలన్నిటికీ కారణం – యీ భాషలన్నీ ఇప్పుడేమి చారిత్రకాధారాలులేని ఒక మూల భాషనించి జన్మించడం' అని నిర్ణయించలేదు. అందుచేతే సర్ విలియం జోన్స్ చెప్పిన యీ వాక్యాలే ఆధునిక భాషా శాస్త్రానికి నాంది అని చాలామంది పండితుల అభిప్రాయం.

పాశ్చాత్య పండితుల్ని సంస్కృతభాషే కాకుండా, సంస్కృత భాషలోని వ్యాకరణాలుకూడా ఆకర్షించాయి. ఈ వ్యాకరణాల్లో అతి ప్రధానమైనది పాణిని మహర్షి అష్టాధ్యాయి. దీనిలో సుమారు నాలుగువేల చిన్నచిన్న సూత్రాలలో పాణిని మహర్షి సంస్కృత భాష నిర్మాణాన్నంతటినీ క్షుణ్ణంగా వర్ణించారు. ప్రతిసంస్కృతపదంలోగల ధాతువు (లేక ప్రాతిపదిక), ప్రత్యయాలు, వీటి సమ్మేళనం వలన వీటి వర్ణాలలో సంభవించే మార్పులు (సంధి), అలా మార్పులువచ్చే సందర్భాలు, వివిధ ప్రత్యయాలు సూచించే అర్థాలు, అర్థభేదాలు, అచ్చులలో ఉదాత్తానుదాత్తస్వరిత లక్షణాలు మొదలైనవన్నీ అసందిగ్ధమైన పద్ధతిలో ఇందులో వర్ణించబడ్డాయి. సాధారణ సూత్రాలకు లొంగని ప్రత్యేక పదాలు, సమాసాలుకూడా ఇందులోని పాత సూత్రాలలో సూచించబడ్డాయి. ఇందువల్లనే అష్టాధ్యాయి పాణిని మహర్షి కాలంనాటి సంస్కృత భాషకి సమగ్ర వ్యాకరణం అని చెప్పబడుతోంది. గ్రీకు భాషకీ, లాటిన్‌భాషకీకూడా ప్రాచీన వ్యాకరణాలున్నా వాటిలో ధాతుప్రత్యయవిభాగంలేక ఒక పదానికిచెందే భిన్న రూపాలన్నీ ఒక చోట కూర్చడమే వ్యాకరణ రచనగా సాగింది. ఒక శబ్దంలో ధాతువు, ప్రత్యయం అని రెండు (లేక అంతకన్న ఎక్కువ) అర్థవంతమైన భాగాలు (morphs) ఉండడానికి వీలుంది అనే విషయమే ఆ వ్యాకరణ కర్తలకి గోచరించ లేదు. ఇట్టి వ్యాకరణాల ప్రభావానికి లోనైన పాశ్చాత్య పండితుల్ని అష్టాధ్యాయిలోని శాస్త్రీయమైన పదనిర్మాణచర్చ అమితంగా ఆకర్షించింది. వారిలో కొందరు అష్టాధ్యాయిలోని వ్యాకరణ పద్ధతుల్ని అనుసరించి యూరపియన్ భాషలలోని పదాల్నికూడా ధాతుప్రత్యయాలుగా విభజించి ఆ భాషల నిర్మాణాన్ని సమగ్రంగా అవగాహన చేసుకున్నారు. అష్టాధ్యాయిలో అవలంబించిన విధానాలు కొన్ని ఆధునిక భాషాశాస్త్రంలో విధానాలకి మూలం. ఉదాహరణకి అష్టాధ్యాయిలోని 'లోపం' అనే విధానమే ఆధునిక భాషా శాస్త్రంలో 'Zero morph' అనే దానికి మూలం. అమెరికన్ భాషా శాస్త్రవేత్తలలో అగ్రగణుడైన బ్లూమ్‌ఫీల్డ్ అష్టాధ్యాయిని 'మానవమేధకి మహత్తరమైన శాశ్వత చిహ్నం' అని అభివర్ణించడమే కాకుండా ఆయన అమెరికన్ భాషలకు రచించిన వ్యాకరణాలలోకూడా పాణినీయ పద్ధతుల్ని అవలంబించారు. భాషాశాస్త్రం వృద్ధిచెందిన యీనాడుకూడా భాషాశాస్త్రవేత్తలు పాణినీయంలో పద్ధతుల్ని ఇంకా క్షుణ్ణంగా పరిశీలించి అనుసరించాలని ప్రయత్నిస్తున్నారంటే అష్టాధ్యాయి గొప్పతనాన్ని గురించి వేరే చెప్పక్కర లేదు. ఇంతే కాకుండా మన శిక్షాప్రాతిశాఖ్యలలోని ధ్వనుల ఉత్పత్తి, వాటి స్థాన ప్రయత్న భేదాలని గురించిన వివరణలే యీ కాలం ధ్వనిశాస్త్రానికి (Phonetics) ప్రాతిపదికలు. మన ప్రాచీనులుతప్ప ధ్వనుల ఉత్పత్తిని గురించి వేరెవ్వరూ ఏ కాలంలోనూ, ఏ దేశంలోనూ చర్చించనే లేదు.

పద్ధెనిమిదో శతాబ్దంలో భాషాశాస్త్రవేత్తలకి సరియైన శాస్త్రీయదృష్టి అలవడడానికి రెండవ కారణం: ఈ కాలానికి కొంచెం ముందునించి పండితులు ప్రపంచంలో మాట్లాడే వివిధ భాషలపై దృష్టి కేంద్రీకరించి వాటిపై వ్యాకరణాలు, నిఘంటువులు రచించడం ప్రారంభించారు. ప్రాచీనులైన గ్రీకులు, రోమనులు గ్రీకు లాటిన్ భాషలు రెండింటిపైనే పరిశోధనలు సాగించారుకాని మరి ఏ ఇతర భాషనీ పరిశీలించ లేదు. వారిలోకూడా ఇతర భాషలు మాట్లాడడం నేర్చిన వారున్నా వారెవ్వరికీ ఆ భాషలకి కూడా వ్యాకరణాలు నిఘంటువులు రచించాలనే అభిప్రాయం కలగలేదు. ఓవిడ్ కవి రోమునించి ఇప్పుడు కోన్స్తంజా అనే పట్టణం ఉన్న చోటికి పంపివేయబడినప్పుడు, ఆయన అక్కడఉన్న గెతే అనే జాతివారి భాష నేర్చుకుని, ఆ భాషలో అగస్తస్ చక్రవర్తిని పొగుడుతూ ఒక కావ్యం వ్రాసినట్టు ఆధారాలున్నాయి. కాని ఓవిడ్ కవికాని, ఆయన సమకాలికులుకాని ఎవ్వరూ ఆ భాషని గురించి పరిశోధించడానికి పూనుకోలేదు. ఆ భాషని గురించి వారెవ్వరైనా వ్యాకరణం రచించిఉంటే ఇప్పుడు మనకా భాష చరిత్ర తెలుసుకుందుకు అది చాలా ఉపయోగించి ఉండేది. గ్రీసు వ్యాకరణకర్తలు వారి భాషేతప్ప మరొక భాషని

పరిశీలించక పోవడం, వారు వ్యాకరణ రచనా పద్ధతుల లోను, వ్యుత్పత్తి శాస్త్రంలోను తప్పటడుగులు వేయడానికి కొంతవరకు కారణమని యింతకుముందే చెప్పాము. మధ్యయుగంలో క్రైస్తవమతం వ్యాప్తిలోకి వచ్చిన తరవాత యూరప్‌లోని మాతృభాషలకి ప్రాధాన్యం పెరుగుతూ వచ్చింది. క్రీస్తు ఆదేశానుసారం క్రైస్తవ పండితులంతా తమ మత గ్రంథాల్ని వివిధ భాషల్లోకి అనువదించడం తమ ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్నారు. ఇందువల్లనే మనకిప్పుడు కొన్ని భాషలలో అతి ప్రాచీన గ్రంథాలు లభిస్తున్నాయి. బైబిలు ఆర్మేనియన్‌లోకి ఐదో శతాబ్దంలోను, గాథిక్‌లోకి నాలుగో శతాబ్దంలోను, ప్రాచీనమైన చర్చిస్లావోనిక్‌లోకి తొమ్మిదో శతాబ్దంలోను, అనువదించబడడంవల్ల అప్పటి ఆయా భాషలని గురించి మనం తెలుసుకోడానికి ఆయా అనువాదాలు ఆధారంగా ఉంటున్నాయి. ఇంతేకాకుండా లాటిన్ మాటలనీ, వాక్యాలనీ మతప్రబోధకులు అనువదించడానికి వీలుగా కొన్ని భాషలలో నిఘంటువులు కూడా ఆయా కాలంలో కూర్చబడి మనకు లభిస్తున్నాయి. జర్మన్‌వంటి కొన్ని భాషలకి మనకి లభించే అతిప్రాచీనాధారాలు ఇటువంటివే.

ఈ కాలంలో యూరప్‌లో అన్నిదేశాల్లోనూ లాటిన్ భాష అధికారభాషగానూ, మతప్రాముఖ్యంగల భాషగానూ, పండితుల భాషగానూ ప్రముఖ స్థానం వహించి ఉండేది. ఎవరైనా పండితుడుగా గుర్తించబడాలంటే లాటిన్ విధిగా నేర్చుకొని తీరవలసిందిగా ఉండేది. అందువల్లనే పాఠశాలల్లో లాటిన్ భాషా వశానికే కాలాన్నంతా వినియోగించేవారు. లాటిన్ భాషని దోషరహితంగా వ్రాయగల్గడం మాట్లాడగల్గడమే పాండిత్యమని ఆ కాలంవారు నమ్మేవారు. కాబట్టి ఆయా లాటిన్ భాషని నేర్పడానికి వ్యాకరణాలు ఆ కాలంలో అనేకం వెలువడ్డాయి. ఈ వ్యాకరణాల లక్ష్యం — 'ఇలా వ్రాయాలి; అలా వ్రాయకూడదు; ఇలా మాట్లాడాలి అలా మాట్లాడకూడదు.' అని చెప్పడమే కాబట్టి యివి 'ఆయా భాష యిలా ఉంద'ని చెప్పే వర్ణనాత్మక వ్యాకరణాలు కాక 'ఆయా భాష యిలా ఉండా'లని చెప్పే నిర్ణయాత్మక వ్యాకరణాలు అయ్యాయి. వీటి ప్రభావానికి లోనైన ఆ కాలం వారంతా వ్యాకరణం ప్రధాన లక్షణం 'భాషలో ఏది తప్పో ఏది ఒప్పో నిర్ణయించడమే' అనే భ్రమకి లోనయ్యారు. ఆ కాలంలో వారిపై ఆయా లాటిన్ భాషా వ్యాకరణాల ప్రభావం ఎంతటిదో చెప్పడానికి వారు ఇంగ్లీషు, డేనిష్ మొదలైన భాషలకి వ్రాసిన వ్యాకరణాలే సాక్ష్యం. ఈ భాషలలో లాటిన్‌లోవలె విభక్తి ప్రత్యయాలు, క్రియలలో పురుష వచన ప్రత్యయాలు లేకపోయినా అవి ఉన్నట్లే ఆయా వ్యాకరణాలలో ఒక నామానికి అన్ని విభక్తులు, ఒక క్రియకి అన్ని పురుష వచన ప్రత్యయాలు మొదలైనవి చూపేవారు. లాటిన్ భాషలోని ప్రత్యేకతలు వీటిలో నిజంగా లేకపోయినా ఉన్నట్లు చూపేవారు; ఆయా భాషలలో ఉన్న ప్రత్యేకతలు లాటిన్ భాషలో లేనట్లయితే వాటిని గురించి అట్టే పట్టించుకునే వారు కాదు.

ఇంక పదహారో శతాబ్దంలో అచ్చు యంత్రం వ్యాప్తిలోకి రావడంవల్లా, అదే కాలంలో అమెరికా, ఆఫ్రికా మొదలైన ఖండాలని గురించి తెలియడంవల్లా పండితులు వివిధ ప్రపంచ భాషలకి వ్యాకరణాలూ, నిఘంటువులూ రచించి ప్రచురించడం ప్రారంభించారు. ఈ కాలంలో వ్యాకరణ రచనా పద్ధతుల్లో మార్పేమీ లేకుండా అవి పాత పద్ధతిలోనే ఉన్నా ఆయా గ్రంథాల్లో ఆ భాషల్ని గురించి వారు వ్రాసిన విషయాలు మనకి అమూల్యమైనవి. ఈ కాలంలోనే బస్‌బెక్ (Busbecq) అనే ఆయన క్రిమియాదేశం (రష్యాలో ఒక దేశం)లో మాట్లాడే గాథిక్ భాషలోని పదాలు (1560–62 లో) సేకరించి ప్రచురించారు; ఆయా భాష తరవాత అంతరించడంవల్ల యిదే మనకి ఆయా భాషలో చివరి ఆధారం. ఈ కాలంలో అప్పటికి తెలిసిన భాషల్ని గురించి తెలిపే గ్రంథాల్లో ముఖ్యమైనవి: సి. గెస్నర్ వ్రాసిన మిత్రిడేట్స్ (Mithridates, 1555), మెగిసర్ 1592 లో నలభై భాషల్ని గురించి వ్రాసిన గ్రంథం, Specimens of Forty Languages; పి. ఎస్. పల్లాస్ వ్రాసిన ప్రపంచ భాషల తుల

నాత్మక నిఘంటువు (1786-89); హెర్వాస్ ఎనిమిది వందల భాషల్ని గురించి వ్రాసిన గ్రంథం (1800-5); అడెలుంగ్ వ్రాసిన గ్రంథం (1806-17). వీటిలో చివరి గ్రంథంలో బైబిల్‌లోని భగవత్ ప్రార్థన సుమారు అయిదువందల భాషలలో ఉంది. వీటిలో కొన్ని లోపాలున్నా, యీ గ్రంథాలు ఆ కాలంలో భాషాశాస్త్ర పరిశోధనలో అభివృద్ధికుపకరించి పందొమ్మిదో శతాబ్దంలో భాషాశాస్త్రం జన్మించడానికి హేతుభూతాలయ్యాయి. ఈ గ్రంథాలు రచించిన వారిలో ఒకరైన హెర్వాస్ 'భాషల జన్మసంబంధాన్ని నిర్ణయించడానికి వ్యాకరణ నిర్మాణంలోని సామ్యమేకాని పదాలలో సామ్యం ఆధారం కాదు' అని గుర్తించిన వారిలో ప్రథములు అనే విషయం గమనించ తగ్గది.

ఈ కాలంలో అనేక ప్రపంచభాషల్ని గురించి ఇన్ని గ్రంథాలు వెలువడినా, భాష స్వభావం, వివిధ భాషల పరస్పర సంబంధం – వీటిపై పండితులకింకా సరియైన అభిప్రాయాలు ఏర్పడలేదు. పోర్ట్ రాయల్‌గ్రామర్ (1660) అనే గ్రంథంలో ఒక భాషలో ఎందుకు ఒక విధంగా మాట్లాడతారు? ఒక భాషలో ఒక పదం ఒక అర్థాన్ని ఎందుకు సూచిస్తుంది? అనే వాటికి 'కారణాలు' అన్వేషించబడ్డాయి. ఈ కాలంలోకూడా హిబ్రూయే అన్ని భాషలకీ మూలమనే అభిప్రాయంకూడా కొందరిలో నిలిచి ఉంది. స్కాట్లండ్‌లో నాలుగో జేమ్స్ (1488-1513) మనుష్యులు మొదట మాట్లాడిన భాష ఏదో తెలుసుకుందుకు ఇద్దరు పిల్లల్ని పుట్టగానే ఎవరితో సంబంధం లేకుండా వేరుచేసి ఉంచాడు. ఆ పిల్లలు కొంత కాలానికి ఉచ్చరించే ధ్వనులు హిబ్రూ భాషలా ఉన్నాయని హిబ్రూ భాషే మూలభాష అని నిర్ణయించి సంతోషపడ్డాడు. (ఇది క్రీ. పూ. ఐదో శతాబ్దానికి చెందిన హెరొడోటస్ అనే గ్రీకు చరిత్రకారుడు చెప్పిన కథలా ఉంది. ఆ కథ: ఒక ఈజిప్టు రాజు ఇద్దరు పిల్లల్ని వేరుగా ఉంచాడు. ఆ పిల్లలు రెండేళ్లు వచ్చిన తరవాత 'బెకోస్' అని ఏడ్చారు. వాళ్లు ఉచ్చరించిన ఆ మొదటి మాటకి ఫ్రిజియన్ భాషలో 'రొట్టె' అని అర్థం కాబట్టి ఫ్రిజియన్ భాషే అతి ప్రాచీనమైన భాష అని ఆయన నిర్ణయించాడు). ఎ. గి. షెర్డ్ అనే ఆయన 1606లో హిబ్రూ, ఖాల్డిక్, సిరియక్, గ్రీక్, లాటిన్, ఫ్రెంచి, ఇటాలియన్, స్పానిష్, జర్మన్, ఫ్లెమిష్, ఇంగ్లీషు భాషలకి వ్యుత్పత్తి నిఘంటువు వ్రాసి అందులో పదాలలోని కొన్ని అక్షరాలు కలపడంవల్లా, తీసివేయడంవల్లా, ఒకదానికొకటి మార్చడంవల్లా మిగిలిన భాషలన్నీ హిబ్రూనుంచి పుట్టినవే అని సిద్ధాంతం చేశాడు! కొందరు స్వదేశాభిమానులైన పండితులు తమ తమ భాషలే మూలభాషలని నిర్ణయించారు. గోరోపియస్ బెకనస్ అనే హాలండ్ దేశస్థుడు (1518-72) డచ్చి భాషే మూలభాష అని నిర్ణయిస్తే ఆంద్రియాస్ కెమ్‌కే అనే స్వీడన్ దేశస్థుడు ఆదామ్, ఈవా మొదట నివసించిన ఈడెన్ ఉద్యానంలో భగవంతుడు స్వీడిష్‌లోనూ, ఆదామ్ డేనిష్‌లోనూ, సర్పం ఫ్రెంచిలోనూ మాట్లాడేవారని నిరూపించడానికి ప్రయత్నించాడు.

ఈ విధంగా ఆ కాలంలో పండితులు భాష నిజస్వరూప స్వభావాలు తెలుసుకోలేక మనం ఎప్పటికీ నిర్ణయించలేని అనావశ్యకాలైన విషయాలపై వృథా వాదోపవాదాలు సాగించి విమర్శకు ఆగలేని సిద్ధాంతాలు ప్రతిపాదించినా, వారిలో కొందరు మేధావులు మాత్రం తమ బుద్ధిబలంవల్ల భాషల పుట్టుక విషయంలోనూ భాషల పరస్పర సంబంధాల విషయంలోను కొన్ని సత్యాలను గ్రహించి పందొమ్మిదో శతాబ్దంలో ఆధునిక భాషాశాస్త్రజననానికి మార్గదర్శకులయ్యారు. వారిలో గోత్‌ఫ్రెడ్ విల్‌హెల్మ్ ఫాన్ లెబ్నిజ్, జొహాన్ గోత్‌ఫ్రెడ్ ఫాన్ హెర్డర్, సర్ విలియంజోన్స్—వీరు ముగ్గురూ ముఖ్యులు.

లెబ్నిజ్ (1646-1716) ప్రధానంగా వేదాంతశాస్త్రంలోనూ, గణితశాస్త్రంలోనూ ప్రవీణుడైనా ఆయన భాషలవిషయంలో కూడా ఆసక్తి చూపారు. ఈయన అన్నిభాషలకీ హిబ్రూ మూలమనే సిద్ధాంతాన్ని తీవ్రంగా వ్యతిరేకించి, ఆ కాలంలోఉన్న భాషల్ని క్షుణ్ణంగా పరిశీలించి భాషల పరస్పర సంబంధాల్ని నిర్ణయించమని తన సమకాలికులని ఉద్బోధించారు. తానే స్వయంగా యీ విషయంలో

కొంత పరిశ్రమించి యూరప్, ఆసియా, ఈజిప్టులలో మాట్లాడే భాషలన్నీ ఒకే మూలభాషనించి జన్మించాయని వ్రాశాడు. ఈ భాషలన్నీ ఏడెనిమిది విభిన్న కుటుంబాలకి చెందుతాయి కనక మనం ఆయన ఈ అభిప్రాయంతో ఏకీభవించక పోయినా, ఈ భాషల పరస్పర సంబంధాల్ని మొదట గుర్తించిన వారిలో ఒయాయన ఒకడని మనం గమనించాలి. పర్షియన్ భాష జెర్మానిక్ కుటుంబానికి సంబంధించినదనే వాదాన్నికూడా ఈయన ఖండించారు (ఈ వాదాన్ని మొదట ప్రతిపాదించినవారు బొనవెంతురా వుల్కానియస్ (1597 లో). ఈయన తన కాలంలో భాషల్ని పరిశోధించి వ్యాకరణాలు, నిఘంటువులు రచించడానికికూడా ప్రోత్సాహమిచ్చారు. ఈయనే రష్యా జారినా రెండో కేథరైన్‌చేత పి. ఎస్. పల్లాస్ గ్రంథాన్ని (పైన చూడండి) ప్రచురించేటట్టు చేశారు. ఆ నాటి రష్యా చక్రవర్తిని తమసామ్రాజ్యం లోని భాషలన్నిటికీ వ్యాకరణాలూ, నిఘంటువులూ తయారుచేయించడానికి ఉద్బోధించారు. లాటిన్ భాషని కాక దేశీయభాషలైన జర్మన్ మొదలైనవాటిని విద్యాబోధనలోనూ, పారస్వత రచనలోనూ ఉపయోగించి వాటిని వృద్ధిచెయ్యాలని మొదట వాదించినవారిలో ఈయన ఒకరు. ఈయన కొన్ని వ్యాసాలు ఆనాటి విద్వాంసులభాషలైన లాటిన్, ఫ్రెంచిలలోకాక తన మాతృభాష అయిన జర్మన్‌లో రచించి ఆ భాష వృద్ధికి తోడ్పడ్డారు.

హెర్డర్ (1744–1803) భాషాశాస్త్రంలో ఏమీ పరిశోధన చెయ్యకపోయినా, ఆయన కాలంలో పండితులకిఉండే కొన్ని అభిప్రాయాల్ని తప్పులని ఎత్తిచూపి, తరవాత కాలంలో భాషాశాస్త్రం వృద్ధిచెందడానికి దోహదంచేశారు. ఈయన 1772 లో ప్రచురించిన భాషలపుట్టుకని గురించిన వ్యాసంలో 'భాష దేవుడు సృష్టించి మానవులకి ప్రసాదించాడు' అనే ప్రాచీనుల అభిప్రాయాన్ని ఖండించేరు. భాష భగవంతుడు సృష్టించినదయితే అది అపవాదరహితంగానూ, కార్యకారణబద్ధంగానూ ఉంటుంది కాని మన భాషలలా అపవాదసూత్రాలతోనూ, సృష్టిలోని పరిస్థితికి అసంబద్ధంగానూ ఉండదని ఒయాయన వాదించారు. భాష ఒక మానవుడు, సృష్టించినదికాని, లేక కొందరు మానవులు నిర్ణయించినది కూడా కాదని ఒయాయన ప్రతిపాదించారు. ఈయన అభిప్రాయంలో భాష పుట్టడం గర్భంలో ఎదిగినపిల్ల బయటికి రావడంవంటిదే. అంటే మానవుడికి పుట్టడం ఎదగడం, పళ్లురావడం, నడవడం వంటివి ఎలా సహజమైనవో అలాగే మాట్లాడడంకూడా సహజమైనదే. ఈ సహజసిద్ధమైన గుణం ఉండడంవల్లనే మానవులో భాష ఉద్భవించింది అని ఒయాయన ప్రతిపాదించాడు.

వీరిద్దరి అభిప్రాయాలవలెకాక సర్ విలియమ్స్ జోన్స్ (1746–94) అభిప్రాయాలు ఇండో యూరపియన్ భాషా కుటుంబంలో భాషల పరస్పర సంబంధాన్ని శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించి, సుస్పష్టంగా చెప్పడంవల్ల ఇవి ఆధునిక భాషాశాస్త్రానికి మూలబీజం అయ్యాయి. సర్ విలియం జోన్స్ చెప్పిన వాక్యాలు ఇంతకుముందే చూశాము.

వీరేకాక పద్దెనిమిదో శతాబ్దంలో మరికొందరు పండితులు ఇతర భాషా కుటుంబాలపై పరిశోధనలు సాగించారు. జోబ్ లుదోల్ఫ్ సెమిటిక్ భాషలలోని సామ్యాల్ని 1702 లో పరిశోధించారు. లూద్ (Lhuyd) 1707 లో కెల్టిక్ భాషల్ని పరిశోధించారు. ఇహ్రే 1769 లో స్వీడిష్ భాష వ్యుత్పత్తి నిఘంటువుని ప్రచురించారు. గ్యార్మతి 1799 లో హంగేరియన్, ఫిన్నిష్ భాషలలో వ్యాకరణ నిర్మాణ సామ్యాల్ని పరిశీలించి, వాటి పరస్పర సంబంధాన్ని ప్రతిపాదించారు.

పందొమ్మిదో శతాబ్దానికి ముందటి కాలంలో పండితులు తమ కాలంలోని భాషల్ని పరిశోధించడం వల్ల, తమ కాలంలో నెలకొనిఉన్న భాషా విషయక దురభిప్రాయాలని తొలగించడంవల్ల, ఆ శతాబ్దంలో ఆధునిక భాషా శాస్త్రాభివృద్ధికి ఎలా దోహదం చేశారో చూశాము.

# శతఘంటావధాన

# "మరింగంటి సింగరాచార్యులు-కృతులు"

శ్రీ రంగాచార్య

'పరవందారుజనావళీ హృదయ
సద్వంచార్థకృద్వేంకటే
శ్వర కారుణ్య కృపా సుధా మిళిత
వీక్షా మాధురీ మార్గ వి-
స్ఫురితైకైక దిన ప్రబంధ రచనా
స్ఫూర్జ ద్వచ శ్శ్రీకుండన్
నరనాగాశ్వనృపాలసభ్యగణితుండన్
సింగరాచార్యుడన్'
(దశరథ రాజనందన చరిత్ర)

అని చెప్పికొన్నకవి – 'శతఘంటావధాన' 'శారదా ప్రశ్న వివరణ' 'కవిసార్వభౌమ' ఇత్యాది బిరుదముల మరింగంటి సింగరాచార్యులు. ఈయన కుతుబ్షాహీల కాలమున–అనగా– మల్కిభరాముని సమకాలీనుడు. (1550-1581 క్రీ. శ.) దీని వలన కవి 16 శతాబ్దము ఉత్తర భాగమున నుండెనని సుస్పష్టమగుచున్నది.

ఈ కవి బహువిధ గ్రంథ నిర్మాత–నేటివరకు మనకు తెలిసిన మరింగంటి కవులలో ఆద్యుడు– ఈ సింగరాచార్యులు.

ఈయన శ్రీవైష్ణవుడు. వశిష్ఠగోత్రుడు. తిరుమలదేశిక పౌత్రుడు. తిరువేంగళాచార్య పుత్రుడు. నల్లగొండజిల్లాయందలి దేవరకొండ తాలూకాలోని 'కనగల్లు' అను గ్రామము ఈతని జన్మస్థానము. ఇచటనుండి కొంతకాలము తరువాత వీరిలో కొందరు హుజూర్‌నగర్ తాలూకాయందలి 'యాదవాకిళ్ల'ను గ్రామమును చేరినట్లు తెలియుచున్నది.[1] నేటికిని ఈ కవి వంశీకులు 'కనగల్లు'నందును, మిర్యాలగూడెం తాలూకాయందలి–'అనుముల' అను గ్రామమునందును, 'యాదవాకిళ్ల'యందును గలరు.

ఈ సింగరాచార్యులు 'నరనాగాశ్వనృపాల సభ్యగణితుడ'నని చెప్పుకొనినను– తన కృతులను నరాంకితము చేయలేదు. (అందుకే కాబోలు మిక్కిలి ప్రచారము నందలేదు). తన యిష్టదైవమునకే అన్నింటిని సమర్పించెను. కవి తన కృత్యాద్యంతముల యందును –' వేంకటేశ్వర లక్ష్మీ నృసింహ వర ప్రసాద లబ్ధ–' అనియే చెప్పుకొనెను, 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము'న తన వంశావతార వర్ణనలో–చెన్నయాచార్యుడను నతనిగూర్చి యీ విధముగా వ్రాసినాడు.

రాజపుత్రికిఁ బూను రాక్షసుఁబోఁ ద్రోలి
    పెనుబాము ముక్తికిఁ బెట్టినంపె
నవని బంధమ్మంద్ర యన్నలతోఁబుట్టి
    హరిలీలఁ బావనుఁడగుచు మించె
మనవాళయోగికి మళియుద్ధిమ్మైయుండె
    వనదంతిచేతఁ బూజనము లందె
శాస్త్రోక్తి నరటర చక్రవర్తులగెల్చి
    బిరుదొన్నబెబ్బులిఁ బొఁ ఆనడచె
తగ నవ్వనంతాళువారన దనరునట్టి
యురగపలి సంతతిని దల్లికుద్భవించె
విమల గుణవర్తి ప్రత్యక్ష విష్ణుమూర్తి
చారుతర హోళి చెన్నయాచార్యసాళి.

---

1. చూ. 'గోదావధూటీ పరిణయము'– మరింగంటి వేంకట నరసింహాచార్యులు (300 సం. క్రిందివాడు) ప్రథమాశ్వాసము –కృత్యాది పద్యములు. ఈ గ్రంథమును 1956 సం. న నల్లగొండ మహిళాభక్త సమాజమువారు ప్రచురించిరి. సంపాదకులు. శ్రీ అమూరి మరిగంటి శ్రీ రంగాచార్యులవారు.

సిరుల దేవరకొండకు చేర్వ పణక
రాజపల్లియు, గట్టుపై రాజిలెన్న
శ్రీ మరింగంటి చెన్నదేశిక శశాంకుఁ
డహహ! మరింగంటి చెన్నరాయఁడన వెలసె.

అని - ఇత్యాదిగా తెల్పెను. ఇందు పేర్కొనబడిన చెన్నయాచార్యవర్యుడు అమానుష శక్తిగలవాడై - సర్ప స్వరూపముతో మాతృగర్భమున జనించెను. దేవరకొండ సమీపమునగల 'పణకరాజుపల్లి' గుట్టపై నివాసము. నేటికిని మరింగంటివారు సర్పమును గౌరవించుటయేగాక పూజలు సల్పుట కితని జన్మయే కారణము. ప్రజలా ప్రాంతమున నేటికిని చెన్నయ్యగారి పుట్టయని ఆ గుట్టపై పూజలు సల్పుదురు. ఇతనినిగూర్చి నేటికిని ఆ ప్రాంతమున కథలు చెప్పుదురు.

ఈ చెన్నరాయనికి భట్టరు, భట్టరునకు తిరుమల దేశికుడు, ఈతనికి తిరువేంగళాచార్యులు - ఈ తిరువేంగళాచార్యులకు ఈ సింగరాచార్యులు. (ఇంకను కొందరు గలరు). 'ముగురురాజులచేత మొక్కులు గొన్నట్టి భగవత్సమానుఁ డప్పల గురుండు' సింగరాచార్యుల యగ్రజుడు. పొన్నికంటి తెలగన్న 'యయాతి చరిత్ర' లో పేర్కొనినది ఈ అప్పలాచార్యులనే. సింగరాచార్యులవారి 'దశరథ రాజ నందన చరిత్ర' అను నిరోష్ఠ్య రామాయణము[2] నందు తన వంశావతారవర్ణన పూర్తిగా నొసంగియున్నాడు. అదియంత వివరించిన ఇంకను వ్యాసము విస్తృతమగును-కావున చెన్నయాచార్యుల గూర్చిన పద్య ముదాహరించుచున్నాను,

'చెన్నుగ బ్రహ్మరాజపురి చెన్నుఁడు
తా నిలవేల్పుగాగ నా
చెన్నుని పేరుబూని సిరిజెందుచు
దేవరకొండ సీమలో
సన్నుత పణ్కరాజపలి శైలమునన్
మరిగంటి చెన్నుఁడై
యెన్నిక మించె భూజనము
లింటను దొడ్డను మందపేరిడన్'

(దశరథ, -1-21)

కవి తన గ్రంథముల నంకిత మొసంగినది, ఈ పణ్కరాజపల్లి నృసింహస్వామికే. (దీనినే కర్పూరాచలముగా పేర్కొనెను). మరియు 'శిరిశనగండ్ల' స్వామికిని అంకితములుగా నిచ్చెను. ఈ శిరిసనగండ్ల పూర్వము దేవరకొండ తాలూకాలో నుండెడిది. ఇటీవల మహబూబునగర్ జిల్లా కల్వకుర్తి తాలూకాలో చేరినది. ఇది (శిరిశనగండ్ల) కవి వాసగ్రామమైన కనగల్లుకు కొద్దిమైళ్ల దూరములో నున్నది. గోవర్ధనం వెంకట నరసింహాచార్యులను కవి[3] ఈ 'శిరిశనగండ్ల' పర్వతమునే ప్రతాపాద్రిగా చెప్పెను, ఇచటి క్షేత్రమును గూర్చి 'ప్రతాపగిరి మాహాత్మ్యము' అను 4 ఆశ్వాసముల ప్రబంధమును వ్రాసెను - అముద్రితము,

నేటివరకు మరింగంటి కవులనుగూర్చి విపులమైన పరిశ్రమ జరుగలేదు. అట్లు జరిగిన ఎన్నియో అమూల్య విషయములు వెల్లడియగును. ప్రస్తుత సాహిత్య చరిత్రలయందు ఈ కవినిగూర్చి ఎవ్వరును విపులముగా గ్రంథాధారములతో వివరించక పోవుటచే విస్తర భీతికి భీతిల్లక విస్తృతముగా వ్రాయుచున్నాను.

వాల్మీకికి పూర్వము ఛందోబద్ధ శ్లోకములు శ్రుతిలో వినవచ్చుచున్నను - సంస్కృతమున అతడు ఆదికవి. నన్నయకు పూర్వము తెనుగు పద్యము లున్నను - ఆంధ్ర సాహిత్యమున ఆదికవి నన్నయ. పింగళి సూరనకు పూర్వము ద్వ్యర్థికావ్యరచన సాగినను (వేములవాడ భీమన - రాఘవపాండవీయము) సూరనయే అందు కాద్యుడైనట్లు తెనుగు సారస్వతమున నిరోష్ఠ్యకావ్యరచన కాద్యుడు మరింగంటి సింగరాచార్యులు. ఇంతేకాదు - త్ర్యర్థికావ్య రచనకును - అచ్చ తెనుగు కావ్యరచనకును గూడ ఆద్యుడితడే. నేడితని గ్రంథములు హెచ్చుగా లభించుట

2. ఈ గ్రంథమును గూర్చి ప్రస్తుత వ్యాసమున ముందు వివరించుచున్నాము,

3. ఈ కవి బహుగ్రంథ నిర్మాత-అన్నియు నముద్రితములు. సుమారు 40 సం. క్రితము పరమపదించెను.

లేదు. ఒకటి రెండు గ్రంథములు మాత్రమే ఎప్పుడో చాలాకాలము క్రితము ముద్రింపబడినవి. అలభ్యములు. నాకు లభించిన కవి రచనల నాధారముగ గొని ఈ వ్యాసమును వ్రాయుచున్నాను.

'దశరథరాజనందన చరిత్ర' యను నిరోష్ఠ్య కావ్యాదియందు—తనకు పూర్వము నిరోష్ఠ్య కావ్యమును గూర్చి ఇట్లు చెప్పెను—

మును రామాయణము న్నిరోష్ఠ్యముగ
నింపుల్ మీర శాకల్లి మ—
ల్లన తా సంస్కృత భాష చెప్పెనన
వాలాగున్ జెవుల్ నిండగా
విను టేగాని, ధరిత్రిలో నిజముగా
వీక్షింప లేదట్టి దే
తెనుగుం జేసెద భూమిపై
కవిజనాధ్యక్షు ల్ప్రశంసింపగన్' (1-32)

దీనివలన—సింగరాచార్యులకు పూర్వము శాకల్లి మల్లన సంస్కృతమున నిరోష్ఠ్య కావ్యమును వ్రాసినట్లును—అది ఈ కవి నాటికే మాయమైన దనియు సుస్పష్టమగుచున్నది. కావున మనకు తెలిసి నంతవరకు నిరోష్ఠ్యకావ్యరచన కాద్యుడు సింగరాచార్యులే! —

కవి తాను వ్రాసిన గ్రంథముల గూర్చి వ్రాసు కొన్న పద్యములు—వానివి 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము'నుండి ఇచ్చుచున్నాను[4].

సిరుల తొమ్మిదియేండ్ల 'వరదరాజస్తుతి'
'శ్రీరంగ శతకంబు' చెప్పినావు
పదియేండ్లవాడను బహుచమత్కృతులచే
'చక్రలాంఛన విధి'ఁ జెప్పినావు
ఎలమితోఁ బదునొకండేండ్ల బాలుఁడ వయ్యు
'కవి కదంబరచన' గాంచినావు
వరుసతో బంద్రెండు వత్సరంబులవేడ్క
శతసంహితయు' తెల్లఁజేసినావు,
రమణఁ బదిమూఁడేడుల 'రామకృష్ణ
చరిత' మిల ద్వ్యర్థి సంశ్లేషశస్త మొదవ
నాంధ్ర భాషగ రచియించి తౌరభువిని.
శబ్దశాసన బిరుదాంక శాలివగుచు॥

వరుస పదునాల్గు పదియేను వత్సరముల
సరస కవితాష్టభాషా విశేష కృతుల
సరణు లేర్పడ నాటక శాస్త్రమెల్ల
గరిమ విరచించితివి గాదె కవులువెన్న॥

అనఘ ప్రేమాభిరామ ధనాభిరామ
కావ్యములు జాతివార్తలు గడలు కొనఁగ
ద్విపదలుగఁ జేసితివి కవిస్వవతులెన్న
పూవి షోడశ వత్సరంబునవె మొదల॥

నలయాదవ రఘుపాండవ
సలలిత వైయర్థకావ్య సంశ్లేషకృతుల్
ఎలమి దశసప్తహాయన
మలవడు కాలంబునందు నతిమధురోక్తిన్.'

వరుస పదునెన్మిది వత్సరంబులవాఁడు
సకల ఆలంకార సంగ్రహంబు
రాకాసుధాపూర్ణరసపుష్పగుచ్ఛంబు
నాంధ్రభాషాభిరామాఖ్య కృతియు
వితివిగా రచియించి వెలయఁ బందొమ్మిది
హాయనంబులనాఁడు నఖిలశబ్ద—
కవినేత లిల శిరఃకంపఁబు గావింప
ఘనశబ్దశాస్త్రాది కల్పవంబు

వెలమి గావించి యిరువదియేండ్లనాఁడు
ఘననిరోష్ఠ్యాది వింశతి కావ్యములను,
విలసితప్రౌఢి నిర్మించి వెలసితీవు
సింగరాచార్య కవిరాయ శ్రితవిధేయ.

రాఘవ పాండవీయ కృతిరత్నము
పింగలి సూరనార్యుఁడే

4. ఈ గ్రంథము ఎప్పుడో ముద్రింపబడిన దట. శ్రీ ఆసూరి మరింగంటి శ్రీ రంగాచార్యులవారు మాకీ గ్రంథ లిఖిత ప్రతి 5 సం. క్రిత మొసంగిరి. అదియే నా కాధారము.

శ్లాఘ సముద్ధరించె,
నది సర్వబుధప్రతతుల్ గణింప, నా
హా ఘనమయ్యె దానికెన
నాంధ్ర నిరోష్ఠ్య మహాప్రబంధ మెం
తే ఘటియింపఁజేయ నలు
దిక్కులయందుఁ బ్రసిద్ధమయ్యెడిన్.

అని - ఈ ప్రకారముగ కవిస్వప్నమున కర్పూరాచల నృసింహుఁడు కన్పించి చెప్పినట్లుగా కవి వివరించెను. ఈ పద్యములేగాకఁ 'చిలువపడిగ రాజేని కథ' (చిలువ= పాము, పడిగ = ధ్వజము, రాజేనికథ = దుర్యోధనుని చరిత్ర—సర్పధ్వజుఁడగు దుర్యోధనుఁడు భానుమతిని పెండ్లియాడుట యందలి విషయము) అను అచ్చ తెనుగు కావ్యమున—

పదియేండ్లవాఁడనై బహు చమత్కృతియైన
శల్యపిళ్లనురాయ చరిత మొకటి
వ్రాసితి పదియొక్క వత్సరంబునయందు,
నందనందనశతానంద మొకటి,
పదిరెండు వర్షముల్ పరగ నలంకార
కృష్ణవిలాసంబు కృతియు నొకటి,
అయిదైదు మూఁడును హాయనంబులలోన
జనకరాయనిబిడ్డచరిత మొకటి...

ఇక ఈ పద్యము లన్నింటినిబట్టి గ్రంథముల జాబితాను ఇచ్చుచున్నాను—

| గ్రంథము పేరు | రచియించునాటికి కవి వయస్సు. |
| --- | --- |
| 1. వరదరాజస్తుతి<br>2. శ్రీరంగ శతకము | 9 సంవత్సరములు. |
| 3. చక్రలాంఛనవిధి<br>4. శల్యపిళ్లరాయ చరిత్ర | 10 ,, |
| 5. కవి కదంబము—<br>6. నందనందన శతానందము (శ్రీకృష్ణశతానందీయము) | 11 ,, |
| 7. శతసంహిత (ఆంధ్రానువాదము)<br>8. అలంకారకృష్ణవిలాసము | 12 ,, |
| 9. రామకృష్ణ చరితము (శ్లేష) | 13 ,, |
| 10. అష్టభాషా కృతులు<br>11. నాటక శాస్త్రము | 14, 15 ,, |
| 12. జనకరాయని బిడ్డ చరిత్ర<br>13. నందనందనశతకము | 11 ,, |
| 14. ప్రేమాభిరామము<br>15. ధనాభిరామము | 16 ,, |
| 16. నలయాదవ రాఘవ పాండవీయము (చతురర్థి కావ్యము) | 17 ,, |
| 17. సకలాలంకారసంగ్రహము | ,, |
| 18. రసపుష్ప గుచ్ఛము (రసమంజరియా) | 18 ,, |
| 19. ఆంధ్ర భాషా భూషణము | ,, |
| 20. శబ్దశాస్త్రము | 19 ,, |

21. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము 20 ,,
21. దశరథరాజనందన చరిత్ర (నిరోష్ఠ్య రామాయణము) 16 ,,
22. చిలువపడిగ రాజేని కత (అచ్చ తెనుగు) 20
23. సీతాపతీ శతకము
24. [5]యామునాచార్య చరిత్ర
25. తారకబ్రహ్మరామశతకము
26. రతిమన్మథాభ్యుదయము
27. కృష్ణతులాభారము
28. రామాభ్యుదయము

కవి చెప్పికొన్న వాటినిబట్టియు - తెలిసిన వానిని బట్టియు మొత్తము 28 కృతులైనవి - ఇందు ఏ రెండుమూడోదప్ప గ్రంథములన్నియు లభించుట లేదు—లభించు గ్రంథములైనను చాలాకాలముక్రితము ముద్రింపబడుటచే అందుబాటులో లేవివియు, కొన్ని ప్రచురణముగాకను — అసమగ్రముగను — ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారనాన మొనర్చుచున్నవి—వాని పేళ్లను - వివరము లొసంగుచున్నాను.

1. తారకబ్రహ్మ రామ శతకము :—కవి దీనిని పేర్కొనలేదు. ఈ శతక ప్రతియొక్కటి కనగల్లులో ఆసూరి మరింగంటి శ్రీ రంగాచార్యులవారివద్ద నుండెడిది. వా రందులోనివని కొన్ని పద్యముల మాకు వ్రాసిపంపినారు,—

2. సీతాపతీ శతకము :—ఇందు కవి, రాముని మానవత్వమును ఖండించి, దివ్యత్వమును స్థాపించి నట్లు పద్యములు తెల్పుచున్నవి. 'తాటకహరణ హేతునిర్ణయ పంచకము, రామజన్మహేతు త్రయమ్'...ఇత్యాది శీర్షికలతో గలదు—'శతకకవుల చరిత్ర' యందు ఇందలి కొన్ని పద్యము లుదాహరింపబడినవి[6]—

3. యామునాచార్య చరిత్ర :—దీనినెచ్చటను కవి పేర్కొనలేదు. మా మిత్రులు—మహబూబ్ నగర వాస్తవ్యులు—బహువిధతాళపత్రగంథ సంపాద కులును ఐన—శ్రీ—హస్నాబాద నాగలింగ శివయోగి గారు—తమవద్ద నీ గ్రంథ ప్రతియున్నట్లు తెలిపిరి. 'ఆంధ్ర వాఙ్మయసూచిక' యందును సింగరాచార్యుల రచనగా యామునాచార్యచరిత్ర (వచనము) సూచింప బడినది.

4. చెల్వపిళ్లరాయ చరిత్ర :— 'పదియేండ్ల వాడనై బహు చమత్కృతియైన శెల్వపిళ్లమ రాయచరిత మొకటి' అని కవి చెప్పుకొనినాడు. ఇచట ఒకవిషయమును గమనించవలయును. 'శెల్వ పిళ్లరాయ చరితమొకటి' అనునప్పుడు యతిభంగమున కాస్కారముగలదని భావింతుము. కాని చన్నమల్లేశ— చెన్నమల్లేశ—అనువానివలె ఇదియును సరియైనదే! శెల్వపిళ్లయే—చెల్వపిళ్ల, చల్లపిళ్లగా మారినది. 'సంపత్కుమార'యను సంస్కృత శబ్దమునకు 'శెల్వ పిళ్ల' యనునది తమిళభాషా పర్యాయపదము. నేటికిని శల్వపిళ్లయను వైష్ణవులు పేరుంచుకొనుట గ్రహించ

---

5. 24—28 సంఖ్యగల గ్రంథముల కవి పేర్కొనలేదు. యామునాచార్య చరిత్ర ఒకటి—గలదు. (చూ. ఆంధ్రవాఙ్మయ సూచిక). రతిమన్మథాభ్యుదయము, కృష్ణతులాభారము, కీ॥ శే॥ ఆ. మ. శ్రీ రంగాచార్యులవారివద్ద ఉండెడివి. నేటివరకెవ్వరును గ్రంథముల జాబితాను పూర్తిగా ఇయ్యలేదు. కావున ఇచ్చితిని.

6. చూ—శతకకవుల చరిత్ర— వంగూరి సుబ్బారావుగారు— 1957 వ సం. ముద్రణలో 393 పుటయందు.

21. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము 20 ,,
21. దశరథరాజనందన చరిత్ర (నిరోష్ఠ్య రామాయణము) 16 ,,
22. చిలుకపడిగ రాణెని కథ (అచ్చ తెనుగు) 20
23. సీతాపతీ శతకము
24. [5]యామునాచార్య చరిత్ర
25. తారకబ్రహ్మరామశతకము
26. రతిమన్మథాభ్యుదయము
27. కృష్ణతులాభారము
28. రామాభ్యుదయము

కవి చెప్పికొన్న వాటినిబట్టియు - తెలిసిన వానిని బట్టియు మొత్తము 28 కృతులైనవి - ఇందు ఏ రెండుమూడోదప్ప గ్రంథములన్నియు లభించుట లేదు—లభించు గ్రంథములైనను చాలకాలముక్రితము ముద్రింపబడుటచే అందుబాటులో లేనివియు, కొన్ని ప్రమరణముగాకను — అసమగ్రముగను — ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారవాస మొనర్చుచున్నవి—వాని పేళ్లను - వివరము లొసంగుచున్నాను.

1. తారకబ్రహ్మ రామ శతకము :— కవి దీనిని పేర్కొనలేదు. ఈ శతక ప్రతియొక్కటి కనగల్లులో ఆసూరి మరింగంటి శ్రీ రంగాచార్యులవారివద్ద నుండెడిది. వారందులోనివని కొన్ని పద్యముల మాకు వ్రాసిపంపినారు,—

2. సీతాపతీ శతకము :—ఇందు కవి, రాముని మానవత్వమును ఖండించి, దివ్యత్వమును స్థాపించి నట్లు పద్యములు తెల్పుచున్నవి. 'తాటకహరణ హేతునిర్ణయ పంచకము, రామజన్మహేతు త్రయమ్'...ఇత్యాది శీర్షికలతో గలదు—'శతకకవుల చరిత్ర' యందు ఇందలి కొన్ని పద్యము లుదాహరింపబడినవి[6]—

3. యామునాచార్య చరిత్ర :—దీనిచెప్పుటను కవి పేర్కొనలేదు. మా మిత్రులు—మహబూబ్ నగర వాస్తవ్యులు—బహువిధతాళపత్రగంథ సంపాద కులును ఐన—శ్రీ—హస్నాబాద నాగలింగ శివయోగి గారు—తమవద్ద నీ గ్రంథ ప్రతియున్నట్లు తెలిపిరి. 'ఆంధ్ర వాఙ్మయసూచిక' యందును సింగరాచార్యుల రచనగా యామునాచార్యచరిత్ర (వచనము) సూచింప బడినది.

4. చెల్వపిళ్లరాయ చరిత్ర :— 'పదియేండ్ల వాడనై బహు చమత్కృతియైన శెల్వపిళ్లమ రాయచరిత మొకటి' అని కవి చెప్పుకొనినాడు. ఇచట ఒకవిషయమును గమనించవలయును. 'శెల్వ పిళ్లరాయ చరిత మొకటి' అనునప్పుడు యతిభంగమున కాస్కారముగలదని భావింతుము. కాని చన్నమల్లేశ—చెన్నమల్లేశ—అనువానివలె ఇదియును సరియైనదే! శెల్వపిళ్లయే—చెల్వపిళ్ల, చల్లపిళ్లగా మారినది. 'సంపత్కుమార'యను సంస్కృత శబ్దమునకు 'శెల్వ పిళ్ల' యనునది తమిళభాషా పర్యాయపదము. నేటికిని శల్వపిళ్లయను వైష్ణవులు పేరుంచుకొనుట గ్రహించ

5. 24—28 సంఖ్యగల గ్రంథములు కవి పేర్కొనలేదు. యామునాచార్య చరిత్ర ఒకటి—గలదు. (చూ. ఆంధ్రవాఙ్మయ సూచిక). రతిమన్మథాభ్యుదయము, కృష్ణతులాభారము, కీ॥ శే॥ ఆ. మ. శ్రీ రంగాచార్యులవారివద్ద ఉండెడివి. నేటివరకెవ్వరును గ్రంథముల జాబితాను పూర్తిగా ఇయ్యలేదు. కావున ఇచ్చితిని.

6. చూ—శతకకవుల చరిత్ర— వంగూరి సుబ్బారావుగారు—1957 వ సం. ముద్రణలో 393 పుటయందు.

నిరోష్ఠ్య కావ్యరచనకు పూనుకొనెను. ఈ రెండును మిక్కిలి శ్రమను కలిగించు నియమములు. ఇట్టి రచన కీతడే ఆద్యుడు. అనంతరము—మచ్చ వెంకట కవి—శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్ర; కందుకూరి వీరేశలింగకవి—శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము—మొదలగునవి బయల్వెడలినవి. శుద్ధాంధ్రము — అందు నిరోష్ఠ్యగ్రంథరచన యనునది మిక్కిలి శ్రమకల్గించును. సంస్కృత శబ్దార్థముల బోధించు దేశ్యములే తెనుగులో తక్కువ. శుద్ధాంధ్రగ్రంథములలో కవులు కొన్ని శబ్దములను వ్యుత్పత్తుల ననుసరించి సృజించినారు. ఆంధ్ర శబ్దములయందు ఓష్ఠ్యములు హెచ్చు. అట్టిసమయమున నిరోష్ఠ్యముగ వ్రాయుట ఎంత కష్టమో విజ్ఞుల కవగతముగానివిషయముగాదు. శింగరాచార్యులు ఈ గ్రంథ రచనారంభమున—రచనను గూర్చి చెప్పుకొన్న పద్యములను గమనింపుడు. వాని నిట పేర్కొనుచున్నాను.

'తెనుగున కొన్ని కావ్యములు
తేల్లముగా రచియింపవచ్చుఁ బే
ర్కొనఁగ నిరోష్ఠ్య కావ్యములు
కొన్ని యొనర్పగవచ్చుఁగాక, చ
క్కన నివి రెండు చందములు
గ్రచ్చరగూర్చెడు నేర్పువేత, నె
వ్వనికి రచింప శక్యమగు,
వాంఛయొనర్చితి దానిజేయఁగన్.

అనియు—

చెప్పరానట్టి కావ్యంబు చెప్పఁబూని
నాఁడఁ మదశ్వగతిచేత నడచి నడవ
ములు విచారింపకయె, యేగుజలధిదాట
జేరు సాహసి దొడ్డుకొంచెంబులమనె'.

తొలుతటి సుకవులు ఘనులై
యలి యాంధ్ర నిరోష్ఠ్య కావ్యమేలా చేయం
దలచిరో, నాకుఁ బ్రసిద్ధము
గలుగగ నొనరించు కొఱకు గౌరవలేఁ దెలియన్॥

ఇక లవ నియమములు:—

అరయ క గ చ జ ట డ త ద నా యం సహ
ర ద్వయమెగాని యొండక్షరములు చొరవు
మఱియు నొత్తొత్వములు కొమ్ము మూముడియును
వలవదావిూఁద నరభాష నిలుపరాదు॥

ఫ. బ భ. మ. వ. లే గాక గుడికొమ్ము జాత్యములు గూడ నిరోష్ఠ్యముగ పాటించెను. ఆశ్వాసాత్యంత ములు ఇష్టదేవతా ప్రార్థన—వంశావతార వర్ణన వీనియందు మాత్రము—పై నియమము నంచు కొనక మామూలుగా వ్రాసెను. ఇన్ని నియమములతో రచించినను ధారాశుద్ధికి మాత్రము లోపములేదు.

ఇదియే మొదటి అచ్చ తెనుగు కావ్యము. నేటివరకు అందరు భావించునది మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యము—పొన్నికంటి తెలగన్న—యయాతి చరిత్రమని. కాని సింగరాచార్యులే ఆద్యుఁడు. తన 20 ఏట సింగరాచార్యులు ఈ కావ్యమును, దశరథ రాజనందన చరిత్రయును—నిరోష్ఠ్య రామాయణమును రచించినట్లుచెప్పుకొనెను.(చూ. గ్రంథముల జాబితా). తెలగన్న యయాతి చరిత్రయందు పేర్కొన్న మరింగంటి అప్పన్నగారు—ఈ సింగరాచార్యుల యగ్రజుడు. అతడు—'ముగురు రాజులచేత మొక్కులు గొన్నట్టి—భగవత్సమానుఁ డప్పలగురుండు'—అని సింగరాచార్యులితనిని పేర్కొనెను. తెలగన్నయు సింగరాచార్యులును సమకాలీనులు. అప్పలాచార్యులవారు అమీనుఖానుని వద్ద ముఖ్యోద్యోగి. తెలగనకన్న సింగరాచార్యులే పెద్దవాడు. సింగరాచార్యులు బాల్యమునుండి కవి యైనను, నరాంకిత విముఖుఁడై యున్నందున అతని కావ్యములు అంతగా ఆదరణనందలేదు. తెలగన్న—రాజాస్థానమున నున్నవాడు—రాజాశ్రితమైన రచన—త్వరలో ప్రచారమునకు వచ్చును. సింగరాచార్యుల రచనను తెలగన్నచూచి—అంత ప్రౌఢముగా లేదని భావించి కాబోలు—తాను యయాతి చరిత్రమును వ్రాసెను. ఎచ్చటో మారుమూలనున్న తనతమ్ముడగు సింగరాచార్యుల రచనను అప్పలగురు దెలిగి యుండక—తెలగన్న రచనను ప్రోత్సహించెనో! లేక తెలగన్నయే అప్పలాచార్యులగూర్చి అనగా తన గ్రంథమును అమీనుఖానునకు అంకితమీయవలసినదిగా ప్రోత్స

హించెనని వ్రాసుకొనెనో! సీతాకళ్యాణము నందలి అచ్చతెనుగు కావ్యరచనము గూర్చియు—గల పద్యముల వలెనే యయాతి చరిత్రయందును గలవు. ఎవరెవరి పద్యముల గ్రహించిరో తెలియదు. కాని సింగరాచార్యులు నిరోష్ఠ్య కావ్యరచనము గూర్చి

'రాఘవ పాండవీయ కృతిరత్నము
పింగళి సూరనార్యుఁడే
శ్లాఘ సముద్ధరించె నది
సర్వబుధ ప్రతతుల్ గణింప నా
హో ఘనమయ్యె దానికెన
యంధ్ర నిరోష్ఠ్య మహాప్రబంధ మెం
తే ఘటియింప జేయ నలు
దిక్కులయందుఁ బ్రసిద్ధమయ్యెడిన్'

అని పింగళి సూరనను గూర్చి తెల్పినకవి—తెలగన్న కావ్యమునుండిగాని—దాని చూచిగాని—ఈ పద్యముల వ్రాసుకొనెనని తలంచుట సరిగాదు. సింగరాచార్యులు చిన్ననాటనుండి కవిగదా! బహుగ్రంథ నిర్మాతగదా! ఇట్లు చేయునా? ఇంతేగాక వింశతి సంస్కృతాంధ్ర నిరోష్ఠ్యశ్లేష్యాది గ్రంథ నిర్మాత' గదా! కావున సింగరాచార్యుల రచన తరువాతనే—యయాతి చరిత్ర రచింపబడినది. కావున—తెలగన్నకన్నముందే సింగరాచార్యుడు అచ్చతెనుగు రచన చేసెను. కావున ఇతడే ఆద్యుడు.

'పొన్నికంటి తెలగనార్యుడు ఈ యచ్చతెనుగు ప్రబంధమును వ్రాయగానే వెంటనే ఈ రచన ఇతర కవుల నాకర్షించినది. అప్పటికే నిరోష్ఠ్య రామాయణమును రచించిన మరింగంటి సింగరాచార్యులు అచ్చతెనుగు ప్రబంధమొకటి వ్రాసి దానికి 'చిలువ పడిగ రాజేని కత' అని పేరిడెను'–9. ఈ విధముగ వ్రాయుట సరిగాదు. అసలు—సింగరాచార్యులు తన 20వ ఏట 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము' వ్రాసి అనంతరము—నిరోష్ఠ్య రామాయణము, 'చిలువపడిగ రాజేని కత'యు వ్రాసెను. నేటివరకు సింగరాచార్యుల కృతుల పరిశీలనము సక్రమముగా జరుగక పోవుటయు, వ్రాయువారు కృతులనుగాక—కొందరి వ్రాతలను చూచి వ్రాయుటయు మామూలైనది. కావుననే ఇట్టి పొరపాట్ల కాస్కారము కలిగించు చున్నది. విజ్ఞులింకను ఈ విషయమును పరిశీలింతురగాత—

దశరథ రాజనందన చరిత్ర:—ఇది ఐదాశ్వాసముల నిరోష్ఠ్య కావ్యము. కవి దీనిని—'దశరథ రాజ నందన చరిత్ర'యను—నిరోష్ఠ్య రామాయణము—అని చెప్పెను. మావద్ద ఒక ముద్రిత ప్రతియు[10]—తాళపత్ర ప్రతియు—లిఖిత ప్రతియును గలవు. వాని ననుసరించి ప్రతి వివరము లొసంగుచున్నాను.
ఇందలి గద్యపద్యములు—

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము | 120 |
| ద్వితీయా ,, | 162 |
| తృతీయా ,, | 157 |
| చతుర్థా ,, | 180 |
| పంచమా ,, | 310 |
| మొత్తము— | 929 గద్యపద్యములు. |

కృత్యాద్యంతములందును—కవివంశ వర్ణనయందును—నిరోష్ఠ్యము పాటించలేదు. గ్రంథరచన నిరోష్ఠ్యముగా చేసినవాడుకావున—రావణాసురుడు — అనుటకు రాక్షసనేత, దశాననుడు, అనియు, కుంభకర్ణుడు—అనుటకు ఘటకర్ణుడు అనియు వ్రాసెను. కొద్ది సంక్షిప్తముగా రామాయణ కథయంతయు నిందు చెప్పబడినది. 5 ఆశ్వాసము చివర ఒక నాగబంధ వృత్తము, ఖడ్గబంధవృత్తమును గలవు. తన కావ్యరచన కుద్బోధకమైన కారణమును గూర్చి కవి.

'సముదీర్ణస్థితి వేంకటేశ్వరుఁడు
నా స్వప్నంబునన్ షోడశా
బ్దముఁన్ మాణవకాకృతి న్నిలిచి
'వత్సా! యాంధ్రభాష నిరోష్ఠ్య
మహాకావ్యమొనర్పుమీ' యనిన
సత్యారూఢి మేల్కాంచి,
మోదమునం జెప్పితి భూమిపైఁ
గవిజనాధ్యతు బ్రశంసింపగన్' (1-31)

అని యీ విధముగా జెప్పెను.

9. చూ. యయాతి చరిత్ర పీఠిక—సాహిత్య ఎకాడమీ ప్రచురణ. పుటలు. XXXIV.

సింగరాచార్యులకు పూర్వము నిరోష్ఠ్య మహా కావ్యరచనయున్నను—లేనట్లే. దానిగూర్చికవి—

'మును రామాయణము న్నిరోష్ఠ్యముగ
నింపుల్మీర శాకల్ల మ
ల్లన తా సంస్కృతభాషజేసెనన
వాలాగున్ చెవుల్నిండగా వినుటేగాని,

ధరిత్రిలోనిజముగా
వీక్షింపలే, దట్టి దే
తెనుఁగున్జేసెద నెల్లడన్ కవులకున్
దృష్టాంతమై యేర్పడన్' (1-32)

ఇందలి ఆశ్వాసాంత్య గద్య ఈ ప్రకారముగ గలదు.11

"ఇది శ్రీ మత్కర్పరాచల లక్ష్మీనృసింహ వేంకటేశ్వర వరప్రసాద
లబ్ధ సకలైశ్వర్యధురీణ, శారదాప్రశ్నవివరణ, శతఘం
టావధాన, వినయధునీతరంగవిజృంభితాజృంభిత
సులలిత మృదుమధురవాగ్వైఖరీఝురీధురీణ
స్థాపితాశేషవిశేష ప్రసిద్ధ సాహిత్య సారస్య
రాశుకవితాష్టభాషావిశేష, సంస్కృతాంధ్ర
నిరోష్ఠ్యోష్ఠ్యాది వింశతి ప్రబంధ నిర్మాణ ధురీణ—వశిష్ఠ
మహాఋషిగోత్రపవిత్ర, తిరుమలదేశికేంద్ర పౌత్ర
తిరువేంగళాచార్య పుత్ర మరింగంటి సింగరా
చార్య కవిరాజ ప్రణీతంబయిన 'దశరథ
రాజ నందన చరిత్ర'యను నిరోష్ఠ్య
మహా ప్రబంధంబునందు............
.........ఆశ్వాసము—'

అని—

ఇందలి కవిత్వము మిక్కిలి ప్రశస్తముగగలదు. ఎచ్చటనోగాని మారుమూలపదములుగలుగవు. అవి యును నిరోష్ఠ్య నియమునవచ్చినవే—

ఈనాడు మనకు కావలసినది వివాదమునకు నీడ్కోలునిచ్చి విషయ వివరణాత్మకమగు సర్వంకష సాహితీ విమర్శ. అందు గ్రంథ పక్షమును ప్రధానముగ వహించి—కూలంకష పరిశీలన మొనర్చుట ఎంతేని ఆవశ్యకము. నేడు ప్రాచీన సాహిత్య విషయ పరిశోధనపై ఆసక్తి తగ్గుచున్నను—ఇట్టి రచనల గూర్చి—కవుల గూర్చి పరిశోధించుట ఎంతేని అవసరము—

'రాజనీతి రత్నాకరము' అను గ్రంథములోనివని ప్రొఫెసర్ బిరుదురాజు రామరాజుగారు, "కుతుబుషాహి సుల్తానులు — ఆంధ్ర సంస్కృతి'' (పు—97—112) అనే గ్రంథమున పద్యముల నుదాహరించిరి. తత్కర్తచే మరింగంటి సింగరాచార్యులు ఈ విధముగా స్తుతింపబడినాడు—

'ఆంధ్ర భాషా నిరోష్ఠ్య మహాప్రబంధ
రాజి రచనాధురీణు కర్ణాటరాయ
లబ్ధ కవిసార్వభౌమ కల్యాణ బిరుద
శాలి మరిగంటి సింగరాచార్యుఁదలతు'

10. ఈ ముద్రిత ప్రతిని నాకొసంగినవారు మిత్రులు మరింగంటి పురుషోత్తమాచార్యులుగారు B.A, B.Ed. (సూర్యాపేట). కవరు పేజీలు లేవు. ముద్రణవత్సరము తెలియదు. 'ఆంధ్రవాఙ్మయ సూచిక' మాత్రము ఈ గ్రంథము 1917 లో ముద్రణమైనట్లు తెలుపుచున్నది.

11. ఈ గద్యము 'సమగ్ర ఆంధ్ర సాహిత్య'కర్త సరిగా నుదాహరించలేదు. అసలు సింగరాచార్యులను గూర్చియే మిక్కిలి అసమగ్రముగా గలదు. చూ. 11 సం. నవాబుల యుగం. 258—263 పుటలు.

# కవి కన్నా....

## శ్రీ వరవరరావు

అందమైన అబద్ధం చెప్పడమో
అన్యాయపరుని మనసు నొవ్వకుండా
నిజాన్ని సింబాలిజమ్ మరుగున
చెప్పడమో తప్ప
కవిమాత్రం సాధించిందేమిటి కలకాలంనుంచి—
మెప్పునో, దెప్పునో, తిట్లో, దీవెనో తప్ప
ఉప్పువలె రుచీ, నిప్పువలె వేడి
చెట్లవలె గాలీ, వానవలె నీరూ
పోనీ !

సాహసం చేతగానితనంగా
ఉద్యమ శీలం
ఊకదంపుడు ఉపన్యాసంగా
నిర్భయత్వం అవివేకంగా
కవిత్వం ఎవరికీ పట్టని చాదస్తంగా
నలుగురూ పట్టించుకొనే అలజడి
నరాల్లో నెత్తురుచిందే ఉరవడి
హృదయంలో స్పందన కలిగించే జడి
మొదట మనిషి ఒక ఒరవడిగా
ఎవడైనా కవి బలికాడా

టార్చ్‌లైట్ కవిత్వంలోవేసి
వెతుక్కోవడం కాదు
బతుకులో పైకి కనిపించకుండా పరచుకున్న
చీకటిని చీల్చే వెలుగుకావాలి కవి
నూతిలో గొంతుల్ని పిలిచే ఎలుగు కావాలి.

కవిత్వం సందేశంకూడ కాదు
సమయం కలిసి రాకపోతే
'అది కవిత్వంలే' అని
జారిపోయే అసహాయత్వమూ కారాదు.
మనిషి కళ్ళలోని ఆశ
మనిషి మనసులోని ఆర్తి కావాలి కవిత్వం.

కవిత్వంవేరు, జీవితంవేరు
అనుకోవడంకన్నా ఆత్మవంచన లేదు.
కాగితంమీద గొప్పగా చెప్పినవాడే
కవి అయితే
కవికన్నా కరెంటు తీగ గొప్ప.



# ప్రాంతీయ దేశ్య పద నిఘంటువు

శ్రీ ఉమాపతి పద్మనాభ శర్మ

ఏ పదానికైనా అర్థస్ఫోరకశక్తి దానికున్న వ్యుత్పత్తిబలంవల్లకంటే వ్యవహారబలంవల్లనే కావలసి వుంది. పదానికి చారిత్రక పరిణామవర్చ సహజమేకాని వ్యుత్పత్తి చెప్పడం కృతకంగానే వుంటుంది. అంతేకాక కేవల వ్యుత్పత్తి ప్రాధాన్యంవల్ల అర్థ ప్రామాణ్యంలో స్థైర్యం లేకుండాపోయే ప్రమాదంకూడా ఉంది: భాష్యాల్లో, శాస్త్రార్థ చర్చల్లో మూలంలోని పదాల్ని మార్చకుండానే స్వమతానుకూలమైన అర్థాల్ని చెప్పడం సంస్కృతంలో క్రొత్తదికాదు.

వ్యుత్పత్తివ్యవస్థపై అంతగా పట్టింపులేని దేశ్యశబ్దసిద్ధి వ్యవహారంవల్లనే కలుగుతున్నది. 'సిద్ధిర్లోకాద్దృశ్యా' అనడంలో ఉద్దేశ్యమదే. అయినా తెలుగు లాక్షణికులు శబ్దపరిధిని కుంచించక పోలేదు. లోకవ్యవహారానికే ప్రామాణికతాగౌరవ మిచ్చినప్పుడు శాస్త్రప్రయోజనానికి ముప్పు కలుగుతుందనేమో 'సంస్కారార్థం నియమః' అన్నారు. అంతటితో ఆగక 'కవి ప్రయుక్తమేవపదం ప్రయుంజానైః కవిభిరేవ అసాధుప్రయోగః పరిహ్రియత'వంటి వ్యాఖ్యానాలతో సాధుత్వాసాధుత్వమీమాంస చేసి కొన్ని కట్టుదిట్టాలు ఏర్పరచారు. ఆయాకాలాల్లోని మహాకవులందరూ ప్రామాణికులే కావలసియుండగా, వారి ప్రామాణికత్వం లాక్షణికుల చెప్పుచేతల్లోకి బలవంతంగా రావలసివచ్చింది. ప్రయోగమే శరణ్యంగా గలవారైనా వైయాకరణులు శాసిస్తుంటారు. 'ఆర్య ప్రయోగంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అంటూ ఔదార్యాన్ని చూపుతుంటారు. గతానుగతికంగా కవులు తమకున్న స్వేచ్ఛను మరచిపోతుంటారు. అలా వేలేండ్లనుండి వ్యవహారంలో నలిగిపోతున్న పదాన్నైనా సరే లాక్షణికులూ, కవులూ, వీరిద్దరిమీదనే ఆధారపడ్డ నిఘంటుకారులూ నిర్లక్ష్యంచేస్తారు. ఇట్లు నిర్లక్ష్యం చేయబడిన తెలుగుమాటలు ఆయామండలాల్లో సజీవంగా వేలకొద్దీ ఉండవచ్చు—ఉన్నాయి. అట్టిపదాల్ని సేకరించి 'ప్రాంతీయ దేశ్యపద నిఘంటువు' తయారుచేస్తే భాషాతత్వపరిశీలకులకూ, ఇతర జిజ్ఞాసువులకూ కుతూహలజనకంగానూ, సహాయకారిగానూ ఉండగలదు.

పుష్టమైన భాషకు శబ్దవిస్తృతికూడా ఒక లక్షణం. ఏభాషైనా మౌలికంగా ఆకాశంనుండి ఊడిపడదు. [పడుతుందని నమ్మేవాళ్లుకూడా ఉన్నారని మాక్స్‌ముల్లర్ ఒకచోట వ్రాశాడు.] మౌలిక శబ్దజాలమంటూ కొంతఉన్నా చుట్టూతాఉన్న పొరుగు భాషల్లోని తన కవసరమైన పదాల్ని చేర్చుకోవడం ఏ జీవద్భాషకైనా సామాన్యమే. ఇతరభాషలలోనుండి చేరి గుర్తుపట్టరావంతగా మారిపోయి, దేశ్యములుగా చెలామణీ అవుతున్న పదాలు తెలుగులో ఎన్నోవున్నాయి. ఉదాహరణకి 'బియ్యము' అనేమాట వ్రీహిభవం, వ్రీహ్యం, బ్రియ్యం, బియ్యం అని పరిణామం పొందిందంటే ఆశ్చర్యం కలుగుతుంది. [చూ. నుడి–నానుడి. తిరుమల రామచంద్ర. పు 99]. ఇలాంటి పదాలు నిఘంటువుల్లో దేశ్యములుగా స్థానం సంపాదించుకున్నప్పుడు తెలుగువాళ్లు నిత్యంగా వాడుకుంటున్న అచ్చమైన తెలుగుమాటల్ని ఉపేక్షించడం నిజంగా దురదృష్టం.

ఇప్పుడు తత్సమ, తద్భవాల నిర్వచనాలు విశాలతరం కావలసిఉన్నాయి. సంస్కృత ప్రాకృత సమ–భవాలేకాక ఆంగ్ల, హిందీ, ఉర్దూ, మహారాష్ట్ర, తమిళ, కన్నడ, మళయాళ సమ–భవాలుకూడా తెలుగులో ఉన్నాయికదా! వీటన్నిటి వింగడింపు సరిగా లేకున్నా, ఏది దేనికి మూలమో ఇంకా పరిశీలనసాగుతున్నా, సాగవలసియున్నా, ఈ పదాలన్నీ నిఘంటువుల చేత గుర్తింపబడే ఉన్నాయి. కవులు వాడుతూనే

ఉన్నారు. వాడవద్దనీ, వాటికి స్థాన మీయ వద్దనీ ఎవరూ ఆంక్ష పెట్టరు. కాని అక్షరరూపం లోకి రాక మారుమూలల్లో తలదాచుకుంటున్న తెలుగు మాటల విషయ మేమిటి? అనేదే ప్రస్తుతాంశం. శ్రీ పోరంకి దక్షిణామూర్తి, శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారలవంటివారు కొందఱు ప్రాంతీయ భాషల్లో నవలలూ, కథలూ వ్రాశారు. శ్రీ భాగవతము రామారావుగారిలాటివా రితీవలి భారతులలో కొన్ని ప్రాంతీయ పదాలను చూపుతూ వ్యాసాలు వ్రాశారు. సాహిత్య ఎకాడమీ వృత్తిపదకోశాల్ని తయారుచేస్తున్నది. ఇంతకంటే బృహత్తరంగా 'దేశి' స్వరూపాన్ని విస్తృతపరచవలసిన బాధ్యత భాషా సాహిత్య తత్వజ్ఞులపై ఉన్నది. ఈ బాధ్యతలో ప్రాంతీయపదనిఘంటు నిర్మాణం ఒక ముఖ్యాంగం.

ప్రస్తుత సౌకర్యంకోసం మాండలిక దేశ్య పదాల్ని ఈ క్రింది రకాలుగా విభజింపవచ్చు.

1. గ్రంథముల(నిఘంటువుల)లోని కెక్కనివి.

2. నిఘంటుస్థములైన పదాలలోనే ఒక ప్రాంతంలో వ్యవహారంలోంచి పూర్తిగా జారిపోయినా మరియొక ప్రాంతంలో సజీవంగా నిత్యవ్యవహారంలో నున్నవి.

3. నిఘంటువులలోఉన్న అర్థాలలోకాక ఇతర మైన అర్థాలలో ప్రయోగంలో నున్నవి.

4. గ్రంథముల కెక్కని పదాలు కొన్ని ఒక ప్రాంతంలో ఒక అర్థంలోనూ, వేఱొక ప్రాంతంలో వేఱొక అర్థంలోనూ ప్రయోగింపబడేవి.

5. ఇటు సంస్కృతంలోనూ, (ప్రాకృతంలో కూడా) అటు తమిళ, కన్నడ, మళయాళభాషల లోనూ మూలం దొరకనివి.

6. స్వతంత్రప్రయోగం లేకున్నా, వాక్య గతమై అర్థపువిలువ (Sense Value) గల ఊత పదాలు.

7. దేశ్యములుగా మారిపోయిన ఇతర భాషా పదాలు.

8. (a) శిష్టజన (b) పామరజన వ్యవహారంలో నున్నవి.

9. గ్రంథస్థములే అయినా వ్యవహారవశాత్తు రూపం మారిపోయి భ్రష్టములైనవి.

10. పదములే అయినా ఉచ్చారణావశాత్తు వాటి గ్రాంథికతను కోల్పోయి వ్యవహారమున ప్రత్యయతుల్యములైనవి.

ఇది స్థూలవిభజనమాత్రమే. ఇక ప్రకృత మేమిటంటే పైరకాల్లోని మొదటిరకానికి చెందిన పదాలలో తెలంగాణం (మెదకు మండలం)లో నిత్య వ్యవహారంలోఉండి, ఇతర ప్రాంతాలవారికి పరిచయం లేనివని నేననుకొంటున్న కొన్ని తెలుగుమాటల తీరును పండితుల పరిశీలనకొరకు నివేదించుకుంటాను. ఇందులో అక్కడక్కడ ప్రథమేతరములైన రకాలవి కూడా దిఙ్మాత్రంగా చూపబడ్డాయి—ఇవి ఉద్దిష్ట నిఘంటు నిర్మాణమున తోడ్పడాలని ఆశ.

1. అచ్చరు: గంజితీసే అవసరంలేకుండా తయారుచేయబడే అన్నం. 'పెట్టు' ధాతువుతో అను ప్రయుక్తమై క్రియ అవుతుంది. 'అచ్చరువెట్టు' అంటే 'అన్నం తయారుచెయ్' అని. 'అత్తెసరు పెట్టు' అని పూర్వరూపమేమో. తయారైన అన్నాన్ని 'అచ్చరు' అనరు మళ్లీ.

2. అడ్డముపడు: క్రిందపడిపోవుట. అంటే నిలువుగావున్న మనిషి అడ్డంగాపడిపోవడం. 'వాడు మూర్ఛవచ్చి అడ్డంపడ్డాడు? "I...made his perpendicularity into horizentality" అని చమత్కారంగా తానెవరినో క్రిందపడేసిన ఘట్టాన్ని వర్ణించిన ఆంగ్లరచయిత జ్ఞాపకమొస్తాడు. "అడ్డాల నాడు బిడ్డలుగాని గడ్డాలనాడు బిడ్డలా?" అని సామెత.

3. అదనా: నీచార్థకంలో వాడేపదం. 'అదనా ముష్టివాడి కింత గర్వమా'

4. అని: డిజైన్. డిజైన్‌కి ప్రసిద్ధమైన తెలుగుమాటయేది?

5. అపినిగొట్టు: (తిండివిషయంలో) దురాశ గలవాడు. 'తిజి' అని ఇదే అర్థంలో ఇంకోపదముంది.

6. ఆగము: తొందర. 'ఆగవడకు' 'పవ్వాగ పెట్టకు'.

7. అచ్చి: పసివాళ్ళ పరిభాషలో 'అచ్చి' అంటే బయటకు లేక ఊరికి అని అర్థం. 'అచ్చి పోదామా బాబా!'

8. ఆయి: ఇదికూడ పసివాళ్ళమాట. వేడి, నిప్పు అని అర్థం.

9. ఈటు: పొడుగాటికఱ్ఱ నేలలో పాతు తున్నప్పుడు అది నిటారుగా బిగుతుగా నిలవడానికి కఱ్ఱ పాతినచోట ప్రక్కగా వేసికొట్టేరాయి, కఱ్ఱముక్క లోనగునవి.

10. ఉసులుకొట్టు: కారం బాగా తిన్నప్పుడు ఆ బాధ తగ్గడానికి మాటిమాటికి నోటితో గాలి పీల్చుకోవడం. 'ఉస్సు'లు కొట్టుట – ధ్వన్యనుకరణం కాబోలు.

11. ఎక్కా: దీపపుబుడ్డి: ఒకేవత్తిగల దీపం అనే అర్థంలోని హిందీ మాటేమో.

12. ఎనుపు: పప్పు ఉడికినతరువాత అది మెత్తగా తయారుకావడానికి గరిటతో బాగా కలపడం.

13. ఒక్కప్రొద్దు: ఉపవాసం. ఏకభుక్తం అనే అర్థంలో ఏర్పడ్డ ఈ మాట ఉపవాసార్థకంగా మారింది.

14. ఒడిసిపోవు: అయిపోవు – విండుకొను. 'బియ్యమొడిసిపోయినవి' అంటే 'తండులములు విండుకొన్నవి' అని.

15. ఒద్దులు: దినములు. 'నాలుగొద్దులుండిపో.' 'ప్రొద్దులు' అనేదానికి భ్రష్టరూపం.

16. ఒఱ్ఱ: భూమిలో ఏర్పడే పగులు. చిన్న సైజు లోయలాటిది.

17. కంత: కష్టము. 'అదో పెద్దకంత'. 'కంథ' అనే సంస్కృతం మాట కాబోలు. కంథ అంటే బొంత. 'కంథాం వహసి దుర్వహే గర్దభే నాపి దుర్వహాం' అని మండనమిశ్రుడు. బరువు అనే అర్థం కష్టం అనే అర్థానికి పరిణమించింది.

18. కండ్లువచ్చు: కండ్లకలక. 'వాడికి కండ్లు వచ్చినవి'. కండ్లకలక వచ్చింది అని.

19. కణి: నిలువెత్తు పొడవుగావుండే బండ రాయి.

20. కణుము: రవికగుడ్డ. కనుము, కనుగు అని కూడ రూపములు.

21. కరడాలు: చేతివ్రాత (దస్తూరి) చక్కగా కుదరడానికి వ్రాసే వ్రాత. ఒత్తుబంతి. 'కరడాలు పెట్టించుకో'. మొదటి పంక్తి వ్రాయించుకో అని. నిత్యబహువచనం.

22. కరి: దారము, త్రాడు మొదలగు వానిని పేనునప్పుడు దానికివచ్చు పడి త్రిప్ప–పురి.

23. కల్వమాన: పెందలకడ. సాయంకాలానికే వాడతారు. బహుశః (పరస్పులు) 'కలువలూన' అయి వుండాలి.

24. కాటకలియు: ఒక చోటికి వెళ్ల వలసిన వాడు ఆ చోటు దొరక్క తికమకపడి మరో చోటికి వెళ్తూ వుండడం. 'ఒరేయ్! ఎన్నడూ పట్నం చూడని వాడివి. కాట కలుస్తావ్ జాగ్రత్త' అని ప్రయోగం. తొందర అనే అర్థంగల 'ఆగము' అనే మాటకికూడా ఈ సందర్భంలో ప్రయోగ ముంది. 'ఆగమై పోతావు జాగ్రత్త' అని. 'గలిబిలౌతావు' అనికూడా అంటారు.

25. కుత్తము: ఇరుకు; బిగుతు; చిన్న సైజు చెప్పులు పెద్దసైజు పాదాలకి తొడుక్కొన్నవాడు 'చెప్పులు కుత్తమున్నాయి' అంటాడు. ఒక ర్నాకరు అనుకొని చూర్చుండవలసిన రద్దీ ఉంటే 'ఇక్కడ కుత్తమున్నది' అంటారు.

26. కువారము: కపటము: 'వాడు కువారము లేనివాడు.'

27. కూరాడు: కులదేవతాస్థాపనకు బదులుగా ఒక అన్నపుకుండనలంకరించి కొందరు స్థాపించుకుంటారు. దాన్ని కూరాడుకుండ అని వ్యవహరిస్తారు.

28. కీసి: జేబు.

29. కెయి: దిక్కు. 'ఎటుకెయి పోతున్నవు?' 'ఎటకై లేక ఎటకునై' వంటి ప్రయోగముల లోని 'అయి, ఐ' అనునవి ప్రత్యయముతో కలిసి దిగర్థకంగా మారినవి.

30. కైచిప్ప: కౌచిప్ప అనికూడ ప్రయోగముంది. ఆల్చిప్ప అని కొన్ని ప్రాంతాల్లో అంటారు. 'కవ చిప్ప' కాటోలు. రెండు చిప్పలు జంటగా ఒక చోట అంటుకుని ఉన్నప్పటి పేరు ఒక చిప్పకు కూడా వాడుకలోకి వచ్చింది.

31. కొడ: మంట-జ్వాలయొక్క చివరి భాగము. 'కొడ పొయ్యి' అని, ఒక పొయ్యిలోని జ్వాల మరియొక పొయ్యిలోనికి ప్రసరించే పద్ధతిని తయారు చేస్తారు.

32. కోలు: పూలు పూచే, కాయలుకాచే కాలము. 'ఈ చెట్టు కోలాగిపోయింది' 'పూయడం, కాయడం మానుకుంది' అని.

33. గండెవాటు: చౌకోడు. ద్వారంచుట్టూ ఉండే కొయ్యచట్రము. (Frame).

34. గటక: జొన్నన్నము. పిండిజావ, అంబలి, లేవన ద్రవ్యము, ఉడికించిన పిండి అని శ. దీ. ఈ అర్థంలోలేదు.

35. గాయి: అల్లరి: అరుపు. బిగ్గరగా ఏడ్చుట. 'గాయిపెట్టకు' 'అల్లరిచేయకు' అని.

36. గుంజకపోవు: చిక్కిపోవు. 'బక్కపడు' అనేరూపంకూడా ఈ అర్థంలోనేఉంది.

37. గిన: గిట్ల, దట్ట, దట్ల సమానార్థకాలు: కొన్నిప్రాంతాల్లో "గ్రటా" అని వాడే చోట్లలో 'ఏమైనా' అనే అర్థంలోనూ వాడుకవుంది. ఒకవేళ (if) అనే అర్థాన్నికూడాయిస్తుంది. 'నీవు భోజనం గిన చేస్తివా', (ఏమైనా,) 'అక్కడికి గిన వెళ్ళగే ఈ విషయం చెప్పు' (యది) అని ప్రయోగాలు. ఇలాటివి అపదాలే అయినా అర్థాన్నందించడానికి మిక్కిలి సమర్థములు.

38. గుజ్జము: ద్వారానికి పైభాగం ఇరువైపులా కొయ్యగుజ్జు లమర్చడం కొన్నిప్రాంతాల్లో వుంది. గుజ్జాల ఆకారాలుపోయినా ఆ పేరుమాత్రం ఇంకావుంది.

39. గుత్ప: దుడ్డుకఱ్ఱ.

40. గూన: ఇంటి పైకప్పుపై ఉపయోగింపబడే పెంకు. లోటు, కుండ, బాన అని శ.దీ. ఈ అర్థంలో వాడుకలేదు.

41. గొగ్గాళ్లమీద కూర్చొను: గొగ్గికాళ్ళు, గొగ్గాళ్లు అయింది. గొగ్గిఅంటే వంకర, మడత. ఒకదానిపై ఒకటి అనే అర్థాల్లో ఇతరత్రాకూడా వాడుకఉంది. 'గొగ్గిపల్లు' అంటే 'పల్లుమీదపల్లు' శ్రీ ఖా. రా. రావు చెప్పిన దుగ్గాళం దీనికి భ్రష్టరూపమైయుండాలి.

42. గోకు: పాలుకాచిన కుండలో పాలుతీసిన పిదప కవుచిప్పతో గోకగా వచ్చు మాడుపదార్థము. 'పాలగోకు' 'నేతిగోకు' కూడావుంది. 'ఏముంది ? గోకు' అంటే 'ఏమీలేదు' అనే అర్థం.

43. చద్ది: పులిహోర, దధ్యోదనం మొదలగు ఏ చిత్రాన్నమునైనా చద్ది అని వ్యవహరిస్తారు. శరన్నవరాత్రుల సందర్భంలో పదిరోజులపాటు తెలంగాణంలో 'బతుకమ్మ పండుగ' అని చేస్తారు. చివరి రోజున చద్దులు నైవేద్యం పెడతారు. ఆనాటి బతుకమ్మను 'చద్దుల బతుకమ్మ' అని పిలుస్తారు. గర్భిణీస్త్రీలకు 'చద్దులుచేయు' ప్రక్రియ ఒకటి ఆచారంగా వున్నది.

44. చవరజేయు: బాగుచేయు, To Repair.

45. చిత్తారి: కొయ్య మరియు లోహపు వస్తువులపై చిత్రాలు చెక్కడం. డిజైన్, చిత్తారి అనే పేరుతో ఒక దేవతకూడా ఉంది.

46. చేరు: ఉయ్యాలకు కట్టబడిన త్రాళ్లను గాని గొలుసులనుగాని చేర్లు అంటారు. వరుస అనే అర్థంలో 'ముత్యాలచేరు' 'చేరుపటాకులు' అని వాడుక. 'కమ్మలచేరు' అనేది స్త్రీలు చెవులకు ధరించే ఒక పాతకాలపు ఆభరణ విశేషం.

47. జిల్ల(ర) పురుగు: బొద్దింక.

48. జోకము: ప్రమాదము. 'బండి జోకమైంది' అంటే 'బోర్లాపడింది' అని.

49. తట్టుదాకు: కాలికి రాయిదెబ్బ తగులుట.

50. తట్టువడు: లోపమగు.

51. తట్టుపోయు: మశూచి జ్వరము వచ్చుట.

52. తాపిరి(లు): ముదనష్టపు, నీచమైన, చెడిపోయిన.

53. తాయిమాయియగు: తట్టుకొన లేక పోవుట. 'ఆకలితో తాయిమాయగుచున్నాడు.'

54. తిర్లమర్ల: అస్తవ్యస్తం, అపసవ్యం.

55. తూపురము: మురికినీరు పోవడానికి ఏర్పాటుచేయబడిన చిన్నకాలువ, తూము.

56. తెకాలువడు: అలసిపోవు. 'ఎండలో తిరిగి తెకాలుపడ్డాడు.'

57. తొక్కు: పచ్చడి. 'చింతకాయతొక్కు.'

58. తొల్పు: కడుగు. ముఖ్యంగా నీళ్లుపోసి విదిలించి పారబోయడం.

59. దబ్బున: చప్పున. 'దబ్బదబ్బరా' అంటే 'తొందరగా రా' అని అర్థం.

60. దాలెం: ఇంటి పైకప్పుపై పెంకు లమర్చేముందువేసే మట్టి, వేపాకు — దాలెంవేసిన యిండ్లలో ఎండాకాలం చల్లగా, శీతాకాలం వెచ్చగా, ఆరోగ్యంగా వుంటుందిట.

61. నప్పతట్లు: చేతకానివాడు చేసేపనులు 'నప్పతట్లవాడు' అంటే అసమర్థుడు, 'నప్ప'అంటే 'శిశువు' అనే అర్థముంది.

62. నవ్వోతు: నవుబోతు: పటికబెల్లం. కండచక్కెర.

63. నాగాలు: పనిచేయని దినములు కొన్ని ప్రాంతాల్లో 'కుంట్లు' అంటారుట. ధాన్యం అప్పు వీాదయిచ్చే పెచ్చునుకూడా 'నాగాలు' 'నాగులు' అని వ్యవహరిస్తారు.

64. నానవాలు: అన్నం నగముడికి నగముడ కకపోయినది. 'మిడి' అనే విశేషణంకూడా తగి లిస్తారు. నామ్రాలు కాబోలు.

65. పంచపాళి: పసుపు, కుంకుమ, ఇత్యాది పూజాద్రవ్యాలుంచుకోవడానికి ఐదుగిన్నెల్ని ఒక్కచో చేర్చి తయారుచేయబడిన పాత్రావిశేషం. ఐదుగిన్నెలు లేకున్నా ఈపేరుతోనే పిలుస్తారు. గృహంలోని ఒక భాగానికీపేరు కొన్నిప్రాంతాలలో ఉంది.

66. పచ్చె: పెద్దముక్క. 'దోసకాయ పచ్చె'

67. పత్యాకం: 'త్యా' అనే అక్షరాన్ని 'తాటాకు'లోని 'టా' ఉచ్చరించినట్లుంది. మిక్కిలి పూర్తిగా, ఎల్లప్పుడు.

68. పబ్బలి: రెండుచేతులూ అడ్డంగా వక్షం మీాద ముడుచుకోవడం. నమస్కారమనికూడా అర్థం. 'పబ్బలి పట్టుచున్నాడు.'

69. పరము: మరీ సన్నగాలేని పొడి. సన్నగా చేయబడిన మాకలు.

70. పాజట్టు: పాలీడు గూళ్లు.

71. పానాది: పల్లెలోనికి ప్రవేశించేముందు పొలాల కిరువైపులా ముళ్లకంపవాటగా మధ్యనున్న పొడుగాటి దారి.

72. పాపోసులు: ఒక రకమైన బూట్ల లాటి పాదరక్షలు. 'పాయ్ పోష్' అనే ఫార్సీ మాట యొక్క అపభ్రంశమని శ్రీ సురవరం ప్రతాపరెడ్డి వ్రాశారు.

73. పాయిరము: పారాణి

74. పిట్ల: సెనగపిండి ఉడికించి అన్నం లోకి కూరగా చేయబడే ఒకానొక పాక విశేషం. కొన్ని ప్రాంతాలవారికి ఈ పేరలావుంచి అసలు వంటకమే తెలీదట.

75. పిస పిస: గుస గుస.

76. పీసు: లుబ్ధుడు అనే అర్థంలో వాడ తారు. 'పీసిడి' అనికూడా రూపాంతరం.

77. పెండె: ఇల్లు కప్పుట కుపయోగపడే చిన్నకట్టలు.

78. పొంకణాలు: ఉత్తర కుమార ప్రజ్ఞలు. బొతాలు, గప్పాలు. నిత్యబహువచనం. 'పొంకణము' అంటే 'పంచీ' అని శ. దీ.

79. పొంటి: నుండి, గుండా. (along) 'పక్క పొంటి నడువు' 'బజారు పొంటి పోతున్నాడు.'

80. పొతము: వేర్పు—పొదుపు. 'ఆమె, పనులన్నీ పొతంగా చేసుకుంటుంది.' పొతము అనే మాట పొట్లము అనే అర్థంగల 'పొట్టలీ' అనే సంస్కృత పదానికి వికృతి యని శ. దీ. దానికీ దీనికీ సంబంధం కనిపించదు.

81. పోకడ: గర్వం. 'పోకడ పోతే దస్త్రి కుదరదు' అని సామెత.

82. బంగువాయి: తూ గుటు య్యేల.

83. బద్ది: నింద. ఉర్దూలో 'చెడు' అనే అర్థంగల 'బద్' అనే మాట కీ మాటతో సంబంధముండి యుంటుంది.

84. బరడా: పప్పునూకతో లేక పిండితో అన్నంలోకి పొడిపొడిగా చేయబడే ఒక వంటకము.

85. బరువటించు: కందులు మున్నగునవి పప్పుగా విడిపోవునట్లుగా విసరుట.

86. బరుసు: గటుకు. నునుపుగా లేకుం డుట. ఈ నేల బరుసు బరుసున్నది.

87. బర్తం: బరితెము: పెరుగులో వంకా యలు మున్నగువానిని కలిపి తయారుచేయబడే ఒక దినుసు పచ్చడి.

88. బుడిసింతలు: అడ్డుగాచెప్పు పొకులు. కుంటిపొకులు.

89. బొడును: బోను: దెబ్బ తాకినప్పుడు వాపులు మున్నగుచోట్లలో ఏర్పడే 'బొప్పి'—'బొడును వచ్చినది' అంటే 'బొప్పి కట్టింది.'

90. బొత్త: కడుపు. (నిఘంటువులో ఈ అర్థంలేదు.) 'పటేలా పటేలా బొత్త సంకరుందీ అంటే అంబలి కారకుంటే చాలు' అన్నాట్ట.'— సామెత.

91. బోళ్లు: పాత్రలు. ఇంచుమించు నిత్య బహువచనం. ఇంచుమించు అని ఎందుకన్నానంటే 'బోకి—బొక్కు' అని ఊతపదంతో కలిపి 'పాత్ర సామగ్రి' అనే అర్థంలో ఏకవచనంలో ప్రయోగి ముంది.

92. మంజిరి[లి]పీట: కొబ్బరిని సన్నసన్న పాయలుగా చీల్చుటకు రంధ్రములుగా చేయబడిన ఇనుపపీట.

93. మడి: నాలుగుగట్లమధ్యఉండే సేద్యం చేయబడే భూభాగం. 'వరిమడి' 'కొత్తిమిరిమడి' మొదలగునవి. 'మాగాణి; కాలవ, చెరువు మొ. వాటి నీటితో సాగుచేసే నేల. ముఖ్యంగా వరిపంటకు ఉప యోగించే నేల, బావినీటితో సాగుచేసే నేలను ఒక ప్రాంతంలో మడి అంటారు' అని సాహిత్యఅకాడమీ వారి వృత్తిపదకోశం (పుట 18). వీరు చెప్పిన అర్థం అసమగ్రం. సిద్దిపేటతాలూకా ప్రాంతంలో మడి అంటే ఉన్న పై అర్థాన్ని కోశకర్తలు సంగ్ర హణ మొనర్పలేదు. చిన్నగానున్న మడిని 'దొయ్య' అని పిలుస్తారు.

బ్రాహ్మణాది జాతులవారు శుభ్రవస్త్రాన్ని 'మడి' అంటారు. 'పట్టుమడి', 'మంచిమడి' అని రెండు విధాలు. పట్టుబట్ట కట్టుకున్నది మొదటిది. తడిపంచమడి రెండవది. మరీ ఛాందసులైన ఆచార వంతులు 'రెండు పంచెలమడి' 'మూడు పంచెల మడి' అని కట్టుకుంటూవుంటారు.

94. మర్తమాను: జాజి.

95. మట్ట: అరచేయి వెనుకభాగము.

96. మనసాల: ఇంటిమధ్యన గల్గు వరండా.

97. మబ్బున: సూర్యోదయాత్పూర్వము Early in the morning.

98. మసుకు: సిరాతో అక్షరములు వ్రాయ నేర్పుటకు ప్రారంభంలోచేసే పూజాది ప్రక్రియ. ఇది 'మష్క్' అనే ఉర్దూపదానికి సమముకావాలి.

99. మారె: దీనికి ప్రత్యేకంగా అర్థం లేదు. ఇతరప్రాంతీయులు 'అబ్బే' అని వాడేచోట్లలో, తేలికగాతీసిపారవేయవలసిన విషయం చెప్పబోయే ముందు, కానివానిని గూర్చి చెప్పబోయేముందు ఈ 'పదం' వాడతారు. ఇది వాడడానికి ఒక నాటకీయ స్వరమూ, accent ఉన్నాయి.

"మారె! వాకువద్దు."

"మూరె! ఆయన వల్లకాదు."

100. మునుము: 1. వరుస, 2. కీలక స్థానము.

101. మెసులు: 1. మెలగు, 2. కదులు "అత్తవారింట్లో మంచిగా మెసులుకో అమ్మా!" "పాము మెసులుతున్నది". తిక్కపనులుచేసేవాణ్ణి "ఏమిరా! నెత్తిలో పురుగు మెసులుతున్నదా?" అని కోప్పడతారు.

102. మొగురము: స్తంభము.

103. యావ: ఒకేధ్యాస – తన్మయత – 'మాలోకం' – తెలుగులక్షణకర్తలందరూ తెలుగులో 'య'కారమాదిగాగల్గు అక్షరాలు లేవంటున్నారు. ఎందుకుండకూడదో మాత్రం చెప్పలేదు. ఈ పదం తెలంగాణాలో బహుళ ప్రచారంలోనేవుంది. దీన్ని 'ఏవ' అనిగాని 'ఆవ' అనిగాని సవరించదల్చు కుంటే వ్యవహారంలోఉన్న పై అర్థాలుకాక వేరర్థాలు వస్తాయి. అదీగాక 'యూట' 'యారాలు' 'యాస' ఇత్యాదిపదాలు యకారాదులుగానే ప్రచారంలో ఉన్నాయి వ్యాకర్తల సూత్రాల కనుకూలం గానే కాబోలు బహుశః – ఇవి నిఘంటువులలో ఏట, ఏరాలు, ఏస అని మారిపోయినాయి–తెలుగు దేశంలో 'యూవాపురం' 'యూమవరం' అని యకా రాది పేళ్లుగల గ్రామాలున్నాయి. తెలుగుమాటే అయితే అది 'ఏ' కావాలనీ, యకారమే అయితే అది సంస్కృతంమాటే కావాలనీ వాదించే వారుండ వచ్చు. అది వ్యాకరణ సూత్రాల ప్రభావం. యకా రాదిగ మాటలు తెలుగులో వుండవచ్చునడానికి పై 'యావ' అనే పదం ప్రతినిధిగా నిలుస్తుంది.

104. రిబ్బు: పూలు, కాయలు మున్నగు వానిని ఆకులు, కాడలూ వేరుచేసి శుభ్రం పరచుట. 'రిల్లు' అని రూపాంతరం.

105. రుద్దు: పలుపు. భృశార్థము. 'రుద్దు పులుపు' అని విశేషణంగాకూడా ప్రయోగముంది.

106. లాసిగ (లాజిగ): బిగ్గరగా (Loud 'లాసిగ మాట్లాడకు' 'ఒరేయ్! లాసిగ చదువు.'

107. వంత–వందురు: ఇవి రెండుదుఃఖము, దుఃఖించుట అని అర్థాల్లో ఉన్నా మెదకు మండలంలో వంపు, పల్లము (Slope) అనే అర్థంలో ఉపయోగంలో ఉన్నాయి. సా. ఎ. వారి మాండలిక వృత్తి పదకోశంలో వంత అంటే 'వానకురిసి పొలంలో పారే నీటి జాలు' అని వ్రాశారు. నీటి జాలు అనే అర్థం ఈ ప్రాంతంలో అసలు లేదు. ఎత్తువంపులు, ఎత్తువంతలు ఇత్యాదిగా Slope అర్థంలోనే ఉంది. 'వందురు' అంటే 'పొలంలో వాన నీళ్లు పారడంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం లేక గొయ్యి' అని మాం. వృ. కోశంలో వ్రాయ బడింది. 'పొలంలో' అవసరం లేదు 'వాననీళ్లు పారడంవల్ల' అక్కరలేదు. 'గొయ్యి' కానక్కర లేదు. 'రోడ్డు వందురుగా ఉన్నది' అని ప్రయోగం. 'ఒంత, ఒందురు' అనికూడా వాడతారు.

108. వంతన: ఆచారము. Tradition 'మా కిది వంతన లేదు' అంటే 'మా కిది అచ్చిరాదు' అని.

109. వకరు దిరుగు: కళమారు. రంగు మారు. 'జబ్బుపడి లేచినప్పటినుంచీ ఆమె ముఖం వకరు దిరిగిపోయింది' ('కళ తగ్గింది' అని).

110. వాయి: భాగము. 'ఒకవాయి పప్పుతో ఒకవాయి పెరుగుతో అన్నం తిన్నాడు.'

111. వాటుకాయ: అల్లరిచిల్లరగా తిరిగే వాడూ, మాట్లాడేవాడూ – 'వాటుకాయప్రసంగాలు', 'వాటుకాయ తిరుగుడు'.

112. వెలిసిపోవు – (బట్టల) రంగుపోవు. ఎలిసిపోవు అనికూడా వాడుక

113. వెలితె–వెల్తెదురు.

114. శాన: చాల–ఎక్కువ.

115. సంగడి: పెద్దరాయి. 'కూటోల్లరాయి తీయలేనివాడు ఏట్లో సంగడి తీస్తాడా' అని సామెత.

116. పరము: 1. గృహనిర్మాణంలో దూలాల క్రిందుగా, స్తంభాలపై ఆనించబడ్డ అడ్డకర్రలు— 2. పొర–'గొంతు పరానపడింది' అంటే 'పొర పోయింది' అని. తింటున్నప్పుడు లేక నీళ్ళు త్రాగుతున్నప్పుడు 'పరానపడితే' దూరానవున్న దగ్గరి బంధువులు జ్ఞాపకం చేసుకుంటున్నారని ఒక విశ్వాసం.

117. పితము: ఎక్కువ. 'జహీరాబాదులో జామపండ్లు పితం.'

118. పల్పు: వెడల్పాటిబండ–పలకరాయి.

119. పీటి: ఈల: ఉర్దూభవమేమో.

120. పొసపొడలుపోవు: ఆకలితో బాధపడు.

121. పొలుగు:—పోలు.

122. పొలుపుగడ్డ: శ్మశానము.

123. సోపతి: స్నేహము. 'సొహబత్' అనే ఉర్దూమాటనుండి వచ్చింది. 'సోపతి తాపిలి, తోవ నాశనం' సామెత.

124. సోపా: బడి.

ప్రస్తుతమునకు చాలును. నేను సేకరించిన పదాల్లో కొన్నింటిని మాత్రమే (విస్తరభీతిచే) చూపాను. పండితులు పరిశీలింతురని విశ్వాసము.



గ్రంథ విమర్శలు:

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం

(పంద్రెడవ సంపుటం; కడపటి రాజులయుగం; రచయిత: శ్రీ ఆరుద్ర; ఎం. శేషాచలం అండ్ కంపెనీ—మద్రాసు, మచిలీపట్నం, సికింద్రాబాదు; వెల — 7 రూపాయలు.)

సమగ్ర ఆంధ్ర సాహిత్యం పంద్రెండవ సంపుటము ప్రకటిస్తూ ప్రకాశకులు ఈ క్రిందివిధంగా అభ్యర్థనచేశారు.

. . . . . . . . . . . .

'పాఠకులకు మరొక్కమనవి. గత్యంతరంలేక సంపుటాల సంఖ్యను మధ్యలో డజనునుంచి డజనుం బాతిక్కకు పెంచినా, ఎలాగో కిందామీదాపడి కొంచెం అటూ ఇటూగా అనుకొన్న పుటలపరిమితిలోనే పదకొండు సంపుటాలను ప్రకటింపగలిగాం.

కాని ఈ పంద్రెడవ సంపుటం వచ్చేసరికి పెట్టుతప్పింది. ఈ యుగంలోని కవుల సంఖ్య తీరా కలం కాగితం పట్టి లెక్కగట్టేసరికి తెగపెరిగిపోయింది. ఆరుద్రగారు అనుకున్న అంచనా తప్పింది. ఎంత కుదించినా మామూలు మితిలోనికి యిమడలేదనీ, మరి కుదించడానికి వల్లకాదని, కాదుకూడదని కుదిస్తే పాఠకులకు వాగ్దానంచేసిన సమగ్రత దెబ్బతింటుందని ఆరుద్రగారు ఆత్మీయులుగా సలహా యిచ్చినందువల్ల విధిలేక ఈ సంపుటం పుటలు బాగా పెంచవలసివచ్చింది. ఫలితంగా ఈ సంపుటం ధరమ — మనము ఎంత పీకుతున్నా పెంచక తప్పింది కాదు ఈ పుటల పెరుగుదలకూడా, ఎటూ గాకుండా పరిమితిలోను ఇమడక ఇంకొక సంపుటానికి చాలనూ చాలకుండా ఇలా ఇబ్బంది తెచ్చింది.

సంగతి సందర్భాలు సాకల్యంగా ఎరుగజాలిన చదువరులు ఈ మా అసహాయతను అర్థంచేసుకొని, మాయందు అభిమానముంచి, ఈ వెల పెంపును మన్నించి వేరుగా భావించకుండా యథాప్రకారం ఆదరిస్తారని ఆశిస్తున్నాం ఆదరించమని అడుగుకొంటున్నాం.'

ఆదినుండి ఆధునికయుగంవరకు గల ఆంధ్ర సాహిత్యచరిత్రను సమగ్రంగా పన్నెండు సంపుటాలలో అందించవలెననే లక్ష్యంతో ప్రకాశకులు ఈ ఉద్యమం ప్రారంభించినా, పన్నెండవ సంపుటము వచ్చేసరికే రెండువందల సంవత్సరాల సాహిత్యచరిత్ర ఇంకా మిగిలియున్నందున వారనుకున్న లక్ష్యాన్ని సాధింపలేకపోయినారని పై అభ్యర్థన వ్యక్తముచేస్తున్నది. ఇంతేకాదు—అనుకొన్నవానికన్న మరిమూడు సంపుటములు—అధికంగా వెలువరించవలసిన 'అగత్యం' విధిగా ఏర్పడ్డది. పంద్రెండవ సంపుటం పుటలు విపరీతముగా పెరిగినవి. ప్రకాశకులకు విషమ పరిస్థితి తెచ్చిపెట్టినవి. ఇక రాబోయే సంపుటాల పుటల పరిమితి మన మూహింపవలసినదే గదా!

ప్రకాశకులు పదకొండు సంపుటాలైన వెనుక ఈనాడు తమ 'పరిస్థితిని' గుర్తించారుకాని యింత కించుమించుగా మూడేండ్ల క్రిందటనే దీనిని కనిపెట్టి వెల్లడించినాను.

ఈ సంపుటాలు అనవసరముగా పెరగడానికి కారణము ఇందలి చారిత్రకయుగవిభజనే అని, ఒక నిర్దిష్ట ప్రణాళిక లేనందువల్ల సాహిత్యము ప్రాధాన్యత వహింపవలసిన గ్రంథంలో, చరిత్ర ప్రాధాన్యత వహించినదనీ, విషయములు చర్వితచర్వణము లైనవనీ— మొదటి మూడు సంపుటములు సమీక్షిస్తూ యిట్లా వ్రాశాను.

'ఆదిమయుగం 95 పుటలలో 36 పుటలు రేనాటిచోళుల చరిత్ర, 14 పుటలు నాగభూమి, 13 పుటలు పట్టికలు పోతే 32 పుటలు మాత్రమే సాహిత్యానికి సంబంధించినవి. ఇక కవులచరిత్రలలో

నైనా కాలనిర్ణయ చర్చలు, వివాదాలు ఖండనమండనలు ప్రధాన స్థానం ఆక్రమించాయి.

.......................

'ఇదివరకే అచ్చులో అందరికీ అందుబాటులో ఉండే విషయాలను విమర్శించకుండా, యథాతథంగా గ్రహించడం జరిగింది. ఈ హేతువుచేత అనవసర మైన పెంపకం చాలా ఉన్నది. ఇంకా లోతుగా పరిశీలిస్తే ఈ 759 పుటలలోని సాహిత్యచరిత్ర 250 లేక 300 పుటలలో సంస్కారులకు సామాన్య ప్రజానీకానికి అనుగుణమైన రీతిగా సంగ్రహింపవచ్చును.'

(భారతి–ఆగస్టు–1965 పుటలు 92–100.)

తిరిగి 7 వ సంపుటం (మలిరాయలయుగం) విమర్శించేటప్పుడు– ఈ అనవసర పెంపకాన్ని గూర్చి హెచ్చరిక చేశాను. చిత్ర మేమంటే– ఈ ఏడవ సంపుటం వచ్చేవరకు గ్రంథకర్తలకు, ఆంధ్ర సాహిత్య సమగ్రస్వరూపదర్శనం కాలేదు. మొదటి సారిగా 'ఇతర కవులు' అను శీర్షిక చేర్పవలసి వచ్చింది. ఆ సందర్భంలో ఇట్లు వ్రాశాను.

'దీనినిబట్టి మలిరాయలయుగం వచ్చేవరకు ఎంతమంది కవు లాయా యుగాల్లో ఉన్నారో గ్రంథ కర్తలు తెలిసికోలేదనే చెప్పాలి. ఈ విషయ మొక్కటే ఈ గ్రంథరచనా ప్రణాళిక అస్తవ్యస్త మైనదని ఋజావు చేస్తుంది.

.......................

విశేషాలు విశేషంగాఉన్న కవులనుగూర్చి ఎంత వరకూ చెప్పాలి? ముఖ్యవిషయా లెలా సంగ్రహించాలి? తరపరంపరలుగా వస్తూన్న సాహిత్యవిమర్శక వ్యాఖ్యలను ఎట్టి విచక్షణతో గ్రహించాలి? అనే హంశాలు పూర్తిగా చర్చించుకొని ఒక నిర్దిష్టమైన ప్రణాళికను గ్రంథకర్త ఏర్పఱచుకోవలెను.

ప్రస్తుత గ్రంథకర్తలట్టి విధానాన్ని మొట్ట మొదటినుంచి అవలంబించినట్లు కన్పట్టదు. అట్టి సక్రమపద్ధతిని సాహితీపరిణామదృష్ట్యా యుగవిభజన చేసి రచన సాగించినట్లయితే ఈ రచన–'అతి వ్యాప్తి', 'అవ్యాప్తి' దోషానికి పాల్పడకుండా ఉండేది.[1]

(భారతి–డిసెంబరు 1965 పుటలు–59.)

ఆంధ్రవాఙ్మయచరిత్రకారుల కిదివఱకు సుపరిచితముగాక క్రొత్తగా, చారిత్రకయుగవిభజన చేయుడంవల్ల–వాని వివరణకు ప్రతి సంపుటమునకు, పదహారు పుటలు కావలసివచ్చినవి. పన్నెండవ సంపుటంలో మూడాలుగా విభజించడంవల్ల వాని వివరణకు కొన్ని పుటలు అవశ్యకమైనవి. దీనిచేత –250 పుటలు–ఒక సాహిత్యయుగ సంపుటమునకు చాలినవి–వ్యర్థమైనవి. ఈ చారిత్రకయుగ విభజనవల్ల కలిగిన ఇంకో అనర్థకం ఉన్నది. వాఙ్మయ చరిత్రలో ప్రచుర ప్రచారమునఉన్న–శివకవియుగము–కృష్ణరాయ యుగము — దక్షిణాంధ్ర యుగము–మున్నగువాని ప్రత్యేక విశిష్టత మృగ్యమైనది. ముఖ్యంగా, ఏకా కారంగా ఆంధ్రేతరప్రాంతంలో వర్ధిల్లి ఆంధ్రు లందఱూ గర్వింపదగిన దక్షిణాంధ్ర వాఙ్మయ స్వరూపం–అభివ్యక్తము కాకపోయినది. అనుశ్రుతంగా వస్తూన్న రాజులయొక్క–కవులయొక్క సాహిత్య సంబంధం విడ్డూరమైనది. పద్మనాయకయుగంలో ఎఱ్ఱన–గజపతులయుగంలో జక్కన పోతనలు, నవాబుల యుగంలో రామకృష్ణకవి పింగళి సూరన ఉదాహరణలు. ఈ రీతిగానే–అమస్తూతంగా నడిచిన స్వదేశ సంస్థానాల సాహిత్యచరిత్ర అటూ ఇటూ అయినది.

గ్రంథకర్తలు, ఆయాకవులను గూర్చి వ్రాసే టప్పుడు ఒక క్రమపద్ధతి ననుసరింపలేదేమోఅని అని పిస్తున్నది. తెలిసిన కవులనుగూర్చి విశేషంగాను, తెలియవలసిన కవులనుగూర్చి సశేషంగాను వ్రాశారు. చూడండి–నన్నయ –38, భీమకవి–30, తిక్కన–84, ఎఱ్ఱన–54, నా. సోమన 28, శ్రీనాథుడు 132, పోతన–64, కృష్ణరాయలు–72, తెనాలి రామకృష్ణ డు–54, పింగళిసూరన–42, రఘునాథ నాయకుడు–44, విజయరాఘవనాయకుడు–

---

1. స్థలసంకోచంచేత ముఖ్యాంశా లుదాహరించాను. వివరాలకు ఆ వ్యాసములు రెండూ పూర్తిగా చదువవలసినదే.

31—ఇత్యాదిగా[2] 16 గురు కవుల చరిత్రలు 791 పుట లాక్రమించినవి. విశేషంగా తెలియవలసిన పాల్కురికి సోమనాథుడు, పిడుపర్తి సోమనాథుడు, ప్రౌఢకవి మల్లన—ఎడపాటి ఎ ర—వారన సూరన—పుల్లేటి రామభద్రుడు—హరిభట్టు—భానుకవి—పచ్చ కప్పురపు తిరువెంగళకవి—భాస్కరాచార్యుడు— నాగులూటి శేషనాథుడు మొదలగువారినిగూర్చి చెప్ప వలసిన సాహిత్యవిషయాలు లేనేలేవు. ఇందువల్ల ప్రాచీనసాహిత్యక్రమపరిణామవికాసాలను గ్రహించుటకు గాని, సాధికారమైన సాహితీ విమర్శన వెలువ రించడానికిగాని అవకాశ మేమాత్రము లేకుండా పోయినది.

సాహిత్యచరిత్రరచనలో విషయ సేకరణతో పాటు, విశ్లిష్ట విషయ విచారణ—సంగ్రహణ ఉన్న ట్లయితే—అది గ్రంథవిశిష్టతను పెంపొందించును.

ప్రస్తుత గ్రంథకర్తలు చారిత్రకముగాకాక, ముందు నేను నిరూపించినట్లుగా, కవుల ననుస రించి యుగవిభజనముచేసి వారి చరిత్రలను ఒక క్రమపద్ధతిని వ్రాసినట్లయితే, ఈనాడు వెలువ రించిన పన్నెండు సంపుటాలలోని విషయాలు— సాహిత్య చరిత్ర—అంతా ఎనిమిది లేక తొమ్మిది సంపుటములలో ఇమిడియుండేది.

చారిత్రకయుగ విభజన వలన, హెచ్చయిన పుటలు—1 సం.
కవులనుగూర్చి హెచ్చుగా వ్రాసిన పుటలు—3 సం.
మొత్తము 4 సంపుటములైనవి. 4

ఈ పన్నెండు సంపుటముల వాఙ్మయ చరిత్ర క్రీ. శ. 1750 వఱకు వచ్చినది. ఇందులో పై నాలుగు సంపుటములు తీసివేసిన 8 సంపుట ములు మిగులును. ఇదివరకు వ్రాసిన కవుల చరిత్ర తిరిగి వ్రాసినాను. అది 1 సంపుటమైన—అప్పుడు క్రీ. శ. 1750 కి—9 సంపుటము లగును. శేషించిన వాఙ్మయచరిత్ర వ్రాయుటకింకను 3 సంపుటములు సరిపోవునుగదా!

పన్నెండు సంపుటములలో ఇమిడిన విషయాలు తొమ్మిది సంపుటములలో ఇముడగలవా? అని ప్రశ్న రావచ్చును. ఆ ప్రశ్నకు ఇముడగలవని నా జవాబు.

ఇక ఇందు విడిచిన విషయాలు కొన్ని:—

### వేమన

వేమనమగూర్చి ప్రారంభంలో గ్రంథకర్తలు 'వేమనగారిని నిన్నటిదాకాసాహిత్యచరిత్రకారులు మహా కవిగా పరిగణింపకపోవడం అటుంచి కవిగా కూడా జమ కట్టుకోలేదు. పండితుల దృష్టిలోలాగే పామరుల దృష్టిలో కూడా వేమనగారు కవులు కారు' అన్నారు. అసలు ఒక కృతికర్త కవిగా పరిగణితుడు కావడానికి, పామరులు కూడా, అతనిని కవిగా పరిగణింపవలెనన్న మాట! - అది యట్లుండనిండు. ఆ వెనుక — 'వేమన గారిని కవిగా గుర్తించినవారు ఆధునికులే' అని కొమఱ్ఱాజువారిమండి రాళ్లపల్లివారివఱకు విమర్శకుల నుదాహరించారు. కాని వేమనను కవిగా గుర్తించినది ఆధునికు లెంతమాత్రమునుగాదు—పూర్వులే.

కొమఱ్ఱాజువారి పుట్టుకకు అర్ధశతాబ్ది పూర్వమే బ్రౌనుదొరగారు, వేమనను కవిగా గుర్తించి వేమన పద్యాలను భాషాంతరీకరించి పాశ్చాత్య ప్రపంచమున కాతని పరిచయముచేసినారు. వారికి ముందు తెలుగు కవులు వేమనను కవిగా కీర్తించారు— చూడండి.

### నిమ్మల లక్షణకవి

ఈతడు తన ఏకామ్రలింగశతకంలో — 'భీమ వేమానంత బిరుదుకవుల' అని 'వేమన'ను పేర్కొ న్నాడు. ఈతనినిగూర్చి ఈసంపుటంలో 313, 314 పుటలలో ఉన్నది. ఈతని కాలము క్రీ. శ. 1680 ప్రాంతము.

### పింగళి ఎల్లనార్యుడు

తోభ్యచరిత్రమను నీతని కృతియందు వేమన ప్రశంస యున్నది.

---

2. విస్తరభీతిని వివరము లీయలేదు.

సూచన: యిప్పటివఱకు పన్నెండు సంపుటాలైనా, ఈ సంపుటాల్లోఉన్న కవుల అకారాది సూచిక లేదు. 12 వ సంపుటములో మాత్రమున్నది. 11 వ సంపుటములో మొదటినుండి అంతవఱకున్న కవుల సూచికయున్న కొంతవఱకు బాగుగ నుండెడిది — ముందు వెలువరింతురుగాక.

'చెలఁగి యథావాక్యముల నన్నమయగారి
భజియించి మ్రొక్కితి పాలకురికి
సోమన్నగారిఁ బ్రస్తుతిచేసి ప్రియమంది
శివదేవ ముఖ్య నవకవుల నెంచి
గణపతిదేవుని ఘనత సన్నుతిజేసి
'వేమన' కీర్తించి'

పింగళి ఎల్లనార్యుడు వీరేశలింగముగారి కవుల చరిత్ర 3 వ భాగములోఉన్నా ఈ సంపుటంలో చేర లేదు. ఇతడు దామెర వెంకటపతి కాలమువాడు.

తురగా రాజకవి అయ్యంకి బాలసరస్వతి – వీరి నాగరఖండ కవి స్తుతిలో

'శివతత్త్వ శివదేవు చిన్మయుభవదూరు
శరభాంక రాజశేఖరుని వేము'[3]

వీరు క్రీ. శ. 1586 లో నున్నారు. పై పాదమున్న పద్యాన్ని పూర్తిగా వీరి చరిత్రలో గ్రంథ కర్త ఉదాహరించారు.[4] 'వటమూలుడు వేముడు మొదలైన కొంతమందిని తొలిసారిగా ఈ జంటకవులే స్తుతించారు' (పుట 164) అని వ్రాశారు.

ఎడపాటి ఎఱ్ఱన తన మల్హణ చరిత్రలో కవి స్తుతి నిట్లు చేసి యున్నాడు.

'వినుతు లొనర్తు నాంధ్రసుక
వి ప్రభు నన్నయభట్టు తిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని
జక్కన నాచనసోము సర్వదే
వుని భవదూరు వేము నల
పోతన పిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి
ధూర్జటి కేతన భట్టబాణునిన్.'

ఇందు వేముడు వేమనయే. ఎఱ్ఱన కృష్ణరాయలనాటి వాడు.[5] ప్రస్తుత గ్రంథకర్తలే పై కవులను గూర్చి తమ గ్రంథములో వ్రాసియున్నారు. కాబట్టి ఈ స్తుతులు 'వేమన' కవిని గూర్చినవి యనుట నిశ్చయము. అప్పుడు 'ఆధునికులే వేమనను కవిగా గుర్తించారు' అనుట ఎట్లు?

పై ఎఱ్ఱన కవి స్తుతిని పురస్కరించుకొని శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు ఎట్లు వ్రాసిరో చూడుడు.[6]

'మఱియు ఎఱ్ఱాప్రెగ్గడవంటి విద్వత్కవులు వేమన్నను కవియని పొగడిరనుకొనుట సాహసము'. వేమనను స్తుతించిన కవి ఎడపాటి ఎఱ్ఱన. భారత కవి త్రయములోని ఎఱ్ఱాప్రెగ్గడగా భ్రాంతిపడి వ్రాసిన పై వాక్యమెంత ప్రామాణికమో విమర్శకులు తెలుపుదురుగాక.

వేమనకాలము క్రీ. శ. 1652–1725 అన్న బ్రౌనుదొరవారి వాక్యాన్ని గ్రంథకర్త ఉదాహరించారు (పుట 67). అయితే బ్రౌనుదొరవారే, వేమన తమ కాలానికి అనగా–క్రీ. శ. 1850 ప్రాంతాలకు నాలుగువందల యేండ్లు ముందువాడని, వేమన పద్యాల ఆంగ్లభాషాంతరీకరణ ద్వితీయముద్రణ పీఠికలో నిర్ణయించి తాను మొదట వ్రాసిన దానిని సరిదిద్దుకొన్నారు. ఎంత మహానుభావుడు![7] దీనినిబట్టి వేమన కాలము క్రీ.శ. 1450 అని నిశ్చితము. ఇతరాధారము వలన అది ధ్రువపడుచున్నది. అయితేనేమి మనకు ప్రాచీనులు ప్రామాణికులు కారుగదా!

## పుష్పగిరి తిమ్మన

పుట 344. సుభాషిత శతకాల అనువాదాలను గూర్చి యిచ్చిన పట్టికలో '2. పుష్పగిరి తిమ్మన్న ఒక్కనీతిశతకమే అనువదించాడు.' అని కలదు. కాని తిమ్మన నీతిశతకాన్నేగాక తక్కిన శృంగార వైరాగ్య శతకాలను తెలిగించాడు. కాని అవి వెలుగుచూడలేదు. అముద్రితంగా ఉన్నదానినుండి కొన్ని పద్యము లుదాహరిస్తున్నాను.

---

3. పై పద్యాన్ని గ్రంథకర్తలు– స. ఆ. సా 2 వ సంపుటం 32 వ పుటలో ఉదాహరించారు.

4. స. ఆ. సా. 9 సం. పుటలు 160–164.

5. స.ఆ.సా. 7 సం. పుట 126. వివరములు లేవు.

6. పుట 48. వేమన–ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రకటితము.

7. Vemana-Major R. M. Macdonald-Madras Journal of Literature& Science Vol. 28. 1864-66, Third series. Part II Pages 48-62.

## శృంగారశతకము

'హరిచరాంకధీవరుఁ డ
వారణశ్రీ బడిశం బహార సం
హారపయోధినైచి రథ
సంబున దన్మధురాధరామిష
హార విహార చారి పురు
షార్యఝుషావళిఁబట్టి పట్టి దు
ర్వార విమోహ వహ్ని నిడి
వండుచు నుండఁ దొడంగు చెప్పుడున్.'

'గురుకుచదుర్గదుర్గ మ
కుంఠితబాహులతాపరీతమున్
ఖరనఖరోగ్రకంటక వి
కారము కంజముఖీతమావనాం
తరము హరంగఁబోకుము మ
నఃపథికోత్తమ! యందుఁ ద్రిమ్మరున్
మరుఁడను తస్కరుండు ధృతి
మాన వివేక ధనాపహారియై.'

'గానముచేఁ జెవుల్ నటనఁ
గన్నులు వాతెఱఁ గ్రోల వాల్కయున్
దాని సువాసనం బొరపి
వాసయుఁ జన్గవలంటిదేహమున్
హీనతఁ జెందె మే లరయ
కే పరమార్థముగాన కైదిటన్
దానను వంచితుఁడనయి
తత్తరమంది పరిభ్రమించెదన్.'

'మంచి కులంబునం బొడమి
మానవివేకము గాంచువాడు గు
ణించకయెట్టు గ్రోలు వెల
చేడియ వాతెఱ రమ్యమైనచోఁ
గ్రించులు ద్రుచ్చులున్ నటులు
గేరి విటుల్ భటులున్ గులాములున్
గొంచక విచ్చ నుమ్మియుట
కున్ దగు నెంగిలి బోరయఁగాఁగదా'

## వైరాగ్యశతకము

'శరదిందు స్ఫుట చంద్రికా ధవళితాం
చ ద్ద్యోధునీ సైకతాం
తర సీమ న్నివసించి సద్గుణగిరి సం
తన్ రాత్రులన్ సంస్మృతి
స్ఫురణోద్విగ్నులమై 'మహేశ శివ శం
భో' యంచుఁ దద్ధ్యాన త
త్పరతన్ మేమెపు డుందుమో కనుగవన్
బాష్పాంబువుల్ జాలఁగన్
పరచిత్తంబులకున్ ప్రసాదమెసఁగిం
పం బూని సీవేల స
ల్మఱు సంతాపముఁ జెందెదో మనస! శా
ల్యంబౌఁచి నీవే ప్రస
ద రమం జెందితివేని స్వోజ్జ్వలిత చిం
తారత్నసంతాన భా
గ్యరుసంకల్పవివిక్తతన్ వెలయఁ
గోర్కుల్ దామె చేకూరెడిన్.

## అడిదము సూరకవి

'అధికుఁడౌనుగాదె యడిదము సూరన్న
వియమ శూరుఁ డసమవిష్ణుచేత' అని కొక్కొండవారు సూరకవిని ప్రశంసించారు. అయితే సూరకవి చరిత్ర 5 పుటలలోను—సూరకవి 'చెఱువు పీఠి పద్యములు' అనే శీర్షిక లేకపోవుట చిత్రముగా నున్నది. వీనిని మొదట గురజాడవారు గ్రంథస్థం చేశారు[8]. వీరేశలింగంగారు అనుసరించారు[9]. సంగూరి వారు వాడుకొన్నారు—ఆ సందర్భమిది.

8. గురజాడ శ్రీరామమూర్తిగారు 1893లో సూరకవి చరిత్ర వ్రాశారు. దానితోపాటు కూచిమంచి తిమ్మకవి జగ్గకవి ఏనుగు లక్ష్మణకవి—వీరి చరిత్ర వ్రాశారు. ముద్రించారు కూడా. అయితే అవి వారివా రచ్చువేసిన కవి జీవితములలో కెక్కలేదు.

9. మొట్టమొదట అడిదము సూరకవి గ్రంథముల నన్నింటిని ఒకే సంపుటముగా అచ్చువేసిన కీర్తి వీరేశలింగం గారిదే. (అడిదము సూరకవి కృతులు. చింతామణీ ముద్రాక్షరశాల 1898.)

అడిదమువారి భూములు (విజయనగరాధీశు లిచ్చినవి) ఒక చెఱువు క్రింద నుండేవి. ఆ చెఱువు నిండినప్పుడు పై నీరు పారి, అడిదమువారి భూముల కు నష్టము కలిగిస్తుంది. ఒకమారా చెఱువు నిండింది. ఇక అడిదమువారి భూములలోకి వస్తుంది. సూరకవి, ఆ చెఱువు కధికారియైన దంతులూరి అన్నమరాజును గట్టు కొట్టించి నీ రవతలికి పోయేటట్టు చెయ్యమన్నాడు. కాని అతడు వినిపించుకోలేదు. ఇక పుట్టి మునుగుతుందని సూరకవి తెల్లవారుఝామున స్నానముచేసి తడిబట్టతో చెఱువునీటి మధ్యమున నిలబడి తాటాకుమీద గంటముతో—

'కదలు మిటమావి దివిజ గంగాభవాని'

అనే గీతమకుటంగల సీసపద్యాన్ని వ్రాసి ఆ తాటాకును తూర్పు గట్టువైపు వేశాడు వెంటనే గట్టు తెగి నీరు పారింది—అట్లే తక్కిన మూడు దిక్కుల మూడు సీసపద్యాలు అదే మకుటంతో వ్రాసి పడవేయగా, ఆ చెఱువులో నీరు నిశ్శేషమైంది. రెండు పద్యా లుదహరిస్తున్నాను.

'బ్రహ్మాండ భాండ సంపత్తి కుత్పత్తిగల్గు
పద్మనాభుని పదాబ్జమునఁ బుట్టి
సకలరత్నాకరస్థానమై యుప్పొంగు
నంబుధీశుని చరణంబుఁ ద్రొక్కి
పరమ తత్త్వజ్ఞుఁడై పరగు శంతను మహీ
రమణు వామాంకభాగమునఁ జేరి
అఖిల లోకాధ్యక్షుఁడై మించి విహరించు
శివుజటాజూటాగ్ర సీమ నిలిచి
తనరు నీవంటి ధన్య కుత్తముఁగాదు
పూసపాటి మహాస్థాన భూమియందు
కాలుఁ ద్రొక్కంగవోడు చండాలుఁడైన
కదలు మిటమావి దివిజ గంగాభవాని
'కృతకాద్రులాయెనా కీలోగ్రఫణిఫణా
నేక ఘూత్కార వల్మీక చయము
విరిదోట లాయెనా కలుకు కంటకకంట
కాంకుర విస్ఫురితాగరాశి
పువుబాన్పులాయెనా నవమంజులశ్వేత
లవణాలవాలయౌ చవుటినేల
బొమ్మరిండ్లాయెనా భూరి భేకాండజా
ధారమై తనరు కేదార భూమి
నీకు నివసింప వసతులై నివ్వటిల్లె
చిన్నిపాలములు బ్రాహ్మణక్షేత్రములను
ఘాతుకత్వంబు పేయు ముష్కరులుగలరె
కదలు మిటమావి దివిజ గంగాభవాని.'

తక్కిన రెండును గ్రంథ విస్తర భీతిచేత వ్రాయలేదు.

ఈ పద్యాలు యావదాంధ్రదేశంలో సూరకవివి గానే చిరకాలంగా వ్యాప్తమై యున్నవి. క్రీ. శ. 1913 లో అడిదము రామారావుగారు, తమవంశమునకు సంబంధించిన దానపట్టాలు, పారీఖత్తులు పరిశీలించి, ఈ పద్యములు సూరకవి సోదరుడైన రామకవివని నిర్ధారణ చేశారు. వీరేశలింగముగారు జయంతి రామయ్యగారు ఆమోదించారు.

సూరకవివలె రామకవి శాపానుగ్రహ సమర్థుడు—అందుచేతనే—

'సూరకవి తిట్టుకంపాలి సుత్తిపెట్టు' అయితే 'రామకవిదెబ్బ పెద్ద ఫిరంగిదెబ్బ' అయినది.

రామకవి పై పద్యాలనేకాక 'బుర్రా బుచ్చన మంత్రి శతకాన్ని రచించినాడు—

సూరకవి వేషం—విలక్షణంగా ఉండేది అతడు మొగలాయి వేషాన్ని ధరించేవాడు. అతని శూరత్వము తెలుపడానికి, మొలలో ఒక బాకు ఉండేది. సూరకవి ధరించిన బాకు ప్రతిబింబము సూరకవి జీవిత చరిత్ర ప్రథమ ముద్రణలో నున్నది.

అడిదము సూరకవి రామకవులే కాక, ఆకాలంలో కళింగదేశంలో చాలామంది కవులుండేవారు. వారిలో కొందరు

### 1. పోడూరి పెదరామకవి

ఈతడు 'శివరామాభ్యుదయము' అనే ద్వ్యర్థి కావ్యాన్ని రచించాడు, చాలా ప్రసిద్ధుడు—

### 2. వేంకటకవి

కార్తికమాహాత్మ్యము అను మూడాశ్వాసముల ప్రబంధము—రచించిన ఈతడు, పెదవిజయరామ గజపతి కాలమున నున్నవాడు.

### 3. అండలూరి మల్లికార్జునకవి

'ముక్తి చింతామణి' అను మూడాశ్వాసముల వేదాంత ప్రబంధమును రచించిన కవి. పాణుగుపాటి వెంకటమంత్రి మంత్రిగానున్న ముఖీ కాశీపతిరావుగారి వలన సమ్మానితుడు. విశాఖజిల్లా శృంగవరపుకోట తాలూకా అప్పమపేట నివాసి. ఇది క్రీ.శ. 1884 లో విశాఖపట్టణమున - ముద్రితము. వ్రాతప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తునందున్నది.

### 4. ప్రయాగ కామేశ్వరకవి

'గోపాల లీలాసుధా లహరి' అనుమూడాశ్వాసముల శృంగార ప్రబంధమును, 'భద్రాచలధామా రామ వీల జలదశ్యామా' అను కందపద్య శతకమును రచించిన కవి. రెండు నముద్రితములే—మొదటిదాని పూర్తిపేరు

'గోపికాజనముక్తవస్త్రాపహరణ

బాలగోపాలలీలాసుధాలహరి'

### 5. ప్రయాగ వెంకటాద్రికవి

పై పద్య ప్రబంధమునకు మూలమగు 'గోపికాంశుకాపహారము' అను ద్విపదకృతిని రచించిన వెంకటాద్రికవి గొప్ప సంస్కృత పండితుడు. ఈతడు 'విద్మన్ముఖభూషణము' అనే వేదాంత గ్రంథాన్ని సంస్కృతములో వ్రాసి ఢిల్లీశ్వరునిచే పచ్చలపల్లకి బహుమతిగొన్నవాడు.

### 6. వేల్పూరి వెన్నన్న

ఔరంగజేబుపాదుషా కాశీపై దండెత్తి, అందలి విశ్వేశ్వరాలయాదులను మసీదులనుగా మార్చు సందర్భమున - విజయనగరంతాలూకా వెల్లూరి గ్రామవాసి వేల్పూరి వెన్నన్నకవి 73 పద్యములలో, విశ్వేశ్వరుని ఆ బాధ తప్పింపుమని వేడుకొన్నాడు. ఆ వెనుక, చాలా కాలమునకు అతని మునిమనుమడు పాంబశివకవి—దానిని పూర్తిచేసియున్నాడు ఇది సింహాద్రి నారసింహశతకం, శత్రుసంహారశతకం కోవలోనిది. కడపటి మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు పేరు తెలుగు సాహిత్యంలో శాశ్వతంచేసిన దీ శతకము.

'విజితపరయూథ ! కాశికావిశ్వనాథ' అని దీని మకుటము. ఇది ముద్రితము. అన్యదేశ్యాలిందు చాలా ప్రయుక్తమైనవి.

### 7. భద్రా పరిణయము

కొళ్ళకూరి లక్ష్మమ్మవతి. ధర్మనందనవిలాప కృతికర్తయగు కొళ్ళకూరి గౌరికాంతకవి వంశకర్త.

### 8. గరికపాటి తమ్మయ్య

సిరియాళ చరిత్ర ప్రత్యేక పద్యకావ్యముగా వ్రాసిన మొదటికవి. సూరనకు సమకాలికుడు.

### 9. పురిజాల లక్ష్మీనారాయణ

'పారిజాతము' అను యక్షగానమును రచించినకవి అడిదము సూరన సమకాలికుడు.

వీరుగాక, ఇతరప్రాంతములనున్న కొంతమంది కవులను గూర్చి తెలుపుదును.

### 10. మోచర్ల వెంకన్నకవి

కవితపుట్టిల్లు వెన్నెలకంటియిల్లు

వచ్చిచొచ్చెను మోచర్లవారియిల్లు

అని వాడుక. వెంకన్నకవి, సోదరుడు దత్తప్ప సమస్యా పూరణమున ప్రసిద్ధులు. 'సమస్యలు' అను పేరితో అచ్చుపడినవన్నీ వీరి కృతులే. వెంకన్నకవి తెట్టు సంస్థానాధిపతియైన వేజెళ్ల కృష్ణమరాజా ఆస్థాని. తెట్టునుగూర్చి అతడు చెప్పిన పద్యం—

'తెట్టు కుమార కృష్ణజగ
తీ వరనందన రాజ్యలక్ష్మికిం
బట్టు, ధరాంగనారమణి
పాపట బొట్టు, రిపూరగాళి వా
కట్టు, సముజ్జ్వలద్ద్యుతికి
గట్టు, బుధాళికి వేల్పు జెట్టు, వాక్
దిట్టల కుక్కి పట్టగు మ
దీయ నివాసము యాచభూపతీ.'

విద్వత్కుమార యాచేంద్రుడని ప్రసిద్ధికన్న రంగారావు సమక్షమున — వెంకనకవి షకారాది ఏకాక్షరముగ నొక కందపద్య శతకము నాశువుగా జెప్పెను. అందువాల్గు పద్యములు మాత్రమే లభించినవి.

### 11. కొండమడుగు పురుషోత్తమకవి

ఋగ్వేదికవి వెంకటాచలకవి దామెర అక్క నృపాలువిసభలో కవిరాజకేసరియై. ఒక కవి గంధసింధురమును విదళించి యున్నాడు. ఆ కవిగంధసింధురమే-ఈ పురుషోత్తమకవి. 'పుల్లకవి' అని నామాంతరము. ఇతడు కన్యకాపురాణమను ద్విపద కావ్యమును, సానందోపాఖ్యానము అను పద్యకావ్యమును రచియించి యున్నాడు. పద్యకావ్యగద్యలో కొండమడుగన్వయ ... పురుషోత్తమకవి గంధసింధుర ప్రణీతంబైన సానందగణేశ్వరము...అని కలదు. ఈ రెండును అముద్రితాలు.

### 12. పోలుమంచి బసవన

హనుమద్విజయమను నామాంతరముగల మైరావణ చరిత్ర ద్విపద కావ్యమున రచించినవి. క్రీ. శ. 1740 కి పూర్వుడు.

### 13. నాగనారాధ్యుడు

'నాగరాజు' అని, 'వాగేశ్వరకవి' అని 'నాగనారాధ్యుడని' వ్యవహృతుడై, 'గణసౌజవ్యాఖ్యానశతకము' 'సిద్ధాంత శిఖామణి' అను ద్విపదకృతి, 'బసవ విజయము' అని వేరొక ద్విపదకృతి రచించిన నాగన వల్లగొండ నివాసి. ఇతని కృతులన్నియు శైవసంబంధములే—

క్రీ. శ. 1650 ప్రాంతము.

### 14. తక్కెళ్లపాటి లింగన

ఇతడు మదనమోహినీవిలాసము, సూర్యతనయాపరిణయము, ఉత్తరహరిశ్చంద్రకథ అను ప్రబంధములను, విద్యుత్ప్రభావిలాసము అను యక్షగానమును రచించిన కవి.

### 15. హర్యపరాజు రంగశాయి

అంబరీషోపాఖ్యానము, శివమృగయావిలాసము. అను రెండు ప్రబంధములకు కర్త.

### ఇంకా కొంతమంది కవులు – ప్రబంధములు

16. అనఘము రామచంద్రకవి–షట్చక్రవర్తి చరిత్ర 17. ఎలగుడిపాటి వెంకటాచలకవి – విష్ణుమాయావిలాసము 18. గుడారు వెంకటదాసకవి–ప్రకృష్టబలరామచరిత్ర 19. బేతపూడి కృష్ణయ్య–జానకీరాఘవము 20. సింగరాజు నాగభూషణకవి–గౌరీకల్యాణము 21. వల్లూరి నరసింహకవి – వాగ్నజిత్రీపరిణయము 22. రామావఝ్ఝల కొండుభట్టు–కపిల గోసంవాదము 23 కామమూరి కృష్ణావధాని–ఇందుమతీపరిణయము 24. పొడూరి వెంకటదాసకవి – సుకుమారీపరిణయము 25. పెమ్మల్లి బాపయ – సీతావిజయము, 26. తువగాల నీలయ నీలకుంతలావిలాసము 27. బసవరాజు నాగేంద్రకవి–ఆనందసుందరీచాతుర్యశీలావిలాసము 28. చిత్రకకవి రామాచార్యులు–చంపూరామాయణము 29 శివరాజు నర్సన్న–శేషధర్మములు 30. అమృతకవి త్రిపురారి–ఐరావతచరిత్ర 31. గోటేటి సూరన–కృష్ణాభ్యుదయము 32. ఎడపల్లి వెంకటకవి–రాధామాధవసమాగమము 33. చెమ్మూరి శోభనాద్రి–శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము 34. బచ్చు సిద్ధకవి – శేషధర్మములు 35. శేషము చెన్నుభట్టు–కులశేఖరమహీపాలచరిత్ర 36. మేడూరి రిప్పన్న వరుణజా కుంభేశ్వరచరిత్ర.

### కవులు - ద్విపదలు

37. వాదిండ్ల ఉమ్మయ–మాయా చిదానంద మంజరి 38. నంజ ఓబలయ్య – కపోతవాక్యము 39. వింటి ఔబళకవి–శివరహస్యఖండము 40. కాచన–మైరావణచరిత్ర 41. కొండయ–విక్రమార్కచరిత్ర 42. రావులపురము గురువయ్య–సురభాండేశ్వరము 43. పువ్వా గోపాలకవి–అనంతవ్రతకథ 44. గద్దె చంద్రశేఖరకవి–ఉత్తర హరిశ్చంద్రకథ 45. చంద్రశేఖరకవి–భానుకల్యాణము 46. చంద్రశేఖరకవి వెన్నెకంటి–హరిశ్చంద్రచరిత్ర 47. శేషము చెన్న భట్టారకుడు-అభిమన్యు కల్యాణము 48. పులవి భావజ్ఞుడు–పరశురామాయణము 49. భాస్కరార్యుడు –వైశ్యపురాణము 50. రామారి వెంకటలింగము–ప్రబోధచంద్రోదయము 51. శ్లేష్మలూరి వెంకటార్యుడు–శ్రీనివాసవిలాససేవధి.

### కవులు – శాస్త్రగ్రంథములు

52. ఇర్లపాటి పేరయ-నవనాథసిద్ధప్రదీపిక టీక వైద్యసారము 53. అరుణాచలకవి–వైద్యసారము

54. అన్నయమంత్రి-సాముద్రికము 55. సోరయ మంత్రి-సహదేవపక్షువైద్యము 56. పేరుసోముల గణపయ-హస్తశాస్త్రసంగ్రహము 57. గీతగోవిందము —బుగ్వేది వెంకటనారాయణకవి 58. వేదయ—ఆయుర్వేదార్థసంగ్రహము 59. దేవులపల్లి చినవరదన్న—ఆంధ్రచింతామణి 60. తుళ్లూరి శరభరాజకవి—శరభరాజీయము.

వ్యాసము పెరుగునను భీతిచేత పై గ్రంథముల కాకరములుగాని గ్రంథకర్తలనుగూర్చిన యితర విషయములనుగాని తెలుపలేదు. పాఠకలోకమును మన్నింపగోరుచున్నాము.

—శ్రీ నిడుదవోలు వెంకటరావు.

## ఛందోదర్పణ తత్త్వదర్శినీ

[ప్రాప్తిస్థానము : శ్రీ వేం. న. భాష్యకారాచార్యులుగారు. ప్రధానాంధ్రోపన్యాసకులు. ప్రభుత్వ మహారాజా సంస్కృత కళాశాల, విజయనగరము-2. మూల్యము : 10-00. పుటలు : 1/8 డెమ్మి 114+384.]

తెలుగు లక్షణ గ్రంథములను సంస్కరించి వ్యాఖ్యానములతో ప్రకటింపవలసిన ఆవశ్యకమెంతగానో ఉన్న యీ తరుణములో పూజ్యులు శ్రీమాన్ శ్రీభాష్యం వేంకట నరసింహ భాష్యకారాచార్యులు గారు ఛందోదర్పణమును పరిష్కరించి వ్యాఖ్యతో ప్రకటించుట సంతోషకరము. వ్యాఖ్యాన రచనకు కావలసిన పాండిత్యము, బోధనానుభవము శ్రీ ఆచార్యులుగారికి కలవని వేరేచెప్పనక్కరలేదు. ఈ గ్రంథ ముద్రణకు వలసిన సాయముచేసిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారికి వ్యాఖ్యాతలేకాక భాషాభిమానులందరు కృతజ్ఞులు కావలసినదే.

గ్రంథమును సుపరిష్కృతము చేయుటకు వ్యాఖ్యాతలు చాల పరిశ్రమించినారు. రెండు వ్రాత ప్రతులను గూడ సంప్రతించినారు. సన్నుగ వాండ్రై ప్రభాకర విశ్రమ భంగిగ మానిని భవ్యమగున్ (2-130) మాళై (3-37), శిఖి సంఖ్య (4-172) మొదలగు సాధుపాఠములు గ్రంథమున కెక్కుట ప్రశంసనీయము. ఆర్యల విషయమున శ్రీ గిడుగు-సీతాపతిగారు చక్కని వివరణములు చెప్పియున్నారు. వాని నుచితములగు మార్పులతో గ్రహించుటయే కాక 3-5 పద్యమునకు సొంతముగ వ్రాయుగు వివరణమును సైతముచెప్పుట మెప్పుగా మున్నది. వరాదికము చొరదు-అసలు పాఠమని (1-93) చెప్పబడెను; కాని ప్రాదులను వరాదులనుట అసంగతము. స్వాంతము (1-94) అను పాఠము గ్రహింపబడినది కాని 'స్వాంతము' అను దానికే ప్రయోగప్రసిద్ధి కలదు. కాన 'స్వాంతము' సాధుపాఠమనుట యుక్తము. స్వ+అన్త—అతి అది బంధనే—అని శ్రీ వేదుల రామశాస్త్రిగారి వివరణమునందే చెప్పబడియున్నది. శ్రీనంత పద్మనాభ (2-3) అను దిద్దుబాటు సరికాదు. లక్షణకర్త లక్ష్యము చూపవలసినది తెనుగు గద్యమునకు కాని సంస్కృత గద్యమునకు కాదు. 'నమస్తే నమస్తే నమః' అను దానినిబట్టి యిది సంస్కృత గద్యమనుకొనుట భ్రాంతిమూలకము. తెలుగున స్తుతిపరములగు దండకములలోను పద్యగద్యములలోను దీనిని వాడుట సంప్రదాయము. గద్యమునకు—చూ. భీమఖండము 3-211. నమయోక్తిన్—అనుచో (2-71) యా+ఉక్తి—అనుటకు వీలుండగా నవరణమును చెప్పుట తృప్తికరముకాదు. ధారుణీసుత నయన చకోరసరసిజారి (3-28) అను దానిని ధారుణీసుతానయన—అని వివరింపవలసినపని కానరాదు. ధారుణీసుతయొక్క—అని వ్యస్తముగ చెప్పకొనవచ్చును. పర్వ్రతులు—అను దానిని "మఱు ప్రతులు-అని దిద్దినారు. (3-71) పెర్వ్రతులు—లక్షణకర్త పాఠమయియుండును. 'పెరపడతులును (2-132) అని స్థలాంతరమున 'పెర' శబ్దము ప్రయుక్తము. పలికిరేనిని యతిభంగమగును (4-5) అను పాఠమును-పలికిరేనది యతిభంగమగును—అని దిద్దివేసినారు. 'నియతిశబ్దము యతిపర్యాయములలో నీతఁడు చెప్పలేదు' అని సెలవిచ్చినారు. కాని యిట పలికిరేని+యతి—అని సరియైన పదచ్ఛేదము. పలికిరేని + నియతి — అని తప్పుగా విరుచుట యీ దిద్దుబాటుకు హేతువు కాన త్యాజ్యము. ఆయవాయావల్-అనునది వ్యాకరణ దుష్టమయ్యు శ్రుతిరమ్యమగుటచే ఆవంతుని పాఠమనుట బాగు కాదు. (4-44) చనబుబిలనక్షొజా—అనుచో

గణభంగము ముద్రితము (4-109) 'బుట' అనుచో బుకారము గురువగుటలో యుక్తి లేదు. అగు అష్టబుఱిలును వె.డి హ్రస్వభావం, బగు (4-124) మున్నగుచోట్ల లఘుత్వమే ప్రయోగములందున్నది.

1-33 పద్యము సర్థము చేసికొనుటలో పూర్వేక్షణకర్తలు పొరపడినట్లు కన్పట్టును. వ్యాఖ్యాతలు చెప్పిన అర్థము ప్రకరణోచితమై యున్నది. లగ్రక్రియా చక్రనిర్మాణమును ఛందోదర్పణమునకు సరిపడు పద్ధతిలో వ్యాఖ్యానించి చూపుట శ్లాఘనీయము ఎఏలు, ఒఓలు-(1-84) అను వానిని వికల్పాదులలో చేర్చి ఎయ్యేలు, ఒయొవ్వాలు చేయవలెననుట సమంజసముగా లేదు. ముకార యతికి ఒత్వ విశిష్ట వ వర్గము పనికిరాదని అప్పకవి ముకారయతిని ప్రత్యేకించి చెప్పెననుట సరికాదు. ము విభక్తి వు-బు వర్ణముల కభిన్నమని భాషాచరిత్ర వలన తెలియును కావుననే ము విభక్తి యతియే ప్రాచీన కావ్యములలో ధారాళముగా కలదు. కవిజనాశ్రయాదులలోని లక్ష్యములు ము విభక్తి యతికి సరిపడునట్లే యున్నవి. ఇది ము వర్ణమునకు కాలక్రమమున వ్యాపించెను. దీనికి ప్రయోగములు విశేషములు. ఈ విషయ మప్పకవి పద్యమును సరిగా పరిశీలించినచో స్పష్టపడును. అచ్చట వప్పటను—అనియే అప్పకవియనెను (అప్పక 1-72). చేతన్ + అది = చేతది, చేతియది—అనుట పొరపాటు. అబు + పంచ = అర్వంచ — (3-37) ఇట కాకా సంబోధనే చాపి—అను ఆథర్వణకారిక సేవక్కరలేదు. చింతామణి చేతనే గసడదవాదేశము. ఇది వైకల్పిక మనుట సరికాదు. (1-62) ప్రథమవిభక్తి—అను రూపమునకు సమర్థన చెప్పబడినదికాని ప్రథమా—అనునది విభక్తి పేరనుటయే గ్రాహ్యము. ప్రథమా విభక్తి—అని గ్రహించుట లెస్స. ఇదెట్లు—కుసంధికి లక్ష్యము కాదు ఇదె బేహంబిదె—అది 5-241 మొ॥ భాషాభేదములలో గ్రామ్యమును చెప్పకపోవుట రమ్యమనిరి గాని యిది అసమగ్రత అనిపించుకొనును. ఒడయుడు—అనునది ద్రావిడసంబంధముగల పదము కనుక దేశి యను వివరణము సరికాదు. అప్పకవి యిచ్చిన ఉదాహరణములే కాక కేతన యిచ్చిన ఉదాహరణములును దీనిని ప్రతిఘటించును. 'తల' అను దానిని అచ్చ తెనుగునకు కేతన ఉదాహరించెను. తలై—త. తలె. క. అనను ఇది దేశి కుదాహృతము కాలేదు. ఉన్నతములై వనమయూరక్షితుల్ లి— (2-62) అనుచో 'లి' వర్ణము వా పదాంతే—అను సంస్కృత పద్ధతిచే గురువయ్యెనని చెప్పబడెను. ఇట్టి పద్ధతి తెలుగున కలదనుట కెట్టి ఆధారమును లేదు. కాన నిది నిర్మూల ప్రసంగము. దశరథాత్మజుండు స్వామి ధాత్రి కనగ (1-68) అనుచో 'వలపిన మాంధియుండు' అను లక్షణమునుబట్టి సంస్కృత పద్ధతిని అనంతుడు చెప్పెననుటకు కొంతయైన అవకాశమున్నది. ఇట్టి దీనిని—దశరథాత్మజుడే స్వామిధాత్రి కనగ—అని విస్పంకోచముగా దిద్దివేసిన వారు సంస్కృత పద్ధతిని లవలేశమయినను చెప్పుటకు వీలులేనిచోట 'వా పదాంతే' అను దానిని తెచ్చిపెట్టినారు. ఇంతకు ద్రుతద్విత్వము తప్పించుటకు త్రొక్కిన అపమార్గమిది. ద్రుతద్విత్వస్థలముల సమన్వయమును వివరించిన విస్తరమగును. చుట్టుఁబ్రావ — అనుదాని వివరణమున — సంధివెగ్గలు వాడమిన — అను కవిజనాశ్రయ లక్షణమునుబట్టి సమన్వయము చెప్పబడినట్లు కలదు. సంధి వెగ్గలువాడమిన శ్రుతిదుష్టమయ్యె—అను పాఠము ననుసరించి శ్రుతిదుష్ట లక్షణము చుట్టుఁబ్రావకు పట్టించినట్లు చెప్పవలసియున్నది. శరధి + ఇంద్రుడు, అభీష్టదం — మొదలగునవి అలవాటులో పొరపాటులు.

కొన్నిచోట్ల భోజరాజీయ ప్రయోగములను ఛందోదర్పణ లక్షణములకు సరిపెట్టవలెనను ప్రయత్నము చేయబడెను. ఛందోదర్పణమునందలి అర్ధబిందు ప్రాసమునకు భిన్నముగ ఉండరాదని 'తోకొమ'లో అరసున్న చేర్పవలెననబడెను. ఇది తోఁతెంచు—వంటిది అని సమర్థన చెప్పబడెను. తోఁచు + తెంచు = తోఁతెంచు —అయినది. తోఁచు—లో అరసున్న ఉండుటచే తోఁతెంచు—లో ఉన్నది. తోడు + కొను = తోకొను— అయినది. తోడు—లో అరసున్న లేదు. కావన తోఁతెంచు—తో పోలిక సరికాదు. ఒక పక్షమున క-క్ర-ప్రాసము తొలగించుటకు భోజరాజీయపద్యమున, క్రమ్మఱ—అను పాఠమును క్రమత—అని సవరింప వలెననబడెను. ఈ సవరణ తృప్తికరముగ లేదు. మరి

కొన్నిచోట్ల ఛందోదర్పణమున చెప్పబడని యతిప్రాస మైత్రుల నంగీకరించుటకు సిద్ధపడుటయు కలదు. విందుము-వంటి రూపములు కృతకములని భ్రాంతి పడి దడప్రాససాంకర్యమును అనంతుని కంటగట్ట యత్నించుట వింత. ఇట్లే — లేవక యున్న నీవతని దేవి వధింపుము-(భో౹ఇ 5-85) అను ముద్రణ మును పురస్కరించుకొని లదయతి అనంతునకు సమ్మతమేమో అనబడెను. ఇట్లున్నచో ఏ అక్షరమున కేఅక్షరముతోనైనను యతిమైత్రిని ముడిపెట్ట వచ్చును. ఇట, 'లేవగయున్న నీవతని లేమవధింపుము-' సాధుపాఠము కానోపును. 1-26 పద్యమున దథప్రాసముద్రితము. దీనినసంతుడు చెప్పలేదు. ప్రాచీన కవిప్రయోగములైనను చూపబడలేదు. దీనిని స్వవర్గజప్రాసమన్నారు. అప్పకవి 'అకొంటి' అను అపపాఠమును చూచి భ్రమతో ఇచ్చిన ఉదాహరణ మునుబట్టి వర్గాక్షరములు పరస్పరప్రాసమైత్రి నందునను కొనుట పొరపాటు. వ్యాఖ్యలో పొరపాటు లికను గలవు.

ఈనాటి లక్షణగ్రంథ వ్యాఖ్యలలో రెండు వింతధోరణులు కనబడును. (1) పీఠికలో చెప్ప వలసిన విషయములేవి? వ్యాఖ్యలో చెప్పవలసిన విషయములేవి? అని వివేచనలేకుండ రచనను చర్వితచర్వణముచేయుట (2) లక్ష్యలక్షణ సమన్వయము ప్రధానమగునట్లు లేనిపోని చమత్కారములనో, కవితావిశేషములనో, గ్రంథకర్త భక్తిభావమునో వివరించుచు పారవశ్యమునందుట. ఈరెండు లక్షణములు తత్త్వదర్శినిలోను కన్పట్టును. పాఠభేదములపట్టిక, భూమికలో చేర్చబడెను. ఇది పాఠకులకు క్లేశకరము. ఆయాపద్యములయొద్దనే క్రిందసూచించినచో బాగుండును. చర్చనీయాంశములు పెక్కులున్నను విస్తరభీతిచే ఇంతతో విరమించుచున్నాను.

ఛందోదర్పణమును పాఠముచెప్పు ఉపాధ్యాయులకు తత్త్వదర్శిని ఉపకరించుననుటలో సందేహము లేదు. వ్యాఖ్యాతల కృషి సర్వథా ప్రశంసాపాత్రమై ఉన్నది.

—ఆర్. వి.

## వెన్నెల కాటేసింది!

(నవల)

[రచన: శ్రీ గొల్లపూడి మారుతీరావు, ఎమెస్కో పాకెట్‌బుక్స్, యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు-1. వెల: రెండు రూపాయలు.]

పెద్దలైనవారు సమకాలిక సంప్రదాయాన్ని త్రోసిరాజని వారిపెద్దలపై తిరుగుబాటుచేసి తామెంచుకున్న దారి త్రొక్కినప్పుడు, వారి సంతతి కూడా అలాంటిపనే చేస్తే అమార్గాన్ని అనుసరించ కూడదని అడ్డుపడేహక్కు పెద్దలకు లేదు అని హితవు చెప్పడానికై వ్రాయబడిన నవల ఇది. అంత వరకూ బాగానేవుంది. కాని అంతకుమించి కథకుడు చెప్పిన మాటలు - అనగా 'భగవద్గీతమంచి మహాత్మా గాంధీవరకూ చెప్పిన అపూర్వమయిన సత్యానికి అందమైన విపర్యయం నీ జీవితం. కేవలం లక్ష్యాలు ఉన్నతమైనంతమాత్రాన ప్రయోజనంలేదు. దాన్ని చేరడానికి అనుసరించేమార్గమూ ఉన్నతమూ, పవిత్రమూ కావాలి. అలా కానప్పుడు నీతర్వాతితరాన్ని లక్ష్యంవైపే చూడమని అడగడానికి నీకేం అధికారం వుంది?' అని సాగదీయడమూ, ఆమెచేసింది తప్పు అని అనడమూ ఈ నవలలోని కథ దృష్ట్యా సబబు అనిపించవు. అప్రస్తుతం, అధికప్రసంగం అనికూడా అనిపిస్తాయి. ఎందుచేతనంటే ఈ కథలో నాయిక తప్పుపని ఏమీ చేయలేదు, చెడునడతకు పాల్పడలేదు. పైగా తాను ఎంచుకున్న జీవితం సుఖకరం కాక పోయినా దానికే అంటిపెట్టుకొనివుండి మౌనంగా కష్టాలు సహించింది. నవలలో ముఖ్యపాత్రలు రెండు ఒకరు కథకుడు, రెండవది సుబ్బులు అనే అమ్మాయి. కథకుడు సుబ్బుల్ని ప్రేమిస్తాడు. కాని ప్రేమికుడైన కథకుడు 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను. మనం పెళ్లి చేసుకుందాం. ఏమంటావు' అని సుబ్బులితో సూటిగా చెప్పలేదు. ప్రతిసన్నివేశంలో Suggestive గా ఆమెతో మాట్లాడుతూ కోరిక వున్నట్లుగా కనపరచి ఆమె response కోసం కనిపెట్టుకొని వుంటాడు. అప్పుడే స్నానంచేసి చీరె వొంటిచుట్టూ వొదులుగా చుట్టుకొని బాత్‌రూమ్‌లోనుంచి బయటికొచ్చే సుబ్బులి దర్శనాలు చేసుకొంటూ వుంటాడు

యవ్వనంలోవున్న ఆమె అతన్ని ప్రేమించడంలేదని ఎక్కడికక్కడ పరిశీలనగా చదివే పాఠకునికి మాత్రం స్పష్టంగా ఆమె వైఖరివల్ల తెలుస్తూనే వుంటుంది. కథకుడికి ఆమె చర్యలు అంతుపట్టవు ఎప్పటికప్పుడు ఏదో ఆశ పెంచుకుంటాడు. ఆ ఆశతో ఆమెను అనుసరిస్తూ తన వైఖరిని ఆమెకు బోధపరచాలని ప్రయత్నిస్తాడు. నవల ముప్పాతికభాగం ఈ దాగుడు మూతలతో నిండివుంది. ఇవి యౌవనారంభంలో వున్నవారికి ఆసక్తి గొల్పవచ్చును. కాని నవలా సాహిత్యంతో బాగా పరిచయం వున్నవారికి వారిద్దరి సంగతి ఎప్పటికి తేలదు అన్న చిరాకు కలగక తప్పదు. చివరకు నవల 140 పేజీలో ఆమె అదివరకే ఒకరికి మనసు ఇచ్చేసిందన్న సంగతి తెలియవస్తుంది. అతను తమిళుడు. అతన్ని తాను పెళ్ళాడకుండా పెద్దలు తెచ్చే సంబంధాలను తిరగగొట్టడానికై కథకునిపై తనకు ప్రేమ వున్నట్లుగా నటించి ఇతన్ని సాధనంగా వాడుకొని చివరి కితనితో తన మనసు ఫలానా వ్యక్తిపై వుందని చెప్పేస్తుంది. అంటే సుబ్బరి విషయంలో కథకునికి తెలిసింది తక్కువ, తెలియనిదే ఎక్కువ అని తెల్లమవుతుంది. అంతవరకూ ఆరాధ్యదేవత అయిన అమ్మాయి మోసం చేసిన స్త్రీ అవుతుంది అతనికి. దీనికంతటికీ అసలు ముఖ్య కారణం హీరోకు గల ఒకానొక దృక్పథం. అతను ఒక యువతిని చూశాడంటే ఆమె ఏదో కష్టాల్లో ఉన్నట్టూ, వెంటనే ఆమెకి తన అవసరం వున్నట్లూ ఊహించుకుంటాడు. అలా ఆమె చేష్టలన్నిటినీ ఊహించుకుంటూపోయి చివరకి పెద్ద ఆశాభంగం చెందుతాడు. తరువాతి కథను 22 ఏళ్ళు ముందుకితోసి, ఆమెకు పుట్టిన కొడుకు ఎం. బి. బి. ఎస్. చదువుతున్నవాడు పంజాబీ పిల్లను ప్రేమించి పెళ్ళి చేసుకోదలిస్తే, ఆమె అంగీకరించక, తనకు పరిచితుడైన కథకుడిని పిలిపించి కొడుక్కి హితవు చెప్పమంటుంది కాని కొడుకు వినడు. ఆమె కథను చెప్పి ఆమె ఆ జీవితంలో సుఖపడలేదన్న గుప్త సత్యాన్ని చెప్పినా 'ప్రేమించిన వ్యక్తిని దక్కించుకోడానికి ఏం చెయ్యాలో తెలీక సతమత మవుతూంటే— నీ కథ చెప్పించి నాకు మేలేచేశావు. అమ్మాయిని తీసుకొని నేను వెళ్ళిపోతున్నాను' అని నిష్క్రమిస్తాడు. ఆమెకు కన్నీరు మిగులుతుంది. చేతనా ప్రపంచంలో పొరపాట్లుచేస్తూ దిద్దుకొంటూ మళ్ళీ పొరపాట్లు చేస్తూ పయనించే జీవుని వేదనంతా ఆ కళ్ళల్లో ద్యోతకమయిందంటూ కథకుడు కథను ముగిస్తాడు.

ఈ నవలను పూర్తిగా చదివినమీదట నవలలో కొన్ని సాంఘిక మూల్యాలు, కొంత మానవతావాదపు ఛాయలు, కొంత కర్మసిద్ధాంతం ప్రభావం ఈ రచనను ఒకమెట్టు ఉన్నతస్థాయికి గొనిపోయాయని స్పష్టమవుతుంది. విడిపోవడంలో ఏకీభావానికి వచ్చిన ఇద్దరు యువతీయువకుల హృదయాలు విడిపోతూ మళ్ళీ మమతామాధుర్యాలలో బంధితాలయి స్పందించినవారి ఎడబాటుదృశ్యం హృదయవిదారకమైనదిగానూ, మహోత్తరమైన సన్నివేశంగానూ ప్రస్ఫుటమవుతుంది. 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు' అన్న గీతా వాక్యాన్ని రచయిత కథ చివరిపేజీలో పేర్కొనడం ఈ నవల పరమార్థాన్ని పాఠకులకు వివరించేదిగా వున్నది. రచన అంతటా రచయిత ఉవాచలు విస్తారంగా వుండి పాఠకుణ్ణి ఆలోచింపజేసేవిగానేవున్నాయి. ఒకచోట అంటాడు 'ఈ ప్రపంచంలో అందానికి అబ్బే ఔన్నత్యం అంతా కేవలం ఆ అందానిదేకాదు, దాన్నిచూసే దృష్టిది. చూడగల అభిరుచిదీను.' అలాగే వేరొకచోట 'ఆడది నిస్సహాయురాలనుకొని మగాడు జీవితంలో సంతృప్తిని అనుభవిస్తూంటాడు. మగాణ్ణి నిస్సహాయుణ్ణిచేసి మరులుగొల్పి ఆడది సంతృప్తి పడుతుంది.' అంటాడు—ఇలా ఏరాలంటే ఎన్నో భావగుచ్ఛాలు ఈ నవల నిండావున్నాయి. మానవ జీవితంపై రచయితకుగల ఆలోచనావాహిని ఈ భావ శకలాల-రూపంగా వ్యక్తమైంది. ఇవి కథలో సందర్భోచితంగావుండడం ఒకవిశేషం. అలాగే గమనించ దగిన కొన్ని ఉపమానాలూ వున్నాయి. ఉదాహరణకు 'చంద్రుడు కిలుంపట్టిన ఇత్తడి పళ్ళెంలాగ కనుపిస్తున్నాడు,' ఇత్యాదులు.

సాంఘిక వాస్తవికత, స్త్రీపురుష సంబంధాల నైజము, వాటి ఒడుదుడుకులు, పర్యవసానం, ఏతరం వారైనా మానవస్వభావం ఒకటే అన్న నీతిగల ఈ నవల పాఠకుల మెప్పును పొందుతుం దనడంలో సందేహం లేదు.

—డి. ఆర్.]

### ఎండ్రకాయ యుక్తి

పిల్లల కథలు. మూలం—వి హెచ్. సుబ్రహ్మణ్యశాస్త్రి. అనువాదం—శ్రీ వాకాటి పాండురంగరావు పుటలు 44. వెల—1-50 ప్రాప్తిస్థానం—ఎం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికిందరాబాద్.

### ఆంధ్రమహాభ్యుదయము

శ్రీ పొట్టి శ్రీరాములు జీవితం తెలిపే కావ్యం. రచయిత—శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యకవి. పుటలు—220. వెల—రు. 5—00. శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యకవి, వేటపాలెం, గుంటూరుజిల్లా.

### శ్రీ విజయాంకురము

ఉత్తర చరిత్ర తెలిపే కావ్యం. రచయిత—శ్రీ చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవి పుటలు—64. మూల్యం—1—72. ప్రాప్తిస్థానం—చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవి, మ్యునిసిపల్ హైయర్ సెకెండరీ స్కూలు, దానవాయిపేట, రాజమండ్రి—3.

### సంఘర్షణ సుద్దులు

శ్రీ సుంకర సత్యనారాయణగారి 'కష్టజీవి' బుర్రకథ ఆధారంగా, తెలంగాణా ప్రాంతంలో ప్రచారంలోవున్న గొల్లసుద్దులవంటి ప్రక్రియలో సాగిన రచన. రచయిత శ్రీ జి. వై. గిరి. పుటలు—34. వెల 0—50 ప్రాప్తిస్థానం—ప్రబోధసాహితి, వడ్లకొండ, జనగామ తాలూకా, వరంగల్ జిల్లా.

### శ్రీ తులసీదాసు

కావ్యం. రచయిత—శ్రీ శ్రీపాదలక్ష్మీ నారాయణమూర్తి పుటలు—100. వెల 1—75. ప్రాప్తిస్థానం—శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణా జిల్లా.

### దేవయాని

కావ్యం. రచయిత—శ్రీ వారు నాగనార్య. పుటలు 42. వెల—1—00. ప్రాప్తిస్థానం—శ్రీ వారు నాగనార్య. శ్రీ ఆత్మారామ విహారము, పి. కె. రాచపల్లి పోస్టు, వయా కోడూరు, కడపజిల్లా.

### శ్రీ వేంకటేశ పద్యరత్నావళి

శ్రీ వేంకటేశ్వర స్తోత్ర పద్యాలు. రచయిత శ్రీ జి. సుబ్రహ్మణ్యం పుటలు—122 వెల 1—25 ప్రాప్తిస్థానం—శ్రీ బి. సుబ్రహ్మణ్యం, వెంకటేశ్వర మెమోరియల్ మునిసిపల్ హైస్కూలు, తిరుపతి.

### బిల్వమాల

పద్యకృతి. రచయిత—శ్రీ వేదగిరి నరసింహ రాయశర్మ. పుటలు—10 వెల—లేదు. ప్రాప్తిస్థానం—రచయిత, జిల్లా పరిషదున్నత పాఠశాల, గుడూర్లు, నెల్లూరుజిల్లా.

### నివేదన

ఆధ్యాత్మికావేదన తెలిపే ఖండకావ్యం. రచయిత శ్రీ మేకా సుధాకరరావు, పుటలు—70. వెల—తెలియదు. ప్రాప్తిస్థానం—శ్రీ రాణీగారు, బొబ్బిలి రాజభవనం, బొబ్బిలి, శ్రీకాకుళంజిల్లా.

### అనుబంధాలు

నవల: రచయిత—శ్రీ దొండపాటి దేవదాసు. పుటలు—102. వెల 2—50. ప్రాప్తిస్థానం—జయలక్ష్మి పబ్లిషర్స్, మారుద్దీన్‌పేట, మచిలీపట్నం.

### మణికింకిణి

కవితా సంకలనం. రచయిత—శ్రీ వేముగంటి నరసింహాచార్యులు. పుటలు—58. వెల 1—00. ప్రాప్తిస్థానం—శ్రీ వెంకటేశ్వర బుక్ డిపో, సిద్ధిపేట, మెదక్ జిల్లా.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad.

Bharati November 7 th 1968 Regd. No. M. 1856

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 175/— | రు. 150/— |
| 2 లేక 3 వ కవరు పేజికి... | | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 150/— | రు. 125/— |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | రు. 125/— | రు. 100/— |
| అర పేజి | ... | రు. 65/— | రు. 55/— |
| పావు పేజి | ... | రు. 40/— | రు. 35/— |

ప్రత్యేక స్థానములకు 25 అదనం.

సం॥ నకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12—0—0 |
| 6 మాసముల చందా | ... | రు. 6—0—0 |
| విడి ప్రతి | ... | రు. 1—0—0 |

**మేనేజరు, భారతి.**

మద్రాసు—1.